# నవ్య

వీక్లి

9-8-2017

₹:20

ఆంధ్రజ్యోతి
ప్రచురణ
www.navyaweekly.com



- వరలక్ష్మీ వ్రతకల్పం
- ఓ వారాలబ్బాయి జయభేరి ప్రారంభం

## సరదాగా....

### రైట్ నెంబర్

**రాకేష్,** ఆకాష్ ఇద్దరూ మంచి మిత్రులు. ఒక రోజు రాకేష్ తన మిత్రునికి ఫోన్‌చేశాడు. ఎన్నిసార్లు చేసినా ఎంగేజ్డ్‌గానే ఉంటోంది ఫోను. దాంతో ఆకాష్ వాళ్ళింటికి వెళ్ళాడు. ఆకాష్ గదిలోకి వెళ్ళిన రాకేష్ ఒక్కసారి ఖంగుతిన్నాడు. ఎందుకంటే ఫోన్‌ని అదే పనిగా డయల్ చేస్తూనే ఉన్నాడు ఆకాష్.

**రాకేష్:** ఎవరికిరా ఫోన్ చేస్తున్నావు? అని అడిగాడు.

**ఆకాష్:** పాన్‌కార్డు బ్రోకర్‌కి రా... ఎన్ని సార్లు ఫోన్ చేసినా రాంగ్ నెంబర్ అనే సమాధానమే వస్తోంది.

**రాకేష్:** అసలది అతని నెంబరేనా? ఇంకోసారి చెక్ చేయకపోయావా?

**ఆకాష్:** ఎన్ని సార్లు రింగ్ ఇచ్చినా రాంగ్ నెంబరనే చెబుతోందిరా... మరి రైట్ నెంబరేదో ఎంత అడిగినా చెప్పటం లేదు...!!

### ఒక ప్రశ్న?

నవనీత్ డిగ్రీ చదివాడు. చదువుకు తగ్గ ఉద్యోగం దొరకలేదు. దాంతో ఏదో ఒకటి చేయాలి కాబట్టి పిజ్జా హట్‌లో చేరాడు. అక్కడ నచ్చక వేరే ఉద్యోగం కోసం ప్రయత్నాలు మొదలెట్టాడు. చివరికి డీటీడీసీ కొరియర్ సర్వీసులో డెలివరీ బాయ్‌గా చేరాడు. టూవీలర్ తప్పనిసరి కాబట్టి వాళ్ళనాన్నని బతిమాలి బామాలి ఎలాగో కొనిపించుకున్నాడు. నగరంలో ఖరీదైన మూడు ఏరియాల్లో అతను కొరియర్లు డెలివరీ చేయాల్సి ఉంటుంది. ఒకరోజున ఏదో పెద్ద గిఫ్ట్ బాక్సు డెలివరీ ఇవ్వాల్సి వచ్చింది. ఆ బాక్సుని తన బైక్ వెనక కట్టేసుకుని, దానిమీదున్న అడ్రస్‌కు వెళ్ళాడు. అపార్ట్‌మెంట్ కాదు. ఇండివిడ్యుయల్ హౌస్! గేటు బయటనుంచి చూస్తే, లోపల ఇంటిముందు చక్కటి పూలతోట కనువిందు చేస్తోంది. దాంతోపాటు మెయిన్‌గేటుకు 'కుక్క ఉన్నది జాగ్రత్త' అనే బోర్డు కూడా తగిలించి ఉంది. అసలే అతడికి కుక్కలంటే భయం. కాకపోతే ఈ ఉద్యోగం పోతే మళ్ళీ ఇంకో ఉద్యోగం వెతుక్కోవాలి కాబట్టి, అది ఇంకా భయపెట్టే విషయం కాబట్టి లోపలికి వెళ్ళడానికే నిశ్చయించుకున్నాడు. ఉద్యోగ భయం కుక్కల భయాన్ని డామినేట్ చేసేసింది. గేటు తెరవకుండానే లోపలికి తొంగిచూశాడు కుక్క ఎక్కడుందా? అని. కాస్తదూరంలో ఓ వేపచెట్టుకు కట్టేసి ఉందది. దాని మెడ చుట్టూ ఓ గొలుసు. అయితే ఆ గొలుసు ఎంత పొడుగుందంటే... అది మెయిన్‌గేటు వరకు రాగలదు. అప్పటికే నవనీత్‌ని చూసి మొరగడం మొదలెట్టిందా శునకం. మరి నవనీత్ ఆ కుక్కను తప్పించుకుని లోపలికి ఎలా వెళ్ళాడు? ఇదీ ప్రశ్న. బుర్రకు పదునుపెట్టి సమాధానం కనుక్కోండి.

**సమాధానం**

నవనీత్ గబగబా గేటు తెరిచి, ఆ కుక్కకు అందకుండా వేపచెట్టు చుట్టూ పరిగెత్తాడు. కుక్క కూడా నవనీత్‌ని వెంబడిస్తూ చెట్టు చుట్టూ ప్రదక్షిణలు చేసేసరికి, గొలుసు కాస్తా చెట్టుకి చుట్టుకుపోయింది. దాంతో నవనీత్ తన డ్యూటీని నిర్వర్తించి ఉద్యోగాన్ని నిలుపుకున్నాడు.

నాంపల్లి నుండి కోఠీ వరకు
గవర్నమెంటు వేలంలో పాడుకున్నాను
నేనొక్కడినే చేపలు పట్టాలి!!
భారీ వర్షాలు
హైదరాబాదు
రోడ్లు జలమయం

రోజూ చేపలు తిని బోరు కొడుతోంది
ఈరోజు ఎలాగైనా సరే కూరగాయలు
తీసుకురండి!!
నగరంలో
భారీ వర్షాలు..

అందుకేనే ఈ వర్షాకాలంలో
నేను బయటకు రాను!!
STOP



10

## సౌభాగ్యప్రదం వరలక్ష్మీవ్రతం

పతిని ప్రత్యక్ష దైవంగా భావించే మహాసాధ్వి చారుమతి. వరలక్ష్మీదేవి కలలో ఆమెకు సాక్షాత్కరించి సకల సౌభాగ్యాలూ సమకూర్చే వరలక్ష్మీ వ్రతకథా విధానం వివరించింది. శ్రావణపౌర్ణమి ముందువచ్చే శుక్రవారంనాడు ఈ వ్రతం ఆచరిస్తారు. ఆగస్టు 4 వరలక్ష్మీవ్రతం సందర్భంగా ఆ వ్రతకల్పం మీ కోసం.

38

### ఓ వారాలబ్బాయి జయభేరి

తెలుగు తెరపై మధ్యతరగతి పాత్రలను ప్రతిబింబించిన ప్రముఖ నటుడు, ప్రజాప్రతినిధి మురళీమోహన్. డాక్టర్ చల్లాభాగ్యలక్ష్మి రాస్తున్న ఆయన జీవన ప్రస్థానం ఈ వారం నుండీ.

70

### ఇంటర్వ్యూ

రోజా చిత్రంతో టీనేజ్ యువతుల కలల రాకుమారుడైపోయిన ప్రముఖ నటుడు, వ్యాపారవేత్త అరవిందస్వామి. జీవితంలో ఆయన ఎదుర్కొన్న ఆటుపోట్లు ఆయన మాటల్లోనే...

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



*ముఖచిత్రం:* ఓం వరలక్ష్మీ నమః


రచనలు, కథలు పంపవలసిన చిరునామా
*నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్33.* email: navyaweekly@andhrajyothy.com





### ముగ్గురు తాగుబోతులు

రాత్రి దొంగతనం చేసేందుకు, ధైర్యం కోసం పొద్దుటి నుంచీ తాగుతూ కూర్చున్నారో ముగ్గురు. రాత్రి అయింది. ముగ్గురూ దొంగతనానికి బయల్దేరారు. కనిపించిన బ్యాంకును దోపిడీ చేద్దామనుకున్నారు. బ్యాంకు కనిపించింది. దోపిడీకి పాల్పడ్డారు. బ్యాంకు తాళం తీసేందుకు ప్రయత్నిస్తోంటే పోలీసుజీపు సైరన్ వినవచ్చింది. దాంతో ముగ్గురూ దగ్గరగా ఉన్న పిట్టగోడ దూకి, అటుగా ఉన్న కోళ్ళఫారంలో పడ్డారు. ఖాళీ దాణాసంచులు కనిపించాయక్కడ. ముగ్గురూ మూడు సంచుల్లో దాగున్నారు. అంతలో పోలీసుల టుగా వచ్చారు. కనిపించిన ప్రతిదాన్నీ గుచ్చిగుచ్చి చూడసాగారు. ఖాళీసంచులుసహా ఉన్న మూడుసంచులు అనుమానాస్పదంగా కనిపించాయి వారికి. ఓ సంచిని తన్నారు. తెలివిగా అందులోని తాగుబోతు 'భౌభౌ' అన్నాడు. కుక్క అని సరిపెట్టుకున్నారు పోలీసులు. రెండో సంచిని తన్నారు. అందులోని తాగుబోతు 'మ్యాం మ్యాం' అన్నాడు. పిల్లి అని సరిపెట్టుకున్నారు పోలీసులు. మూడోసంచిని తన్నారు. 'కోళ్ళదాణాని! తన్ని పాడుచెయ్య కండెహె' కసురుకున్నాడు అందులోని తాగుబోతు.

### కష్టం

"ఏ(వండీ, తనకి తొందరగా పెళ్ళి చెయ్యమని అమ్మాయి ఒకటే పోరు పెడుతోంది. చెయ్యరా చెప్పండి, ఎవరితో ఒకరితో లేచిపోతానంటోంది."

"పెళ్ళికి అంత తొందరెందుకే?"

"ఎందుకంటే...తనకి బట్టలు ఉతుక్కోవడం చాలా కష్టంగా ఉందట.".

### నిద్ర

"డాక్టర్! నాకీమధ్య సరిగా నిద్రపట్టడం లేదండీ?"

"ఏదైనా గవర్నమెంట్ ఉద్యోగం చూసుకోండి, మీ సమస్య ఇట్టే తీరిపోతుంది."

### అక్క

"అయ్యయ్యో! చెరువులో మా అక్కపడి పోయింది. కాపాడండి కాపాడండి." అంటూ అరి చాడో కుర్రాడు. అంతే! గట్టుమీది నలుగురు యువ కులు వెంటనే చెరువులో దూకి ఓ ఎనభై ఏళ్ళ ముస లామెను గట్టుకి చేర్చారు.

"మీ అక్కకోసం వెదుకుతోంటే ఈ ముసలామె దొరికింది. మీ అక్క దొరకలేదు." చెప్పారు యువ కులు.

"పడిపోయింది మా బామ్మే! కాపాడండి అంటే ఎవరూ కాపాడరుగా! అందుకే అక్క అని అరచాను." అన్నాడు ఆ కుర్రాడు.

–వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 14 సంచిక: 23

9-8-2017

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



# మొదటి పేజి

## వరలక్ష్మీవ్రతం

నాగావళీపరివాహకప్రాంతం భగీరథీపురం లేదూ, ఆ పురానికి అయిదారుమైళ్ళదూరంలో 'శిలాసంధి' అని ఓ పెద్ద గుహ ఉంది. ఆ గుహలో ఏనాటివో, ఎవరివో రకరకాల బొమ్మలు చెక్కినవీ, గీసినవీ చాలా ఉన్నాయి. అవి ఈ మధ్యే బయట పడ్డాయి. వాటిని చూసేందుకు జనం తండోపతండాలుగా తరలి వస్తున్నారు. పచ్చనిచెట్లు, ప్రవహించేనది, పురాతన ఆలయాలు, ప్రశాంతవాతావరణం అంటే ఇష్టం లేనిదెవరికి? అందుకే కట్టగట్టుకుని మరీ యాత్రాసర్వీసుల్లో దిగబడుతున్నారక్కడ. అలా దిగబడ్డదే దీక్షితులు కుటుంబం కూడా.

భార్య, కూతురు, కొడుకు, అల్లుడుసహా దీక్షితులు స్నానం చేసేందుకు నాగావళిగట్టుకు చేరుకున్నాడు. స్నానాలరేవుదగ్గర మెట్లు దిగుతోంటే ఓ మహిళ కనిపించిందతనికి. ఆమెకు ముప్పయి...ముప్పయి ఐదేళ్ళ వయసు ఉంటుంది. అందంగా ఉంది. భుజాన్న సంచీవేలాడేసుకుని, ఓ మూలగా ఒంటరిగా కూర్చుని, శూన్యంలోకి చూస్తూ ఉంది. ఎందుకో ఆసక్తి కలిగింది దీక్షితులుకి. వెళ్ళి ఆమెను పలకరించాడు. నీ పేరేంటని అడిగాడు. సమాధానం లేదు. మీదేవూరు? అడిగాడు. సమాధానం లేదు. ఇక్కడకి ఎలా వచ్చావు? ఎందుకొచ్చావు? అని అడిగాడు. వాటికీ సమాధానం లేదు. సన్నగా నవ్వి చూస్తోందంతే! పాపం అనిపించింది దీక్షితులుకి. జాలిచెందాడు. డబ్బు కావాలా? అడిగాడు. పర్సులోంచి అయిదువందలనోటు తీసి ఇవ్వబోయాడు. తీసుకోలేదామె. మనకెందుకండీ ఈ లంపటం? రండంటూ చేయిపట్టుకుని లాగుతుంటే, భార్యని వారించి, ఆ మహిళని అడిగాడు దీక్షితులు. ఆకలిగా ఉందా? అవునన్నట్టుగా తలూపిందామె. దానికి ఆనందించి, స్నానాలు చేసి వస్తాం, అప్పుడు అందరం హోటల్‌కి వెళ్దాం. నువ్విక్కడే ఉండు అన్నాడు దీక్షితులు. సరేనన్నట్టుగా తలూపితే, మా మహాలక్ష్మి అని ఆమె తలనిమిరాడు. మహాలక్ష్మికాదు, వరలక్ష్మి అందామె. అబ్బో అబ్బో నోరు విప్పింది ఆఖరికి అని నవ్వాడు దీక్షితులు.



స్నానాలు చేసి హోటల్‌కి చేరుకున్నారంతా. నీకేం కావాలంటే అది తిను. కడుపునిండా తిను వరలక్ష్మికి చెప్పాడు దీక్షితులు. అలాగేనన్నట్టుగా తలూపి, సాంబారిడ్లీ, పెసరట్టుప్మా తిన్నదామె. చట్నీలోని కారాన్ని తట్టుకోలేక కన్నీరు పెట్టుకుంది. అప్పుడు చిన్నకప్పులో పంచదార తీసుకొచ్చి అందిస్తే కృతజ్ఞతగా దీక్షితుల్ని చూసింది. ఆకలితీర్చాడు. అయిపోయిందనుకున్నాడు. వస్తాం వరలక్ష్మీ అని వెళ్ళబోతుంటే దీక్షితులి చెయ్యి పట్టుకుంది వరలక్ష్మి. కూడా వస్తానన్నట్టుగా చూసింది. అనుకున్నాను, ఇలాంటిదేదో జరుగుతుందని, ఇప్పుడేం చేస్తారు? అడిగింది భార్య. రానీ! ఎంత వరకూ వస్తుందో చూస్తాను అన్నాడు దీక్షితులు. వరలక్ష్మిని వెంటబెట్టుకుని ముందుకు నడిచాడు. అంతా రామాలయానికి చేరుకున్నారు. అక్కడ వడపప్పు ప్రసాదంగా పెడితే స్వీకరించారు. శివాలయానికి వెళ్ళారు. అక్కడ కొట్టిన టెంకాయని పంచుకుని తిన్నారు. తర్వాత అమ్మవారిని దర్శించుకున్నారు. కుంకుమబొట్టు పెట్టుకున్నారంతా. వరలక్ష్మికి బొట్టుపెట్టి, దగ్గరగా తీసుకున్నది దీక్షితులు భార్య. కలసి వస్తున్న వరలక్ష్మిని వేరుగా చూడలేకపోయిందామె. చివరగా శిలాసంధిని చేరుకున్నారు. లోపలంతా చీకటిగా ఉంది. బొమ్మలేవీ కనిపించడం లేదు. అప్పుడు భుజాన్న వేలాడుతున్న సంచీలోంచి టార్చ్‌లైటు తీసి, అందించింది వరలక్ష్మి. తెలివైనదే అన్నాడు దీక్షితులు. టార్చ్‌వెలుగులో బొమ్మలన్నీ చూసి బయటపడ్డారు.

ఆసరికి సాయంత్రం అయింది. తిరుగుప్రయాణానికి సిద్ధమవుతూ వరలక్ష్మి గురించి ఆలోచిస్తోంటే... తన గురించి ఆలోచించి ఆందోళన చెందనవసరం లేదన్నదామె. అయినా ఆమెను ఒంటరిగా వదలి వెళ్ళడం ఇష్టంలేక కళవళపడుతోంటే... తానెవరో, ఏమిటో అంతా వివరంగా చెప్పుకొచ్చిందప్పుడు వరలక్ష్మి. విని దీక్షితులు కుటుంబం దిగ్భ్రాంతి చెందింది. పేరుమోసిన ఓ పెద్దకంపెనీకి వరలక్ష్మి వైస్‌ప్రెసిడెంట్. వృత్తిరీత్యా అనేక సమస్యలూ, సవాళ్ళూ ఎదుర్కొంటోందామె. రిలాక్సేషన్ కావాలి. దానికి ఒంటరితనమూ, మౌనమే మందు అని తెలుసుకున్నది. అన్నీ అదుపులో పెట్టుకుని జీవిస్తే ఆనందించడం కష్టం. అప్పుడప్పుడూ బంధనాలు తెంచుకోవాలి. సరదాగా తమాషాగా గడపాలి. అది నియమంగా పెట్టుకుందామె. అందుకే శిలాసంధికి చేరుకున్నానన్నది. తనని అభిమానించి, ఆదరించినందుకు పేరుపేరునా కృతజ్ఞతలు తెలియజేసింది వరలక్ష్మి. అపేక్ష కనబరిచిన దీక్షితులుకి చేతులుజోడించి నమస్కరించింది. ఖరీదైన కారు వచ్చి ఆగితే, అది ఎక్కి హాయిగా వెళ్ళిపోయింది.

**గడియారంలా బతకడం కంటే దిక్సూచిలా బతకడంలో అర్థం ఉంది. ఆలోచించండి!**

నవ్య




**బుధవారం: 2 ఆగస్టు 2017**

శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, శ్రావణమాసం, శుక్లపక్షం
తిథి: దశమి మ. 2.14 తదుపరి ఏకాదశి
నక్షత్రం: అనూరాధ మ. 3.16 తదుపరి జ్యేష్ఠ
వర్జ్యం: రా. 9.34 నుంచి 11.22 వరకు
దుర్ముహూర్తం: ఉ. 11.56 నుంచి 12.47 వరకు
అమృతఘడియలు: లేవు
రాహుకాలం: మ. 12.00 నుంచి 1.30 వరకు
సూర్యోదయం: 5.59
సూర్యాస్తమయం: 6.45

**గురువారం: 3 ఆగస్టు 2017**

శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, శ్రావణమాసం, శుక్లపక్షం
తిథి: ఏకాదశి సా. 4.37 తదుపరి ద్వాదశి
నక్షత్రం: జ్యేష్ఠ సా. 6.13 తదుపరి మూల
వర్జ్యం: రా. 3.09 నుంచి 4.56 వరకు
దుర్ముహూర్తం: ఉ. 10.14 నుంచి 11.05 వరకు, మ. 3.20 నుంచి 4.11 వరకు
అమృతఘడియలు: ఉ. 8.21 నుంచి 10.08 వరకు
రాహుకాలం: మ. 1.30 నుంచి 3.00 వరకు
సూర్యోదయం: 5.59
సూర్యాస్తమయం: 6.44

**శుక్రవారం: 4 ఆగస్టు 2017**

శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, శ్రావణమాసం, శుక్లపక్షం
తిథి: ద్వాదశి రా. 6.52 తదుపరి త్రయోదశి
నక్షత్రం: మూల రా. 9.02 తదుపరి పూర్వాషాఢ
వర్జ్యం: రా. 7.15 నుంచి 9.02 వరకు
దుర్ముహూర్తం: ఉ. 8.32 నుంచి 9.23 వరకు, మ. 12.47 నుంచి 1.38 వరకు
అమృతఘడియలు: మ. 1.58 నుంచి 3.41 వరకు
రాహుకాలం: ఉ. 10.30 నుంచి 12.00 వరకు
సూర్యోదయం: 6.00
సూర్యాస్తమయం: 6.44

**శనివారం: 5 ఆగస్టు 2017**

శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, శ్రావణమాసం, శుక్లపక్షం
తిథి: త్రయోదశి రా. 8.52 తదుపరి చతుర్దశి
నక్షత్రం: పూర్వాషాఢ రా. 11.35 తదుపరి ఉత్తరాషాఢ
వర్జ్యం: ఉ. 7.39 నుంచి 9.25 వరకు
దుర్ముహూర్తం: ఉ. 6.00 నుంచి 6.51 వరకు
అమృతఘడియలు: సా. 6.17 నుంచి 8.03 వరకు
రాహుకాలం: ఉ. 9.00 నుంచి 10.30 వరకు
సూర్యోదయం: 6.00
సూర్యాస్తమయం: 6.44

**ఆదివారం: 6 ఆగస్టు 2017**

శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, శ్రావణమాసం, శుక్లపక్షం
తిథి: చతుర్దశి రా. 10.29 తదుపరి పూర్ణిమ
నక్షత్రం: ఉత్తరాషాఢ రా. 1.46 తదుపరి శ్రవణం
వర్జ్యం: ఉ. 8.19 నుంచి 10.04 వరకు
దుర్ముహూర్తం: సా. 5.01 నుంచి 5.52 వరకు
అమృతఘడియలు: రా. 6.48 నుంచి 8.32 వరకు
రాహుకాలం: సా. 4.30 నుంచి 6.00 వరకు
సూర్యోదయం: 6.00
సూర్యాస్తమయం: 6.43

**సోమవారం: 7 ఆగస్టు 2017**

శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, శ్రావణమాసం, శుక్లపక్షం
తిథి: పూర్ణిమ రా.11.41 తదుపరి పాడ్యమి
నక్షత్రం: శ్రవణం తె. 3.33 తదుపరి ధనిష్ఠ
వర్జ్యం: ఉ. 6.04 నుంచి 7.47 వరకు
దుర్ముహూర్తం: మ. 12.47 నుంచి 1.38 వరకు, మ. 3.19 నుంచి 4.10 వరకు
అమృతఘడియలు: సా. 4.23 నుంచి 6.06 వరకు
రాహుకాలం: ఉ. 7.30 నుంచి 9.00 వరకు
సూర్యోదయం: 6.00
సూర్యాస్తమయం: 6.43

**మంగళవారం: 8 ఆగస్టు 2017**

శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, శ్రావణమాసం, కృష్ణపక్షం
తిథి: పాడ్యమి రా 12.26 తదుపరి విదియ
నక్షత్రం: ధనిష్ఠ తె. 4.53 తదుపరి శతభిషం
వర్జ్యం: ఉ. 7.46 నుంచి 9.27 వరకు
దుర్ముహూర్తం: ఉ. 8.33 నుంచి 9.24 వరకు, రా. 10.24 నుంచి 11.08 వరకు
అమృతఘడియలు: సా. 5.54 నుంచి 7.35 వరకు
రాహుకాలం: మ. 3.00 నుంచి 4.30 వరకు
సూర్యోదయం: 6.01, సూర్యాస్తమయం: 6.42

## మెయిల్ బాక్స్

### అంతా మేడిపండు తీరే

అబ్బా, ఏ డిపార్ట్‌మెంట్ చూసినా మేడిపండు తీరే. ప్రభాకర్‌జైనిగారి సీరియల్ లాకర్ నెంబర్ 369 చదువుతుంటే తెలియని వ్యవహారాలు బయటపడుతున్నాయి. 'విజయవిలాసం' కూడా బాగుంది.

—పొత్తూరి విజయలక్ష్మి, ఈ–మెయిల్

### బలీయమైన కృతజ్ఞతాభావం

మొదటిపేజి 'కృతజ్ఞత' మానవ సంబంధాలను సదృక్కోణంలో సమీక్ష చేయడమేకాక, కృతజ్ఞతాభావం ఎంత బలీయంగా ఉంటుందో రసరమ్యంగా చెప్పారు. ఆర్ద్రత, మానవీయత సమపాళ్ళలో రంగరించుకున్న ఈ రచన హృదయాలను కదలించింది.

మార్నింగ్ కాఫీలో వందరూపాయలు కథ ఊహించని మలుపుతో అద్భుతంగా ఉంది. తృప్తినీ, మధురానుభూతినీ కలిగించింది. అయినవాళ్ళు కథ చక్కగా నడిపించారు రచయిత. అతిసర్వత్ర వర్జయేత్ కథ రెండవసారి కూడా చదివించింది.

—డా.శివభూషణం, కర్నూలు

### కొత్త శీర్షికలతో చూడముచ్చట

రెజీనా ముఖచిత్రం వీక్లీ చూడముచ్చటగా, కొత్త అందాలు సంతరించుకుంది. శుభవేళ, సంగతులూ–సందర్భాలూ, జీవన తరంగాలు, విజయవిలాసం... మరెన్నో కొత్తశీర్షికలతో నవ్యంగా అలంకరించారు. ప్రభాకర్‌జైని రచన చాలా విశ్లేషణతో ఉంటుంది. సినీవాలి నవల చదివినప్పుడు ఆయన సినిమా మనిషనిపించింది. ఇప్పుడు లాకర్ నెంబర్ 369 చదువుతుంటే ఆయన బ్యాంకు ఉద్యోగి అనిపిస్తోంది. ఈ నవలలో అన్నీ అక్షర సత్యాలే. సలీమ్ గారి నవల అన్వేషణ అరంభమే అదిరింది.

—ఆర్వీజి కృష్ణప్రసాద్, సికింద్రాబాద్

### బాగున్నాయ్

అయినవాళ్ళు కథ చాలా బాగుంది. అతి సర్వత్ర వర్జయేత్ కథ చదువుతున్నంతసేపు భలే నవ్వించింది. కార్టూన్లు కడుపుబ్బ నవ్వించాయి.

—ఎస్.టి.పి.రంగనాయకమ్మ, విజయవాడ

### నవ్వించే డాక్టర్లు

'మరో ఇరవైనాలుగు గంటలు గడిస్తేగానీ చెప్పలేం' అని చెప్పే డాక్టర్లనే చూశాం, కానీ ఇప్పుడు విచిత్ర వేషాలతో రోగుల్ని ఆహ్లాదపరిచి నవ్వించే డాక్టర్లు వస్తున్నారనే శుభవార్త మమ్మల్ని ఆకట్టుకుంది. 'హరివంశం'లో సప్త వృషభ సంహారం కళ్ళకు కట్టినట్టు వివరించారు.

—ఎన్.గిరిధర్, కాకినాడ

### సీరియల్స్ ఉత్కంఠభరితం

నవ్య వీక్లీ ఆద్యంతం ఆకట్టుకుంటోంది. విభిన్నమైన ఇతివృత్తాలతో ఇటీవల ప్రారంభమైన సీరియల్స్ 'స్టార్ ఫైటర్', 'నిధి' ఉత్కంఠ భరితంగా సాగుతున్నాయి. 'ప్రయాణం' సీరియల్ సేఫ్‌గా ముగిసింది. 'సంగతులూ–సందర్భాలూ' వినోదం పంచిస్తోంది.

—శివలెంక చంద్రశేఖర్, హైదరాబాద్

### మ్యాజిక్ ట్రీట్‌మెంట్

నవ్వుతూ ఉండేవారే ఎక్కువకాలం బతుకుతారని నవ్వుల డాక్టర్ల మ్యాజిక్ ట్రీట్‌మెంట్‌లో తెలుసుకున్నాం. ఇంద్రగంటి శ్రీకాంతశర్మగారి 'సంగతులూ సందర్భాలూ' మహాద్భుతం. 'అర్థంలేని ఆత్మాభిమానాలు' కథ హృదయాలను కదిలించింది.

—జి.వి.మురళీమోహన్, ముచ్చుమిల్లి తూ.గో.జిల్లా

# ఫీల్ ద జైల్!



ఏదైనా నేరం చేస్తేనో లేక చట్టాన్ని అతిక్రమిస్తేనో తప్ప జైలుకు తీసుకెళ్లరు. అలా ఖైదీలుగా ఉన్నవారికి జైలులో క్రమశిక్షణ నేర్పించి ఉత్తమ మైన పౌరులుగా తిరిగి సమాజంలోకి పంపిస్తారు. కానీ అక్కడ మాత్రం ఓ ఐదువందల రూపాయలు ఇస్తే చాలు మీరు ఏనేరం చేయకపోయినా సరే ఒక రోజంతా జైల్లో పెట్టి పంపిస్తారు. ఒకేఒక్కడు సినిమాలో ఒకరోజు సిఎం లాగా ఇలా ఒకరోజు ఖైదీ జీవితం గడపడానికి చాలామందే క్యూ కడుతున్నారట. ఇదేంటి? ఐదువందలు ఇవ్వడమేంటి? జైలు జీవితం గడపడమేంటి? వినడానికే విచిత్రంగా ఉందే అనుకుంటున్నారా? ఈ జైలు ఎక్కడో లేదు హైదరాబాద్‌కి దగ్గరలోనే మెదక్ జిల్లా సంగారెడ్డిలో ఉంది.

## అత్యంత పాతది

చంచల్ గూడ, రాజమండ్రి, వరంగల్ సెంట్రల్‌జైళ్లు చాలా పాతవి. అంతకన్నా పాతది ఈ సంగారెడ్డి జైలు. 1796లో నిజాం రాజులు తమ గుర్రాలకు ఒక గుర్రపుశాల నిర్మించారు. కాలక్రమంలో తెలంగాణ సాయుధ పోరాటం, స్వాతంత్ర్యపోరాటంలో పాల్గొన్న వారిని శిక్షించేందుకు ఆ గుర్రపుశాలను కారాగారంగా ఉపయోగించారు. తర్వాత కాలంలో అది న్యాయశాఖ, ఆరోగ్య శాఖ కార్యకలాపాల కోసం ఉపయోగించారు. స్వాతంత్ర్యం అనంతరం 1977లో ఈ భవనాన్ని జైళ్లశాఖకు బదలాయించారు. అప్పటినుంచి ఇది సంగారెడ్డి జిల్లా జైలుగా మారిపోయింది. రెండు శతాబ్దాల నాటి కట్టడం కావడం, రోజురోజుకు నేరస్థుల సంఖ్య పెరగడం, జైళ్ల శాఖలో సంస్కరణలు వంటి కారణాల వల్ల ఈ జైలును కొత్త బిల్డింగ్‌కు తరలించారు. దాంతో గత నాలుగేళ్లుగా ఈ పాత జిల్లా జైలు శిథిలావస్థకు చేరుకుంది.

## ఒకరోజు ఖైదీ జీవితం

ఇలా ఎంతో చరిత్ర కలిగిన ఈ జైలు శిథిలావస్థకు చేరడం జైళ్లశాఖ డైరెక్టర్ జనరల్ వినయ్‌కుమార్‌కు బాధకలిగించింది. దాంతో ఈజైలు చరిత్రను భవిష్యత్తు తరాలకు అందించే ఉద్దేశంతో తెలంగాణా చరిత్ర, జైలు చరిత్రను అక్కడ భద్రపరిచారు. అంతేకాక దేశంలో ఎక్కడా లేని విధంగా 'ఫీల్ ద జైల్' పేరుతో వినూత్న కార్యక్రమం ప్రారంభించారు. ఇందులో భాగంగా 500 రూపాయలు చెల్లిస్తే చాలు ఒకరోజంతా జైలు జీవితం ఎలా వుంటుందో తెలుసుకోవచ్చు. ఆరోజంతా వారిని ఖైదీలుగానే పరిగణిస్తారు. వారికి లాకప్ కేటాయిస్తారు, వేషధారణ కూడా పూర్తిగా ఖైదీల తరహాలోనే ఉంటుంది. అంటే ఖాదీ నిక్కర్, ఖాదీ షర్టు, ప్లేటు, గ్లాసు, మగ్గు, దుప్పటి. ఇలా వారి మాన్యువల్‌లో ఏవైతే ఉంటాయో అవన్నీ 'ఫీల్ ద జైల్' కోసం వచ్చిన వారికి ఉంటాయి. ఖైదీలకు ఎలాంటి భోజనం పెడతారో అచ్చంగా అదే తరహ తిండి పెడతారు. ఖైదీలు ఎలాంటి టైంటేబుల్ ఫాలో అవుతారో, వాళ్లూ అదే ఫాలో కావాలి. సూర్యోదయానికి ముందే ఖైదీ జీవితం మొదలవుతుంది. ఉదయం ఆరింటికి ప్రారంభమైన వారి దినచర్య యోగా మెడిటేషన్ తర్వాత స్నానం, 8 గంటలకు టిఫిన్, పదిన్నరవరకు స్టడీ అవర్, 11 నుంచి 12 మధ్య లంచ్. 12 నుంచి ఒంటిగంట వరకు రెస్ట్. మధ్యాహ్నం 1 నుంచి 4 వరకు మళ్లీ స్టడీ అవర్. టీ బ్రేక్ తర్వాత 4 నుంచి 5 వరకు పరేడ్. ఆరింటికల్లా డిన్నర్ పూర్తవుతుంది. ఆరున్నరకు బ్యారక్ తాళం పడుతుంది. అంతేకాదు ఖైదీగా బందీ కావాలంటే కొన్ని రూల్స్ తప్పనిసరిగా పాటించాలి. ఒకరోజు ఖైదీ అనుభవం కోసం వచ్చిన వాళ్లు మొబైల్ తీసుకురాకూడదు. ఒకసారి లోపలకి ఎంటరై ఖైదీగా మారితే 24 గంటల పాటు తప్పకుండా ఉండి తీరాల్సిందే. మధ్యలో తూచ్ అంటానంటే కుదరదు. ఒకరోజు ఖైదీగా గడపడానికి వచ్చిన వారు సాధారణ ఖైదీల్లాగే ఎవరి పనులు వారే చేసుకోవాలి. బ్యారక్ శుభ్రం చేసుకోవాలి. ప్లేట్లు, గ్లాసులు కడుక్కోవాలి. ఖైదీల జీవితంతో పాటు, జైళ్ళ సంస్కరణల దిశగా ఈ వినూత్న కార్యక్రమం ఏర్పాటు చేశామని అక్కడి అధికారులు చెబుతున్నారు.

ఆగస్టు 4

**వరలక్ష్మీవ్రతం**

సందర్భంగా...



# సౌభాగ్యప్రదం వరలక్ష్మీవ్రతం

## శ్రీ వరలక్ష్మీ వ్రత కల్పము

ఓం సిద్ధి బుద్ధి సమేత శ్రీ మహాగణాధి పతయే నమః

ఓం లక్ష్మీ నారాయణాభ్యాం నమః

ఓం ఉమామహేశ్వరాభ్యాం నమః

ఓం వాణీ హిరణ్యగర్భాభ్యాం నమః

ఓం శచీపురంధరాభ్యాం నమః

ఓం మాతాపితృచరణ కమలేభ్యో నమః

ఓం కులదేవతాభ్యో నమః

ఓం ఇష్టదేవతాభ్యో నమః

ఓం స్థాన దేవతాభ్యో నమః

ఓం వాస్తు దేవతాభ్యో నమః

ఓం సర్వేభ్యో దేవేభ్యో నమః

ఓం సర్వేభ్యో బ్రాహ్మణేభ్యో నమః

ఏవంగుణ విశేషణ విశిష్టాయామస్యాం, శుభ తిథౌ, అస్మాకం సహకుటుంబానాం క్షేమస్థైర్య విజ యాయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధ్యర్థం ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ ఫల పురుషార్థ సిద్ధ్యర్థం సత్సంతాన సౌభాగ్య శుభఫలావాప్త్యర్థం వర్షే వర్షే ప్రయుక్తాం వరలక్ష్మీ ముద్దిశ్య వరలక్ష్మీ ప్రీత్యర్థం భవి ష్యోత్తర పురాణ కల్పోక్త ప్రకారేణ యావచ్ఛక్తి ధ్యానావాహ నాది షోడశోపచార పూజాం కరిష్యే, తదం గత్వేన కలశపూజాం కరిష్యే.

### ఏవం కలశపూజా

కలశస్య ముఖే విష్ణుః కంఠే రుద్ర స్సమాశ్రితః
మూలేతత్ర స్థితో బ్రహ్మామధ్యేమాతృగణాఃస్మృతాః
కుక్షౌతు సాగరాస్సర్వే సప్తద్వీపా వసుంధరా
ఋగ్వేదోథ యజుర్వేదస్సామవేదోహ్యథర్వణః
అంగైశ్చ సహిత స్సర్వే కలశాంబు సమాశ్రితాః

ఆపోవా ఇదగ్‌ం సర్వం విశ్వాభూతా న్యాపః ప్రాణావాపః పశవ ఆపోన్న మాపో మృత మాపస్స మ్రడాపో విరాడాప స్స్వరాడాప శ్ఛందాగ్‌ం స్యాపో జ్యోతిగ్‌ష్యాపో యజూగ్‌ం ష్యాప స్సత్యమాప స్సర్వా దేవతా ఆపో భూర్భువస్సువరాప ఓమ్

ఆయాంతు లక్ష్మీ పూజార్థం దురితక్షయకారకాః
గంగేచ యమునేచైవ గోదావరి సరస్వతి
నర్మదే సింధు కావేరీ జలేస్మిన్ సన్నిధిం కురు

**ధ్యానం:** సహస్రదళ పద్మాస్యాం స్వస్థాంచ సుమనోహరాం
శాంతాంచ శ్రీహరేః కాంతాం తాం భజే జగతాం ప్రసూం
పద్మాసనే పద్మకరే సర్వలోకైక పూజితే
నారాయణప్రియే దేవి సుప్రీతాభవ సర్వదా
క్షీరోదార్ణవ సంభూతే కమలే కమలాలయే
సుస్థిరా భవ మే గేహే సురాసుర నమస్కృతే
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః ధ్యాయామి ధ్యానం సమర్పయామి

**ఆవాహనం:** సర్వమంగళ మాంగళ్యే విష్ణువక్షస్థలాలయే
ఆవాహయామి దేవి త్వాం సుప్రీతాభవ సర్వదా
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః ఆవాహయామి, ఆవాహనం సమర్పయామి

**రత్నసింహాసనం:** సూర్యాయుత నిభస్ఫూర్తే
స్ఫురద్రత్న విభూషితే
సింహాసన మిదం దేవి స్థీయతాం సురపూజితే
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః రత్నసింహాసనం సమర్పయామి

**అర్ఘ్యం:** శుద్ధోదకం చ పాత్రస్థం గంధ పుష్పాది మిశ్రితం
అర్ఘ్యం దాస్యామితే దేవి గృహాణ సురపూజితే
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః అర్ఘ్యం సమర్పయామి

**పాద్యం:** సువాసిత జలం రమ్యం సర్వతీర్థ సముద్భవం
పాద్యం గృహాణ దేవి త్వం సర్వదేవ సమస్కృతే
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః పాద్యం సమర్పయామి

**ఆచమనీయం:** సువర్ణకలశానీతం చందనాగరు సంయుతం
గృహాణాచమనం దేవి మయాదత్తం శుభప్రదే
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః ఆచమనీయం సమర్పయామి

**పంచామృతం:** పయోదధిఘృతోపేతం శర్కరామధు సంయుతం
పంచామృతస్నానమిదం గృహాణ కమలాలయే
శ్రీవరలక్ష్మీ దేవతాయైనమః పంచామృత స్నానం సమర్పయామి

**శుద్ధోదక స్నానం:** గంగాజలం మయానీతం మహాదేవశిరః స్థితం
శుద్ధోదక స్నానమిదం గృహాణ విధుసోదరి
శ్రీవరలక్ష్మీ దేవతాయైనమః స్నానం సమర్పయామి

**వస్త్రయుగ్మం:** సురార్చితాంఘ్రియుగళే దుకూలవసనప్రియే
వస్త్రయుగ్మం ప్రదాస్యామి గృహాణ హరివల్లభే
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః వస్త్రయుగ్మం సమర్పయామి

**ఆభరణం:** కేయూర కంకణే దివ్యే హారనూపురమేఖలాః
విభూషణాన్య ముల్యాని గృహాణ ఋషి పూజితే
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః ఆభరణాని సమర్పయామి

**ఉపవీతం:** తప్త హేమకృతం సూత్రం ముక్తాదామ విభూషితం
ఉపవీతమిదం దేవి గృహాణ త్వం శుభప్రదే
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః ఉపవీతం సమర్పయామి

**గంధం:** కర్పూరాగరుకస్తూరీ రోచనాది భిరన్వితం
గంధం దాస్యామ్యహం దేవి ప్రీత్యర్థం ప్రతిగృహ్యతాం
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః గంధం సమర్పయామి

**పుష్పపూజ:** మల్లికా జాజికుసుమై చంపకైర్వకులైస్తథా
శతపత్రైశ్చ కల్హారైః పూజయామి హరిప్రియే
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః పుష్పాణి సమర్పయామి

### అథాంగపూజ

| | |
|---|---|
| ఓం చంచలాయై నమః | పాదౌ పూజయామి |
| ఓం చపలాయై నమః | జానునీ పూజయామి |
| ఓం పీతాంబరధరాయై నమః | ఊరుః పూజయామి |
| ఓం కమలవాసిన్యై నమః | కటిం పూజయామి |
| ఓం పద్మాలయాయై నమః | నాభిం పూజయామి |
| ఓం మదనమాత్రే నమః | స్తనౌ పూజయామి |
| ఓం లలితాయై నమః | భుజద్వయం పూజయామి |
| ఓం కంబుకంఠ్యై నమః | కంఠం పూజయామి |





| | |
|---|---|
| ఓం శ్రియై నమః | ఓష్ఠౌ పూజయామి |
| ఓం సుముఖాయై నమః | ముఖం పూజయామి |
| ఓం సునాసికాయై నమః | నాసికాం పూజయామి |
| ఓం సునేత్రాయై నమః | నేత్రే పూజయామి |
| ఓం రమాయై నమః | కర్ణౌ పూజయామి |
| ఓం కమలాయై నమః | శిరః పూజయామి |
| ఓం వరలక్ష్మై నమః | సర్వాణ్యంగాని పూజయామి |

### శ్రీ లక్ష్మీ అష్టోత్తర శతనామావళిః

ఓం ప్రకృత్యై నమః
ఓం వికృత్యై నమః
ఓం విద్యాయై నమః
ఓం సర్వభూత హితప్రదాయై నమః
ఓం శ్రద్ధాయై నమః
ఓం విభూత్యై నమః
ఓం సురభ్యై నమః
ఓం పరమాత్మికాయై నమః
ఓం వాచే నమః
ఓం పద్మాలయాయై నమః
ఓం పద్మాయై నమః
ఓం అనఘాయై నమః
ఓం హరివల్లభాయై నమః
ఓం అశోకాయై నమః
ఓం అమృతాయై నమః
ఓం దీప్తాయై నమః
ఓం లోకశోక వినాశిన్యై నమః
ఓం ధర్మనిలయాయై నమః
ఓం కరుణాయై నమః
ఓం లోకమాత్రే నమః
ఓం పద్మప్రియాయై నమః
ఓం పద్మహస్తాయై నమః

ఓం పద్మాక్ష్యై నమః
ఓం పద్మసుందర్యై నమః
ఓం పద్మముఖ్యై నమః
ఓం పద్మనాభ ప్రియాయై నమః
ఓం రమాయై నమః
ఓం పద్మమాలాధరయై నమః
ఓం దేవ్యై నమః
ఓం పద్మిన్యై నమః
ఓం పద్మగంధిన్యై నమః
ఓం పుణ్యగంధాయై నమః
ఓం సుప్రసన్నాయై నమః
ఓం ప్రసాదాభిముఖ్యై నమః
ఓం శుచయై నమః
ఓం స్వాహాయై నమః
ఓం సుధాయై నమః
ఓం ధన్యాయై నమః
ఓం హిరణ్మయ్యై నమః
ఓం లక్ష్మై నమః
ఓం నిత్యపుష్టాయై నమః
ఓం విభావర్యై నమః
ఓం ఆదిత్యై నమః

ఓం దిత్యై నమః
ఓం వసుధాయై నమః
ఓం వసుధారిణ్యై నమః
ఓం చంద్రవదనాయై నమః
ఓం చంద్రాయై నమః
ఓం చంద్ర సహోదర్యై నమః
ఓం చతుర్భుజాయై నమః
ఓం చంద్రరూపాయై నమః
ఓం ఇందిరాయై నమః
ఓం ఇందు శీతలాయై నమః
ఓం ఆహ్లాద జనన్యై నమః
ఓం పుష్ట్యై నమః
ఓం శివాయై నమః
ఓం శివకర్యై నమః
ఓం సత్యై నమః
ఓం విమలాయై నమః
ఓం విశ్వజనన్యై నమః
ఓం తుష్ట్యై నమః
ఓం దారిద్ర్యనాశిన్యై నమః
ఓం ప్రీతి పుష్కరిణ్యై నమః
ఓం శాంతాయై నమః

ఓం శుక్లమాల్యాంబరాయై నమః
ఓం శ్రియై నమః
ఓం భాస్కర్యై నమః
ఓం బిల్వనిలయాయై నమః
ఓం వరారోహాయై నమః
ఓం యశస్విన్యై నమః
ఓం వసుంధరాయై నమః
ఓం ఉదారాంగాయై నమః
ఓం హరిణ్యై నమః
ఓం హేమమాలిన్యై నమః
ఓం ధనధాన్యకర్యై నమః
ఓం సిద్ధయే నమః
ఓం స్త్రైణ సౌమ్యాయై నమః
ఓం శుభప్రదాయై నమః
ఓం నృపవేశ్మ గతానందాయై నమః
ఓం వరలక్ష్మై నమః
ఓం వసుప్రదాయై నమః
ఓం ప్రభాయై నమః
ఓం హిరణ్య ప్రాకారాయై నమః
ఓం సముద్ర తనయాయై నమః

ఓం జయాయై నమః
ఓం మంగళాయై నమః
ఓం దేవ్యై నమః
ఓం విష్ణు వక్షః స్థల స్థితాయై నమః
ఓం ఓం విష్ణుపత్న్యై నమః
ఓం ప్రసన్నాక్ష్యై నమః
ఓం నారాయణ సమాశ్రితాయై నమః
ఓం దారిద్ర ధ్వంసిన్యై నమః
ఓం దేవ్యై నమః
ఓం సర్వోపద్రవవారిణ్యై నమః
ఓం నవదుర్గాయై నమః
ఓం మహాకాళ్యై నమః
ఓం బ్రహ్మవిష్ణు శివాత్మికాయై నమః
ఓం త్రికాలజ్ఞాన సంపన్నాయై నమః
ఓం భువనేశ్వర్యై నమః
ఓం శ్రీ దేవ్యై నమః

**లక్ష్మీ అష్టోత్తర శతనామ పూజాం సమర్పయామి**

**ఇతి లక్ష్మీ అష్టోత్తర శత నామావళిః సమాప్తః**

**ధూపం** దశాంగం గుగ్గులోపేతం సుగంధం చ సుమనోహరం
ధూపం దాస్యామి దేవేశి వరలక్ష్మి గృహాణతం
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః ధూపం సమర్పయామి

**దీపం** ఘృతవర్తి సమాయుక్తం అంధకార వినాశకం
దీపం దాస్యామితే దేవిగృహాణ ముదితాభవ
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః దీపం సమర్పయామి

**నైవేద్యం** నైవేద్యం షడ్రసోపేతం దధి మధ్వాజ్యసంయుతం
నానాభక్ష్యఫలోపేతం గృహాణ హరివల్లభే..
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః నైవేద్యం సమర్పయామి

**పానీయం** ఘనసారసుగంధేన మిశ్రితం పుష్పవాసితం
పానీయం గృహ్యతాం దేవి శీతలం సుమనోహరం
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః పానీయం సమర్పయామి

**తాంబూలం** పూగీఫలసమాయుక్తం నాగవల్లీ దళైర్యుతం
కర్పూర చూర్ణసంయుక్తం తాంబూలం ప్రతి గృహ్యతాం
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః తాంబూలం సమర్పయామి

**మంత్రపుష్పం** పద్మాసనే పద్మకరే సర్వలోకైక పూజితే
నారాయణప్రియే దేవి సుప్రీతాభవ సర్వదా
శ్రీవరలక్ష్మీ దేవతాయై నమః అష్టోత్తర మంత్ర
పుష్పం సమర్పయామి

**ప్రదక్షిణ నమస్కారాన్** యానికానిచ పాపాని జన్మాంతరకృతాని చ
తాని తాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదే పదే
నమస్తే లోకజననీ నమస్తే విష్ణువల్లభే
పాహిమాం భక్త వరదే వరలక్ష్మి నమోనమః
శ్రీ వరలక్ష్మీ దేవతాయై నమః ప్రదక్షిణ
నమస్కారాన్ సమర్పయామి



## అథ తోరగ్రంథి పూజ

| | | |
|---|---|---|
| కమలాయై నమః | ప్రథమ గ్రంధిం | పూజయామి |
| రమాయై నమః | ద్వితీయ గ్రంధిం | పూజయామి |
| లోకమాత్రే నమః | తృతీయ గ్రంధిం | పూజయామి |
| విశ్వజనన్యై నమః | చతుర్థ గ్రంధిం | పూజయామి |
| మహాలక్ష్మ్యైనమః | పంచమ గ్రంధిం | పూజయామి |
| క్షీరాబ్ధి తనయాయై నమః | షష్ఠి గ్రంధిం | పూజయామి |
| విశ్వసాక్షిణ్యై నమః | సప్తమ గ్రంధిం | పూజయామి |
| చంద్రసోదర్యై నమః | అష్టమ గ్రంధిం | పూజయామి |
| హరివల్లభాయై నమః | నవమ గ్రంధిం | పూజయామి |

**తోరబంధనమంత్రం:** బధ్నామి దక్షిణేహస్తే నవసూత్రం శుభప్రదం
పుత్ర పౌత్రాభి వృద్ధించ సుసౌఖ్యం దేహిమే రమే..

**వాయనవిధి:** ఏవం సంపూజ్య కళ్యాణీం వరలక్ష్మి స్వశక్తితః
దాతవ్యం ద్వాదశాపూపం వాయనం హి ద్విజాయతే

**వాయనదానమంత్రః:** ఇందిరా ప్రతిగృహ్ణాతు ఇందిరావై దదాతిచ
ఇందిరా తారాకోభాభ్యాం ఇందిరాయై నమోనమః

## వరలక్ష్మీ వ్రత కథ

ఇది తరతరాలనుంచి భారతీయ సంప్రదాయంలో కలిసిపోయిన వరలక్ష్మీ వ్రత కథ. స్త్రీలకు సౌభాగ్యాన్ని ప్రసాదించే ఈ వ్రతాన్ని గురించి కైలాసంలో శివుడు పార్వతికి చెప్పాడు. భగవత్ సమానులైన ఋషుల ద్వారా ఈ కథ భూలోక వాసులకు తెలిసింది. నాటినుంచి ఏటా కోట్లాదిమంది ముత్తైదువులు శ్రావణ శుక్రవార నోము నోచిన రోజు వరలక్ష్మీ వ్రత కథను పారాయణం చేస్తున్నారు.

ఈ కథను శౌనకాది మహామునులకు సూతపౌరాణికుడు చెప్పాడు.

"స్త్రీలకు వరలక్ష్మీ వ్రతం సౌభాగ్యాన్ని కలుగ చేస్తుంది. ఈ శుభకరమైన వ్రతాన్ని శ్రావణ శుక్లపక్ష పూర్ణిమకు ముందు వచ్చే శుక్రవారం రోజున చేయాలి" అని పార్వతీదేవికి పరమేశ్వరుడు చెప్పాడు. పార్వతీదేవికి వరలక్ష్మీ వ్రతం గురించి ఇలా చెప్పాడు.

"ఓ పార్వతీ, వరలక్ష్మీ కథను చెబుతున్నాను. శ్రద్ధగా విను. మగధ దేశంలో కుండినంబ అనే పట్టణంలో చారుమతి అనే బ్రాహ్మణ స్త్రీ ఉండేది. ఆమె భర్తనే దైవంగా భావించుకునేది. ప్రతిరోజూ తెల్లవారుజామునే నిద్రలేచి స్నానాదులు పూర్తి చేసి భర్తను పూలతో పూజించేది. అనంతరం అత్త మామలను సేవిస్తూ, ఇరుగు పొరుగు వారితో స్నేహంగా ఉంటూ జీవనం సాగించేది.

చారుమతికి ఒక రోజు కలలో వరలక్ష్మీదేవి కనిపించి "నేనమ్మా.. వరలక్ష్మీ దేవిని. నీ భక్తికి ప్రసన్నురాలినై ప్రత్యక్షమయ్యాను. శ్రావణ శుక్ల పూర్ణిమకు ముందుగా వచ్చే శుక్రవారం రోజున నన్ను భక్తితో సేవిస్తే నీ కోరికలు నెరవేరు స్తాను" అని చెప్పింది.

చారుమతి ఆనందంగా భక్తిభావంతో వరలక్ష్మీదేవికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి

**"నమస్తే సర్వలోకానాం జనన్యై పుణ్యమూర్తయే**
**శరణ్యే త్రిజగద్వంద్యే విష్ణువక్షస్థలాలయే**

ఓ జగన్మాతా! నీ దయ వలన ప్రజలు ధనధాన్య సంపన్నులు అవుతున్నారు. విద్వాంసులై సకల శుభాలు అందుకుంటున్నారు. నేను గత జన్మలలో చేసిన పుణ్యఫలంగా నీ దర్శన భాగ్యం కలిగింది. ఇక నా జన్మ ధన్యమైంది" అంది కలలోనే.

చారుమతి భక్తికి వరలక్ష్మీదేవి మెచ్చి అనేక వరాలు అనుగ్రహించి అంతర్ధానమైంది.

చారుమతి నిద్రనుంచి లేవగానే తనకు వరలక్ష్మీదేవి ప్రత్యక్షమై వరాలు ఇచ్చిన విషయం గుర్తు వచ్చింది. కలలో తనకు వరలక్ష్మీదేవి చెప్పిన విషయాలను అత్తమామలకును, ఇరుగుపొరుగు వారితోనూ చెప్పింది. శ్రావణ మాసం రాగానే వరలక్ష్మీ వ్రతం సంప్రదాయబద్ధంగా చేద్దామని చెప్పింది.

చారుమతి చెప్పినప్పటి నుంచి స్త్రీలు శ్రావణమాసం కోసం ఎదురు చూడడం ప్రారంభించారు. కొంతకాలం తర్వాత వీరు ఎదురు చూస్తున్న శ్రావణ మాసం వచ్చింది. ఆ నెలలో పూర్ణిమకు ముందు వచ్చే శుక్రవారాన్ని వరలక్ష్మీ దేవి చెప్పిన రోజుగా భావించారు. ఆ రోజు తెల్లవారుజామునే లేచి స్నానాదులు పూర్తి చేశారు. కొత్త దుస్తులు కట్టుకున్నారు. పూజగదిలో పీట వేసి దానిపైన బియ్యం పోశారు. అందులో కలశం ఏర్పాటు చేసి వరలక్ష్మీదేవిని ఆవాహన చేశారు.

ఆ రోజు సాయంత్రం చారుమతి తోటి స్త్రీలతో కలసి "పద్మాసనే పద్మకరే సర్వలోక పూజితే నారాయణప్రియే దేవి సుప్రీతా భవసర్వదా" అని ధ్యానించి వరలక్ష్మీదేవిని ఆవాహన చేసింది. షోడశోపచార పూజలు పూర్తి చేసి తొమ్మిది సూత్రాలున్న పసుపు దారాలను ధరించింది. పలు రకాల భక్ష్యభోజ్యాలను వరలక్ష్మీదేవికి నివేదించి ప్రదక్షిణలు చేసింది.

ఇలా మొదటి ప్రదక్షిణ పూర్తికాగానే ఆ స్త్రీలందరి కాళ్లలో ఘల్లు ఘల్లుమనే శబ్దం వినిపించింది. ఆ స్త్రీలందరూ ఆశ్చర్యంగా తమ కాళ్లవైపు చూసుకున్నారు. వారి కాళ్లకు గజ్జెలున్నాయి. ఇది వరలక్ష్మీదేవి కటాక్షమేనని చారుమతి, మిగిలిన స్త్రీలు చాలా సంతోషించారు. రెండవ ప్రదక్షిణ చేయగా వాళ్ల చేతులకు నవరత్నాలు పొదిగిన బంగారు ఆభరణాలు వచ్చాయి. మూడవ ప్రదక్షిణతో వారికి సర్వాలంకారాలు అమరాయి. చారుమతి ఇల్లు మొత్తం బంగారము, రథ, గజ, తురగ వాహనాలతో, సౌభాగ్యంతో నిండిపోయింది.

వ్రతంలో పాల్గొన్న స్త్రీలను తీసుకుపోవటానికి గుర్రాలు, ఏనుగులు, రథాలు వచ్చి చారుమతి ఇంటివద్ద నిలిచాయి. తమచేత శాస్త్ర ప్రకారం వ్రతం చేయించిన బ్రాహ్మణోత్తముని గంధం, పుష్పాలతో పూజించారు. దక్షిణ, తాంబూలము, పన్నెండు భక్ష్యములు వాయనం ఇచ్చి ఆశీర్వాదం పొందారు. వరలక్ష్మీదేవికి నివేదన చేసిన భక్ష్యభోజ్యాలను బంధువులతో కలసి భుజించాక వాహనాలలో స్త్రీలు తమ తమ ఇళ్లకు వెళ్లిపోయారు.

ఆ రోజునుంచి చారుమతితో పాటు పలువురు స్త్రీలు ప్రతి సంవత్సరం వరలక్ష్మీదేవిని పూజిస్తూ, సకల సంపదలతో సుఖంగా ఉన్నారు. ఈ వ్రతం చేసిన వారికి సర్వసంపదలు కలుగుతాయి. ఈ వ్రతాన్ని అన్ని కులాల వారూ చేయవచ్చు. ఈ కథను విన్నవారికీ, చదివిన వారికీ వరలక్ష్మీదేవి అనుగ్రహం లభించి సకల శుభాలు కలుగుతాయి. ఇది సౌభాగ్యదాయకం. సర్వరోగాలు, సకల రుణాలు హరించి సర్వత్రా రక్ష చేకూరుతుంది." అని పార్వతీదేవికి చెప్పాడు శివుడు.

**(ఈ కథ అనంతరం అక్షతలు శిరస్సున ధరించి,**
**పసుపు కుంకుమలను గడప మధ్యలో పెట్టాలి)**



## వ్రతవిధానం

*వరలక్ష్మీ వ్రతం ఆచరించే రోజు ఉదయాన్నే తలస్నానం చేసి ఇంటిని శుభ్రం చేసుకోవాలి. ఇంట్లోని పూజ గదిలో కానీ గదిలో ఒక మూల గానీ మండపం ఏర్పాటు చేసుకోవాలి. ఈ మండపం పైన బియ్యపు పిండితో ముగ్గు వేసి కలశం ఏర్పాటు చేసుకోవాలి. తోరాలు, అక్షతలు, పసుపు గణపతిని, పూజా సామాగ్రి సిద్ధం చేసుకుని అమ్మవారి ఫోటో మండపంలో ఉంచాలి.*

### కావలసిన వస్తువులు

*పసుపు, కుంకుమ, ఎర్రటి జాకెట్టు బట్ట, గంధము, పూలు, పండ్లు, ఆకులు, వక్కలు, తోరానికి అవసరమైన దారము, టెంకాయలు, దీపపు కుందులు, ఐదు వత్తులతో హారతి ఇవ్వడానికి అవసరమైన పంచహారతి, దీపారాధనకు నెయ్యి, కర్పూరం, అగరవత్తులు, బియ్యము, శనగలు.*

### తోరం ఇలా తయారు చేసుకోవాలి

*తెల్లటి దారాన్ని ఐదు లేక తొమ్మిది పోగులు తీసుకొని దానికి పసుపు రాసుకోవాలి. ఆ దారమునకు ఐదు లేక తొమ్మిది పువ్వులతో ఐదు లేక తొమ్మిది ముడులతో తోరాలను తయారు చేసుకొని పీఠం వద్ద ఉంచుకోవాలి. పసుపు, కుంకుమ, అక్షతలు వేసి తోరాలను పూజించాలి. ఈ విధంగా తోరాలను పూజించిన అనంతరమే పూజకు ఉపక్రమించాలి.*




## ఇంటర్నెట్‌తో రక్తపోటు!

ఇంటర్నెట్ ఉపయోగించే వారిలో రక్తపోటు పెరిగే అవకాశం ఉందని అమెరికా పరిశోధకులు హెచ్చరిస్తున్నారు. 18-35 లోపు వయస్సు ఉన్న 144 మందిని వీరు పరిశీలించారు. వీరందరినీ కొంతసేపు ఇంటర్నెట్‌ను ఉపయోగించమన్నారు. అనంతరం వారి ఆరోగ్యాన్ని పరిశీలించారు. వీరిలో రక్తపోటు, గుండె కొట్టుకోవడంలో మార్పులను గుర్తించారు. ఇదంతా ఇంటర్నెట్ ప్రభావమేనని వారు అంటున్నారు. ఇంటర్నెట్‌ను ఎంత ఎక్కువ సేపు ఉపయోగిస్తే అంత ఎక్కువగా రక్తపోటు, గుండె సంబంధిత సమస్యలు వచ్చే అవకాశం ఉందని వారు హెచ్చరిస్తున్నారు. ఇంటర్నెట్‌ను ఏకబిగిన కాకుండా మధ్యలో కొద్దిసేపు విరామం ఇచ్చి ఉపయోగించేవారిలో ఈ ప్రమాదం కొద్దిగా తగ్గుతుందని వారు చెబుతున్నారు. రోజు మొత్తం మీద గంటా లేదా రెండు గంటల కన్నా ఎక్కువసేపు ఇంటర్నెట్ చూడడం ఆరోగ్యానికి తీవ్రమైన హాని చేస్తుందని వారు స్పష్టం చేస్తున్నారు.



## ఐక్యూతో ఆయుష్షు



ఐక్యూ ఎక్కువగా ఉండే పిల్లల్లో ఆయుర్దాయం ఎక్కువే అంటున్నారు స్కాట్‌ల్యాండ్ పరిశోధకులు. 1936లో జన్మించిన సుమారు అరవై వేల మంది స్త్రీ పురుషుల మీద సుదీర్ఘకాలం అధ్యయనం నిర్వహించిన అనంతరం వీరు ఈ విషయాన్ని వెల్లడించారు. మంచి ఐక్యూతో ఎక్కువ ప్రతిభ కనపరచిన పిల్లలు పెద్దయిన తరువాత వారి ఆరోగ్యాన్ని పరిశీలించగా.... వీరిలో 28 శాతం మందికి శ్వాసకోశ సంబంధ వ్యాధులు, 25 శాతం మందికి గుండెజబ్బులు, పక్షవాతం వచ్చే అవకాశాలు చాలా వరకు తగ్గిన విషయాన్ని అధ్యయనకారులు గుర్తించారు.

కేవలం ఐక్యూ ఎక్కువగా ఉండడం వలనే వీరిలో ఈ మార్పు కనిపించిందా? అనే విషయాన్ని మాత్రం వీరు స్పష్టం చేయలేదు. ఐక్యూ ఎక్కువగా ఉండే పిల్లలు అన్ని రంగాల్లోనూ మంచి మంచి విజయాలను సొంతం చేసుకోగలుగుతారు. ఆర్థికంగా, సామాజికంగా మంచి స్థాయికి చేరుకుంటారు కనుక వీరిలో ఒత్తిడి, ఆందోళన వంటివి తక్కువ స్థాయిలోనే ఉంటాయనీ అందువలన ప్రాణాంతకమైన జబ్బుల బారిన పడే అవకాశం తగ్గుతుందనీ అధ్యయనకారులు విశ్లేషిస్తున్నారు. దీని మీద ఇంకా అధ్యయనాలు నిర్వహించాలని వారు చెబుతున్నారు.

## టెన్షన్ మంచిదే!

టెన్షన్ కారణంగా రక్తపోటు, గుండెజబ్బులు ఇతర ఆరోగ్య సమస్యలు తలెత్తుతాయని కొందరు అదేపనిగా హెచ్చరిస్తుంటే నిపుణులు మాత్రం స్త్రీల విషయంలో టెన్షన్ మంచిదే అంటున్నారు. ఎలాగంటే సాధారణంగా స్త్రీలు తమ ఆరోగ్యం విషయంలో ఎక్కువ శ్రద్ధ చూపరు. అస్సలు టెన్షన్ పడరు. కానీ ఇలాంటి వారు తమ విషయంలో టెన్షన్ పడితేనే మంచిది అంటున్నారు నిపుణులు. ఆరోగ్యం గురించి తరచూ టెన్షన్ పడేవారు ఎలాంటి సమస్యా తలెత్తకుండా ముందు జాగ్రత్తలు తీసుకోవడం ద్వారా కొన్ని ప్రాణాంతక వ్యాధుల నుంచి తప్పించుకునే వీలుందని చెబుతున్నారు. అన్ని విషయాలలోనూ టెన్షన్ పడేవారు వృత్తి వ్యాపారాలలో ముందుంటారనీ, తాము ఎక్కడ వెనకపడతామో అని అప్రమత్తంగా ఉంటారని అంటున్నారు. తద్వారా ఆర్థిక సమస్యలు వీరిని దరిచేరే అవకాశం తక్కువ అంటున్నారు. ఇలా ఆర్థికంగా, సామాజికంగా బలంగా ఉండే మహిళల్లో ఆరోగ్య సమస్యలూ తక్కువగానే కనపడతాయట! ఇన్ని లాభాలకు మూలమైన టెన్షన్ స్త్రీల విషయంలో మంచే చేస్తుందన్నది వీరి మాట!





## స్నేహంతో ఆరోగ్యం

స్నేహితులవల్ల ఆరోగ్యం బేషుగ్గా ఉంటుంది అంటున్నారు మిచిగన్ విశ్వవిద్యాలయం పరిశోధకులు. వంద దేశాలలో సుమారు మూడు లక్షల మంది మీద సుదీర్ఘకాలం అధ్యయనం నిర్వహించారు. వీరిలో సగానికి పైగా స్నేహితులు ఉన్నవారు ఉంటే, మరికొంతమందికి స్నేహితులు తక్కువగా ఉన్నారు. కొన్ని సంవత్సరాల పాటు వీరందరి ఆరోగ్యాన్ని పరిశీలించారు. స్నేహితులు ఎక్కువగా కలిగి ఉన్న వృద్ధులలో ఒత్తిడి, ఆందోళన తక్కువగా ఉండి సాధారణమైన ఆరోగ్య సమస్యలు మాత్రమే ఉండటం పరిశోధకులు గమనించారు. స్నేహితులే లేని వృద్ధులలో రక్తపోటు, షుగర్, గుండె సంబంధిత సమస్యలను గుర్తించారు. వృద్ధులు అన్ని విషయాలను కుటుంబ సభ్యులతో పంచుకోలేరనీ, అదే స్నేహితులతో అయితే మనసు విప్పి అన్నీ చెప్పడం వలన టెన్షన్ నుంచి చాలావరకూ విముక్తి పొందుతారనీ, అదే వారి ఆరోగ్యానికి మూలం అని పరిశోధకులు గుర్తించారు. అయితే స్నేహితులు కేవలం వృద్ధులకే కాకుండా అన్ని వయస్సుల వారికీ అవసరమేనని వారు స్పష్టం చేస్తున్నారు.

## సాంబార్‌తో కోలన్ కేన్సర్ దూరం!

భారతీయులు ఎంతో ఇష్టంగా తినే సాంబార్ కోలన్ కేన్సర్‌ను అడ్డుకుంటుందని అమెరికాలో నిర్వహించిన ప్రీ క్లినికల్ పరిశోధనల్లో వెల్లడైంది. ఈ వంటకంలో వాడే దినుసులే కేన్సర్ కణాలను అడ్డుకుంటాయని పరిశోధకులు భావిస్తున్నారు. ఎలుకలమీద నిర్వహించిన పరిశోధనల్లో ఈ విషయం వెల్లడైంది. ఎలుకలకి కొన్ని రోజుల పాటు ప్రతి రోజూ సాంబార్‌తో కూడిన ఆహారాన్ని అందించారు. అనంతరం వీటిని పరిశీలించగా పెద్దపేగులో ఏర్పడే కేన్సర్ కణాల ఎదుగుదల నిలిచిన సంగతిని గ్రహించారు. కేవలం వీటికి సాంబారు ఆహారం ఇవ్వడం వలన ఈ మార్పు వచ్చిందా? లేక మరేదైనా కారణం ఉందా? అనే విషయాన్ని కూడా వీరు పరిశీలిస్తున్నారు.



—అవినాష్

# పిఆర్‌పి & హెయిర్ ట్రాన్స్‌ప్లాంటేషన్‌తోనే
# బట్టతలసమస్యకు డెర్మాకేర్ ఒక వరం

స్త్రీ పురుషులెవరికైనా అందంతో ముఖ్యపాత్ర పోషించేది జుత్తే. పురుషుల్లో 50% మంది ఈ బట్టతలసమస్యతో బాధపడుతుండగా, స్త్రీలలో 25 శాతం మందిని ఈసమస్య వేధిస్తున్నదని అంచనా, ప్రతి రోజూ ఎన్నో కొన్ని శిరోజాలు రాలిపోవడం సాధారణమే. బట్టతలకు దారి తీస్తున్నదనుకుంటే మాత్రం ట్రాన్స్‌ప్లాంటేషన్ చికిత్స తప్పనిసరి. ఇప్పుడు ఇందులో కూడా కొత్త పద్ధతులు వచ్చాయి.




**కారణాలు ? :** పోషకాహార లోపం, ఫంగల్ ఇన్‌ఫెక్షన్లు, గర్భం దాల్చినప్పుడు, మానసిక ఒత్తిడి, దీర్ఘకాలిక అనారోగ్యం, వంశపారంపర్య కారణాలు.

**హెయిర్ ట్రాన్స్‌ప్లాంట్ :** వివిధ రకాలకారణాలవల్ల జుత్తు రాలిపోతున్న స్త్రీ, పురుష లిద్దరిలోనూ చేసే హెయిర్ రీప్లేస్‌మెంట్ చికిత్స తరువాత జుత్తు చాలా సహజంగా కనిపించడమే కాక శాశ్వతంగా కూడా ఉంటుంది.

**బట్టతలసమస్యకు సింగిల్ సిట్టింగ్ చికిత్సతో ఫుల్ హెయిర్ :** బట్టతలసమస్యకు రాజేష్ ఒక యువకుడు 10 సంవత్సరాలుగా అనేక ఆయుర్వేదిక్, హెూమియోపతి ఇంకా ఇతర మందులతో చికిత్స పొందినప్పటికి ఫలితం లేదు. తను మా డెర్మాకేర్ క్లినిక్ వద్ద సింగిల్ సిట్టింగ్‌తోనే ఫుల్ హెయిర్ లభించింది. ఈ ట్రీట్‌మెంట్ వల్ల రాజేష్ కూడా అందంగా కన్పిస్తున్నాడు. ఇప్పుడు ఎంతో సంతోషంగా ఉన్నాడు.

**ఎలా చేస్తారు?** హెయిర్ రీస్టోరేషన్ సర్జరీకి దాదాపుగా 6 గంటలసమయం పడుతుంది. దీనిని లోకల్ ఎనస్తీషియాలో చేస్తారు. దీనిలో తలవెనుక వైపు ఆరోగ్య వంతంగా ఉన్నజుట్టు కుదుళ్ళను సేకరిస్తారు. అలా సేకరించిన జుట్టును రాలిపోయిన చోట తిరిగి అమరుస్తారు.

**ఆధునిక ఎఫ్‌యూఈ (FUE) :** ఫోలికల్ యూనిట్ ఎక్స్‌ట్రాక్షన్ (FUE)లో ఒక ప్రత్యేకమైన తక్కువ వ్యాసంలో తలనుంచి జుట్టు కుదుళ్లను సేకరించి బట్టతలఉన్న చోట ట్రాన్స్‌ప్లాంట్ చేస్తారు. దీని కోసం ఎలాంటి కోత కానీ, కుట్లుకాని ఉండవు. మీరు ఉద్యోగం చేస్తూ ఉన్నట్టయితే ఈ ప్రక్రియ మీకు మరింత సౌకర్యంగా ఉంటుంది. చికిత్స అయిపోయిన తెల్లవారి నుంచే మీ పనుల్లోకి వెళ్లిపోవచ్చు.

**పి.ఆర్‌పి. & స్టెమ్‌సెల్ ఇంజెక్షన్ :** పిఆర్‌పీ వల్ల రాలిపోవడానికి సిద్ధంగా ఉన్న వెంట్రుకలు కూడా ఆరోగ్యవంతంగా, ఒత్తుగా పెరుగుతాయి. స్త్రీ పురుషుల్లో డీహెచ్‌టీ కుదుళ్ళకు వెళ్లి రక్త ప్రసరణ పై, కుదుళ్ల ఎదుగుదలకు కావాల్సిన సిగ్నల్స్‌ను కుదుళ్లకు చేరకుండా నియంత్రిస్తుంది. స్టెమ్ సెల్ ఇంజెక్షన్ తీసుకోవడం వల్ల గ్రోత్ ఫ్యాక్టర్స్ దెబ్బతిన్న జుట్టు కుదుళ్లకు రక్త ప్రసరణ చేయించి, మళ్లీ జుట్టు ఆరోగ్యంగా పెరుగుతుంది. No side Effects Painless Process.

**ఫలితం :** ఈ హెయిర్ ట్రాన్‌ప్లాంట్ ప్రక్రియలద్వారా కొత్త జుత్తు పూర్తిగా పెరుగుతుంది. ఇది సహజంగా కూడా ఉంటుంది. ఇవి చాలా సురక్షితమైన. ఫలవంతమైన విధానాలు. వీటి ద్వారా పెరిగిన జుత్తు కూడా ఎక్కువ కాలం పాటు రాలిపోకుండా ఉంటుంది. ఇలా అమర్చిన జుత్తును సహజ శిరోజాలమాదిరిగానే హెయిర్‌స్టైల్ చేయించు కోవచ్చు. కలరింగ్ చేసుకోవచ్చు. కోతలు, మచ్చలు, కుట్లు, నొప్పి లేని సరికొత్త విధానాలద్వారా సహజమైన జుత్తు శాశ్వతంగా పెరగడానికి అడుగేయండి మరి.

**తెల్లజుట్టుకి చికిత్స :** 35 సం॥లోపు ఉన్నవారికి తెల్లజుట్టు సమస్యకు విజయ వంతంగా చికిత్స చేయబడును. గ్రే కలర్ లోకి మారిన జుట్టును మాములు రంగులోకి తేవడానికి ఉపయోగించే గ్లో-మెలానిన్ అనే శాస్త్రీయ పద్ధతితో కూడిన చికిత్స కూడా అందుబాటులో ఉంది. ఆరు వారాలపాటు సాగే ఈ చికిత్స విధానం ఎంతో ఉపయోగకరంగా ఉంటుంది.



## డా॥ పి. ప్రీతమ్
చీఫ్ హెయిర్ ట్రాన్స్‌ప్లాంట్ సర్జన్

# చర్మ సమస్యలకు శాశ్వత పరిష్కారం

అందంగా ఉండాలని అందరికీ ఉంటుంది. కాని మారుతున్న జీవన శైలి, కాలుష్యం, ఆహారపు అలవాట్లు మొదలైన కారణాలవల్ల చర్మం నల్లబడటం, మొటిమలు, బ్లాక్‌హెడ్స్, కళ్ళ కింద నల్లని చారలు, మొటిమలతో ఏర్పడిన నల్లని మచ్చలు మరియు గుంతలవల్ల అందంగా ఉండాల్సిన ముఖం అంద విహీనంగా మారుతుంది.

**నల్లని మచ్చలు, మొటిమలు, గుంటలు ఏర్పడుటకు కారణాలు :** మన చర్మం నార్మల్, డ్రై & అయిలీ అనే వివిధ కరాలుగా ఉంటుంది. బ్లాక్ హెడ్స్ ఎక్కువగా ఆయిలీ చర్మానికి వస్తాయి. సెబేషియస్ గ్రంథుల్లో, సీబమ్ ఎక్కువవడం వల్ల మొటిమలు ఏర్పడి చర్మంపై నల్లమచ్చలు, గుంటలు ఏర్పడుతాయి.

చికిత్స : నల్లమచ్చలు, మొటిమలసమస్యలు 16 సంవత్సరాలవయసు నుండి ప్రారంభమౌతాయి. వీటి నివారణకు ఆహారపు అలవాట్లు మార్చుకోవడం, డెర్మటాలజీ డాక్టర్ సూచించే మందులను, ఫేస్ వాష్‌లను ఉపయోగించాలి. సమస్య తీవ్రంగా ఉన్నప్పుడు సరైన ట్రీట్‌మెంట్ తీసుకోవడం వల్ల ఈ సమస్య నుండి శాశ్వతంగా బయటపడవచ్చు.

**పులిపిర్లు, అవాంచిత రోమాలు:** ఈ మధ్యకాలంలో ఎక్కువమంది పులిపిర్లు, అవాంచిత రోమాలు బాగా ఇబ్బందిపెడుతున్నాయి. ముఖ్యంగా ఈ సమస్యలతో బాధపడుతున్న మమిలలు నలుగురిలో కలవడానికి ఇబ్బంది పడుతూ, మానసికంగా వేదనకు గురౌతున్నారు. దీనికి గలకారణాలు వారి శరీరంలో హార్మోనల్ బ్యాలెన్స్ సరిగా లేకపోవడం, పౌషికాహారలోపం అని చెప్పవచ్చు.

**పులిపిర్లు, అవాంచిత రోమాలకు చికిత్స :** యుక్త వయస్సు రాగానే సాధారణంగా పెరిగే వెంట్రుకల్లానే అవాంచిత రోమాలు కూడా రావడం మొదలవుతాయి. వీటిని ప్రారంభంలోనే నివారించుకున్నట్లయితే ఆత్మన్యూనతకు గురికాకుండా ఉండవచ్చు. ఈ సమస్యలకు ఇప్పుడు ఆధునిక వైద్య పద్ధతులు అందుబాటులో ఉన్నాయి. పులిపిర్లకు, అవాంచిత రోమాలకు లేజర్ ట్రీట్‌మెంట్ మరియు కాట్రీ మిషన్ ద్వారా చేసే చికిత్సతో శాశ్వతంగా తొలగించవచ్చు.



**తెల్ల (బొల్లి) మచ్చలనూ నివారించొచ్చు :** కంటి మీద కునుకు లేకుండా చేసే చర్మవ్యాధుల్లో విటిలిగో (బొల్లి) కూడా ఒకటి. తగిన చికిత్స తీసుకోవడం ద్వారా దీన్ని నివారించుకోవచ్చు. జన్యుపరమైన కారణాలవల్ల, దీర్ఘకాలిక ఒత్తిడి. ప్రమాదవశాత్తు కాలిన గాయాలతో, జీర్ణవ్యవస్థలో ఏర్పడిన ఇన్ఫెక్షన్ వలన కూడా తెల్ల మచ్చలు ఏర్పడుతాయి.

**చికిత్స :** చర్మం మన దేహానికి కవచంలా పని చేస్తుంది. ఇది అతి పెద్ద అవయవం. చర్మం రెండు నుండి 2 నుండి 3 మిల్లీమీటర్ల మందం ఉంటుంది. చర్మంపై తెల్లమచ్చలు రావడం వల్ల మానసికంగా కృంగిపోతారు. ఆధునిక లేజర్ చికిత్స, పూవా థెరఫీ, సర్జరీలద్వారా తెల్లమచ్చలను నివారించుకోవచ్చు.



## డా॥ సుకృతారెడ్డి
MBBS, DD
20 Years Experience
స్కిన్ స్పెషలిస్ట్ & డెర్మాలాజిస్ట్

**Dermacare Clinic** # 3-5-908/1,2,3, Ground Floor, Opp. TVS Showroom, Himayat Nagar, Hyd-29.
9010495626, 8374437725




**దేశ రాజధాని ఢిల్లీ నగరంలో ఎవరికీ తెలియని రహస్య ప్రదేశంలో ఉంది రీసెర్చ్ అండ్ అనాలసిస్ వింగ్ (రా) హెడ్ క్వార్టర్స్. అక్కడ ఒక అత్యవసర సమావేశం జరుగుతోంది. రక్షణ రంగ రహస్యాల గురించి తెలిసిన అతికొద్ది మంది ప్రముఖులు అక్కడ కూర్చుని చర్చలు చేస్తున్నారు. విషయం అత్యంత సున్నితమైనది కావడంతో చర్చ వేడివేడిగా సాగుతోంది.**

"ఇప్పుడు ఆ అమ్మాయి ఎక్కడ ఉంది?" అడిగాడు 'రా' డైరెక్టర్.

"పాక్ ఆక్రమిత కశ్మీర్ ముజఫరాబాద్‌లో. మన సహాయం కోసం ఎదురుచూస్తూ...." చెప్పాడు పాకిస్థాన్ వ్యవహారాలు చూసే అసిస్టెంట్ డైరెక్టర్.

వారి మధ్య సంభాషణను మిగిలినవారు జాగ్రత్తగా వింటున్నారు. "మీ ప్రపోజల్ ఏమిటి?" ఎటూ కమిట్ కాకుండా అడిగాడు డైరెక్టర్. "మన కమాండో యూనిట్ నుండి ఒక వ్యక్తిని పంపి ఆ అమ్మాయిని ఇక్కడకు రప్పించాలి"

"లేకపోతే?"

"కొన్ని రోజులుగా ఆ అమ్మాయిని మనం అక్కడ ఉంచాం. మన దేశంమీద పరోక్షయుద్ధం ప్రకటించిన లష్కరే తోయిబా తన కార్యకలాపాలను పాక్ ఆక్రమిత కశ్మీర్ నుండి నడుపుతోందని మనకి తెలిసినా ఋజువులు లేవు. లష్కర్ సంస్థ అక్కడ ఎన్నో తీవ్రవాద శిక్షణా శిబిరాలు నడుపుతోంది. వాటిలో తర్ఫీదు పొందిన తీవ్రవాదులు రహస్యంగా మన దేశంలోకి ప్రవేశించి అనేక రకాల ఉత్పాతాలు సృష్టిస్తున్నారు. ఇప్పుడా అమ్మాయి అక్కడ జరుగుతున్న అరాచకాలకు సంబంధించి అనేక సాక్ష్యాలు సంపాదించింది. ఆ అమ్మాయిని మనదేశం రప్పిద్దాం అనుకున్నాం. ఇంతలో ఆ అమ్మాయి మన గూఢచారి అన్న విషయం బైటపడిపోయింది" వివరంగా చెప్పాడు అసిస్టెంట్ డైరెక్టర్. "విషయం బైటపడ్డాక మన మనిషి వెళ్ళి చేసేదేముంటుంది? తను కూడా పట్టుబడటంతప్ప" పట్టు విడవకుండా ఆ పథకాన్ని వ్యతిరేకిస్తున్నాడు డైరెక్టర్. "ఆ అమ్మాయి తన దగ్గర ఉన్న సాక్ష్యాలతో సహా ఒక రహస్య ప్రదేశంలో దాక్కుంది. మనం కొద్దిగా సహాయం చేస్తే ఆ సాక్ష్యాలు మనవవుతాయి. పాకిస్థాన్ చేస్తున్న కుట్రను మనం అంతర్జాతీయ సమాజం ముందు బైటపెట్టవచ్చు..."

"ఆ అమ్మాయి మన మనిషి అనే ఋజువు ఏమైనా ఉందా?" మొదటిసారి సంభాషణలో కల్పించుకుంటూ అడిగాడు డిఫెన్స్ సెక్రటరీ. "లేదు" ఒప్పుకున్నాడు అసిస్టెంట్ డైరెక్టర్. "ఆ అమ్మాయి పట్టుబడినా మన దేశానికి వచ్చే నష్టం ఏమీ లేదు. కానీ ఆ అమ్మాయిని రక్షించటానికి మనం పంపే వ్యక్తి పట్టుబడితే ఈ పనంతా మనమే చేశామన్న ఋజువు మన చేత్తో మనమే శత్రుదేశానికి ఇచ్చినవాళ్ళమవుతాం. పాకిస్థాన్ పరువు పోగొట్టుకోవడమేమోగానీ మన పరువు మాత్రం పోతుంది"

"కానీ ఆ అమ్మాయి మన దేశంకోసం తన ప్రాణాలు పణంగా పెట్టింది."

"ఒప్పుకుంటాను. దేశంకోసం ఎందరో ప్రాణ త్యాగం చేస్తారు. కానీ ఒక వ్యక్తికోసం దేశ ప్రయో జనాలు పణంగా పెట్టలేం."

"ఒక మార్గం ఉంది" ఆలోచనల్లోంచి బయటకు వచ్చి అన్నాడు 'రా' డైరెక్టర్.

ఏమిటన్నట్టు అందరూ అతనివైపు చూశారు. అనుభవం నిండిన బట్టతల నిమురుకుంటూ, "మన తరపున వెళ్ళే వ్యక్తి కూడా ఈ రిస్కు వ్యక్తిగ తంగా చేస్తే మనకు అభ్యంతరం ఉండనవసరం లేదు. అప్పుడు అతను పట్టుబడినా అది దేశానికి సంబంధం లేని విషయం అవుతుంది."

"కానీ అలాంటి వ్యక్తి ఎక్కడ దొరుకుతాడు?" అన్నాడు డిఫెన్స్ సెక్రటరీ.

"ఉన్నాడు సర్. మీరు అనుమతిస్తే అతను వ్యక్తిగతంగానే వెళతాడు" చెప్పాడు అసిస్టెంట్ డైరెక్టర్. ఎవరూ ఏమీ మాట్లాడలేదు. కాసేపు ఆ హాలులో నిశ్శబ్దవాతావరణం రాజ్యం చేసింది. "మీ అందరికీ మరోసారి భరోసా ఇస్తున్నాను సర్, ప్రాణం పోయినా అతను దేశం పరువు పోనివ్వడు" ఆ అజ్ఞాత వ్యక్తి తరపున తను మాట ఇస్తూ చెప్పాడు అసిస్టెంట్ డైరెక్టర్. అందరూ అంగీకరిస్తున్నట్టు తల ఊపారు. "ఇంతకీ ఆ అమ్మాయి పేరు?" అడిగాడు డిఫెన్స్ సెక్రటరీ. "అనిత" చెప్పాడు అసిస్టెంట్ డైరెక్టర్. అందరూ అంగీకరించడంతో ఆ సమావేశం అంతటితో ముగిసింది.

***

"డోంట్ వర్రీ! ఆ అమ్మాయిని వెనక్కి తీసుకు వచ్చే పూచీ నాది" తన సామాన్లు సర్దుకుంటూ అన్నాడు కమాండో సందీప్. స్పెషల్ కమాండో ఫోర్స్‌లో అతనొకడు. తను చేయవల్సిన పని గురించి తెలిసి ఆనందంగా ఒప్పుకున్నాడు. అప్ప

**రహస్యంగా ఆ ప్రదేశానికి చేరుకున్నాడతను. రైతు వేషం ధరించి మెల్లిగా ఊళ్ళోకి నడిచి వెళ్ళి ఒక పాడుబడిన షెడ్డులోకి ప్రవేశించాడు. అలికిడి విని ఆమె అప్రమత్తమైంది. లోపలికి వచ్చినవారిపై నిర్దాక్షిణ్యంగా దాడి చేయాలని నిశ్చయించుకుందామె. పలుగు పట్టుకుని తలుపువెనుక సిద్ధంగా నిలబడింది. అతడు లోనికి ప్రవేశించాడు. ఆ క్షణంలో ఏం జరిగింది? అసలు ఆమె ఎవరు? అతడెవరు?**

చెప్పిన పనిని ఒక బాధ్యతగా కాకుండా ఒక గౌరవంగా స్వీకరించాడు.

"ఇది చాలా డేంజరస్ మిషన్..." చెప్పాడు యూనిట్ కమాండర్.

"తెలుసు సర్"

"అనితను క్షేమంగా తీసుకురాగలిగితే సరే! ఒకవేళ ఇబ్బందులు ఎదురైతే ఏం చెయ్యాలో తెలుసుగా.."

కమాండర్ మాటల్లో అంతర్లీనంగా ధ్వనిస్తున్న సందేశం అర్థమై తలెత్తి చూశాడు సందీప్. అతనికి అర్థం కాలేదనుకున్నాడేమో స్పష్టంగా చెప్పాడు కమాండర్. "ఇబ్బంది ఎదురైతే ముందు ఆ అమ్మాయి దగ్గరున్న ఋజువులు తీసుకో. తరువాత ఆ అమ్మాయి శత్రువుల చేతుల్లో పడకుండా చూడు" రెండు సైనైడ్ క్యాప్సూల్స్ అతని చేతుల్లో పెడుతూ అన్నాడు కమాండర్. "దీని అవసరం రాకూడదని కోరుకుంటాను సర్" వాటిని తీసుకుంటూ అన్నాడు సందీప్. "నేనూ అదే కోరుకుంటున్నాను. కానీ నీకంటే, ఆ అమ్మాయి ప్రాణంకంటే ముఖ్యమైనవి ఆ అమ్మాయి సంపాదించిన సాక్ష్యాలు. అది గుర్తుపెట్టుకో" బ్యాగ్ భుజాన తగిలించుకుని బయలుదేరిన సందీప్‌కి ఆఖరి సూచన చేస్తూ అన్నాడు అతని కమాండర్.

***

శ్రీనగర్ వరకూ విమానంలో, అక్కడ నుండి బారాముల్లా వరకూ హెలికాప్టర్‌లో ప్రయాణించాడు సందీప్. ఆ రాత్రి మిలిటరీ క్యాంపులో ఆఖరి నిమిషం సూచనలు అందుకున్నాడు. అనుక్షణం అప్రమత్తంగా ఉండే పాకిస్థాన్ సైనికుల కళ్ళుకప్పి భూమార్గం నుండి అటువైపు వెళ్ళడం అసాధ్యం. పారాచూట్ ద్వారా ముజఫరాబాద్‌లో దిగుదామా అంటే వారి భూభాగంలోకి మన విమానం ప్రవేశిస్తే కాల్చేస్తారు. ఇక మిగిలింది ప్రొపెల్లర్ గ్లైడర్. అది ఒక మనిషిని మాత్రమే మోస్తుంది. గ్లైడర్‌లో ఉన్న ప్రయోజనం ఏమిటంటే దానిని రాడార్లు పట్టుకోవు. దానిని సాధారణంగా సాహస క్రీడల్లో ఉపయోగిస్తారు. కానీ గ్లైడర్ మీద రాత్రిపూట ప్రయాణం అంటే ప్రాణాలతో చెలగాటమే. అందులోనూ అతను వెళుతున్నది పూర్తిగా పరిచయం లేని ప్రదేశం. అత్యంత ఎత్తైన పర్వతాలతో నిండి ఉన్నది. అయినా మిగిలిన వాటికంటే అదే మెరుగ్గా అనిపించి ఆ మార్గాన్నే ఎంచుకున్నాడు సందీప్.

***

సుమారు లక్ష జనాభా గల పట్టణం ముజఫరాబాద్. ఊరు పక్కనే నీలమ్ నది ప్రవహిస్తూ ఉంటుంది. కనుచూపు మేరంతా యాపిల్‌తోటలు వ్యాపించి ఉన్నాయి. నది పక్కన ఒక పది ఎకరాల తోట ఉంది. ప్రస్తుతం పండ్లు ఇంకా కోత దశకు రాలేదు కాబట్టి అక్కడ ఎవరూ లేరు. తోట వెనుక రేకులతో వేసి ఒక షెడ్ ఉంది. దాంట్లో తలదాచుకుంది అనిత. నాలుగు రోజులుగా ఆమె అక్కడే ఉంది. మొదటి రెండురోజులూ తన దగ్గర ఉన్న ఆహార పదార్థాలు తిని ఆకలి తీర్చుకుంది. గత రెండురోజుల నుండీ ఏమీ తినలేదు. ఇండియా నుండి తనకు ఏ నిమిషంలోనైనా సహాయం అందుతుందనే ఆత్రుతతో ఎదురుచూస్తోంది.

లండన్‌లో మేనేజ్‌మెంట్ కోర్స్ చేసింది అనిత. ఆమె క్లాస్‌మేట్ తస్లీమా. ముజఫరాబాద్ అమ్మాయి. ఆ విషయం తెలుసుకున్న 'రా' ఏజంట్లు అనితను సంప్రదించారు. తస్లీమా ద్వారా ముజఫరాబాద్ సమీపంలో నడుస్తున్న టెర్రరిస్ట్ శిక్షణా శిబిరాల గురించి తెలుసుకుని చెప్పమన్నారు. దేశభక్తియుతమైన మనస్తత్వంగల అనిత అక్కడ ఎదురయ్యే ప్రమాదం గురించి ఆలోచించలేదు. తీవ్రవాద శిక్షణా శిబిరాల సమాచారం అందించే సాహసానికి వెంటనే అంగీకరించింది. తస్లీమాతో గాఢస్నేహం చేసింది. ఆమె ద్వారా అనేక విషయాలు తెలుసుకుని 'రా' కి అందించింది. మొదట్లో స్నేహితురాలిని మోసం చేస్తున్న ఫీలింగ్ కలిగినప్పటికీ, దానివల్ల




## మౌనం ఆవహించేదాకా!

*మౌనం ఘనీభవించిన క్షణాలలో*
*కాల యవనికలోన*
*కూచున్న ప్రేక్షకులం మనమే*
*నటులం మనమే*

*నాటకం మనదే!*
*అప్పుడే హఠాత్తుగా*
*ఆవరించిన శూన్యంలో*
*అర్థాంతరంగా*
*ఆగిపోయే అభినయం*
*అప్పుడిక-*
*కాస్సేపు స్తబ్ధత*
*మధ్యంతర విరామం!*
*తెరలేవగానే*

*మౌనమంతా కరిగి*
*ముసుగులన్నీ తొడిగి*
*ఎవరి పాత్రలో*
*వారు వొదిగిపోగానే-*
*ఇక రంగస్థలమంతా*
*మహాసందడిగా*



*మళ్ళీ మౌనం*
*ఆవహించే దాకా!!*

**-నిఖిలేశ్వర్**
***సెల్: 91778 81201***

తస్లీమాకు వ్యక్తిగతంగా కలిగే నష్టం ఏముంటుం దిలే అని సరిపెట్టుకుంది. కోర్సు పూర్తయ్యాక ఇక ఫేర్‌వెల్ సమయంలో తస్లీమా తన ఊరు రమ్మని అనితను ఆహ్వానించింది. ఆ ప్రపోజల్ విని అనిత కంటే ఎక్కువగా 'రా' ఎగిరి గంతేసింది. తస్లీమా చెప్పే కబుర్ల ద్వారా తెలిసిన విషయాల కన్నా ప్రత్యక్షంగా చూస్తే మరిన్ని వివరాలు తెలుస్తా యని భావించింది అనిత. ఎవరికీ తెలియకుండా ఫొటోలు తీయగల సోఫిస్టికేటెడ్ పరికరాలు అని తకు అందజేసింది 'రా'. తస్లీమాతో వాళ్ళ ఊరు వెళ్ళమని ప్రోత్సహించింది. అలా అనిత ముజఫరా బాద్ వచ్చి వారం రోజులైంది. ముందు అంతా అనుకున్నట్టే జరుగుతున్నట్టనిపించింది. ఎన్నో శిక్షణా శిబిరాల ఫొటోలు ఎవరికీ అనుమానం రాకుండా ఆమె తీసుకుంది. అయితే అనితకు తెలి యని విషయం ఏమిటంటే, ఆమె భారతదేశ నాగ రికురాలు కావడంతో పాకిస్థాన్ ఆమె బ్యాగ్రౌండ్ చెక్ చేయించింది. లండన్లో ఒకటి రెండుసార్లు ఆమె 'రా' ఏజంటును కలిసిన విషయం బైటపడింది. దాంతో పాకిస్థాన్ అధికారులకు గొప్ప ఆయుధం




చేతికి దొరికినట్టైంది. అనితను పట్టుకుంటే భారత దేశం తమ మీద ఎలా గూఢచర్యం చేస్తోందో అంతర్జాతీయ సమాజం ముందు నిరూపించవచ్చు ననుకుంది. వెంటనే ఆమెను ప్రాణాలతో పట్టుకోవా లని ఆదేశాలు జారీ చేసింది. పోలీసులు తస్లీమా ఇంటికి చేరుకునే సమయానికి తస్లీమా కారు తీసు కుని బైటకు వెళ్ళింది అనిత. వెంటనే ఇంటికి వెనక్కి తిరిగి రమ్మని తస్లీమా నుండి అనితకు ఫోన్ వచ్చింది. అయితే ఫోన్‌లో తడబడుతున్న తస్లీమా గొంతు, వెనుక నుండి వినబడుతున్న దబాయింపు గొంతులూ అనితకు ఏదో జరిగిందనే సందేహాన్ని కలిగించాయి. ముందు ఆమె భయపడింది. కానీ, ఇప్పుడు కావలసింది భయం కాదు, సమయ స్ఫూర్తి. సమయస్ఫూర్తిగా వ్యవహరించాలని మన సులో స్థిరంగా అనుకుని, రాబోయే పరిస్థితుల్ని ఎదుర్కొనేందుకు మానసికంగా సంసిద్ధమైంది. కారులో ఉన్న ఆహార పదార్థాలు బైటకు తీసి, కారును నీలమ్ నదిలోకి తోసేసింది. అక్కడి నుంచి ఉత్తరదిక్కుగా కొన్ని మైళ్ళు ప్రయాణించి ఈ యాపిల్‌తోటలో ఉన్న పాడుబడిన షెడ్డును ఎన్ను కుని అక్కడే తలదాచుకుంది. 'రా' ఏజెంట్లు అని తకు ఇచ్చిన పరికరాల్లో ఒకటి ట్రాకర్. ఆమె ఎక్కడ ఉందో వారికి తెలియజేసే పరికరం అది. ప్రమాదం కలిగినప్పుడు దానిని యాక్టివేట్ చెయ్యమని వారు చెప్పిన సూచనలు గుర్తుంచుకుని వారు చెప్పినట్టే చేసింది అనిత. అంతకుమించి బైట ప్రపంచంలో ఏం జరుగుతోందో అనితకు తెలియదు.

***

అనితమీద అనుమానం రావడంతోనే ఆమెను బంధించడానికి పాకిస్థాన్ ప్రభుత్వం అన్ని ఏర్పాట్లూ చేసింది. వారు తస్లీమా ఇంటికి వెళ్ళే సమయానికి అనిత ఇంట్లో లేకపోవడంతో తస్లీమాచేత ఫోన్ చేయించి అనితను అర్జంటుగా ఇంటికి రమ్మని పిలి పించారు. అయినా అనిత రాలేదు. ఆమె కారుకు యాక్సిడెంట్ జరిగిందని తర్వాత వాళ్ళకు తెలిసింది. అయినా ముందుజాగ్రత్త చర్యగా ముజఫరాబాద్ నుండి బైటకువెళ్ళే అన్ని మార్గాలను పోలీసులు సీజ్ చేశారు. ప్రతి మనిషినీ పరిశీలించికానీ వద లడం లేదు. రెండు రోజులు గడిచినా నీలం నదిలో అనిత శవం జాడ దొరకలేదు. దాంతో ఆమె బ్రతికే ఉండవచ్చునని పోలీసులకు అనుమానం కలిగింది. కేసు తీవ్రత అందరికీ తెలియడంతో ఆమెను పట్టు కునే బాధ్యత పోలీసుల నుండి మిలిటరీ చేతుల్లోకి వెళ్ళిపోయింది. అందరూ కలిసి ఆమెకోసం గాలింపు ముమ్మరం చేశారు. ఆమె ఫొటో ప్రతి పోలీస్ స్టేషన్‌కీ పంపించారు. ఊళ్లో ప్రతి గోడ మీదా పోస్టర్లు అంటించారు. ముజఫరాబాద్‌లో ప్రతి ఇల్లూ సోదా చేస్తున్నారు. ఇక ఎంతోకాలం ఆమె తప్పించుకుని తిరగలేదనే ధైర్యం చెప్పుకుంటూ తమ పని కొనసాగిస్తున్నది మిలిటరీ. సందీప్ ఆ యాపిల్‌తోట దగ్గరకు చేరుకునేసరికి మధ్యాహ్నం అయింది. అతని చేతిలో ఉన్న ట్రాకర్ అనిత ఆ చుట్టుపక్కలే ఉన్నట్టు చూపిస్తోంది.

గత రాత్రి గ్లైడర్ సాయంతో ఊరు పొలిమే రల్లో దిగాడు సందీప్. ఎవరికీ కనబడకుండా గ్లైడ ర్‌ని నీలమ్ నదిలో ముంచేశాడు. దానివల్ల ఇక ముందు అతనికి ఉపయోగం లేకపోయినా, అది పాకిస్థానీ పోలీసుల కంటబడితే, ఎవరో ఒక వ్యక్తి దొంగచాటుగా భారతదేశం నుండి వచ్చాడనే విషయం వారికి తెలిసిపోతుందని అంచనా వేశాడు సందీప్. రాత్రి ఊరు బయటే ఎవరికీ కన బడకుండా దాక్కుని, ఉదయానికల్లా రైతువేషంలోకి మారిపోయాడు. బహిరంగంగా నడుచుకుంటూ ఊళ్ళోకి వచ్చాడు. అనుమానాస్పదంగా సంచరించే వ్యక్తులను అడ్డుకుంటారుగానీ, ధైర్యంగా ప్రవ ర్తించే వారిని సహజంగా ఏ పోలీసులూ ఆపరు. ఒకవేళ ఆపినా అతను అక్కడ స్థానిక యాసలో అనర్గళంగా మాట్లాడగలడు. అతన్ని ఈ మిషన్‌కు సెలక్ట్ చేయడానికి అది కూడా ఒక కారణం. ఊరు ప్రతి గోడమీదా కనబడుతున్న అనిత ఫొటో చూసి పాకిస్థాన్ ప్రభుత్వం ఈ కేసును ఎంత ప్రతిష్టాత్మ కంగా తీసుకుందో అతనికి అర్థమైంది. తన ట్రాకర్ సాయంతో అనిత ఆచూకీ వెతుకుతూ ఇప్పటికి ఇక్కడకు చేరుకున్నాడు. అతను తోట వెనుక ఉన్న షెడ్డు దగ్గరకు వచ్చేసరికి ట్రాకర్ పరికరం మరింత ఉత్తేజితమై ఆమె అక్కడే ఉందని నిరూపించింది. తలుపు తెరచి అనితా...అయామ్ ఫ్రమ్ ఇండియా..." అంటూ లోపలకు అడుగుపెట్టాడు సందీప్. పలుగు పట్టుకుని తలుపు పక్కన నిలబడి దాడి చెయ్యడానికి సిద్ధంగా ఉన్న ఆమెను చూసి తను హెచ్చరించి లోపలికి రావడం ఎంతమంచి దైందో అతనికి అర్థమైంది. రెండురోజుల నుండీ తిండి లేకపోవడంతో నీరసించినట్టు ఉందేతప్ప ఆమె ఆత్మరక్షణ సన్నద్ధతలో ఆ నీరసం కనబడలేదు. ఆమె ధైర్యమే ఆమెకు రక్షగా నిలిచిందా అన్నట్టు ఒక వెలుగు ఆమె మొహం నుండి వెలువడు తోంది. "బ్యూటిఫుల్..." అప్రయత్నంగా అన్నాడు సందీప్ ఆమెను చూసి.

"ఏంటి?" సరిగ్గా వినకపోవడంతో మళ్ళీ అడి గింది అనిత.

"ఏమీ లేదు. ముందు ఇవి తిను.." అంటూ రెండు ఎనర్జీ బార్స్ తీసి ఆమెకు ఇచ్చాడు సందీప్. సరిహద్దు దాటడం శారీరక దారుఢ్యానికి పరీక్షగా మారే వ్యవహారం. దానికి తగిన శక్తి కావాలి. రెండు ఎనర్జీ బార్స్ తిన్న ఆమెలో తిరిగి శక్తి నిండి నట్టైంది. "ఇప్పుడు చెప్పు, మన ప్లాన్ ఏమిటి?" అడి గింది అనిత. "బారాముల్లా ఇక్కడికి 60 కిలోమీటర్ల దూరంలో ఉంది. అక్కడకు వెళ్ళగలిగితే మనం సేఫ్..."

"60 కిలోమీటర్లే.."

"గంటలో వెళ్ళడానికి ఇది హైవే కాదు. రెంటికీ మధ్య దుర్గమమైన హిమాలయ పర్వత సానువు లున్నాయి. పదిహేనువేల అడుగుల ఎత్తైన ఈ పర్వతాల మీద 60 కిలోమీటర్ల ప్రయాణం అంటే ఎన్ని రోజులు పడుతుందనేది ఎవరూ చెప్పలేరు.." ఆలోచనగా అన్నాడు సందీప్. ఒకసారి బయట పరిసరాలు చూసి వచ్చాడు. అప్పుడే పొద్దుగూకు తోంది. "అర్థరాత్రి దాటాక బయలుదేరుదాం. ఇప్పుడు బయటకు వెళితే నన్ను గుర్తించక పోయినా, నిన్ను మాత్రం వెంటనే గుర్తుపట్టేస్తారు. ప్రస్తుతం ఇక్కడ నువ్వు అంత పాపులర్ అయ్యావు" గోడలమీద చూసిన పోస్టర్లు గుర్తుచేసుకుంటూ

అన్నాడు. "మనం క్షేమంగా తిరిగి వెళ్ళగలమా?" గొంతులో భయం ధ్వనిస్తుంటే అడిగింది అనిత.

ఆమెను అలా చూస్తుంటే దగ్గరకు తీసుకుని, 'నా ప్రాణం అడ్డువేసి నిన్ను రక్షిస్తాను" అనబుద్ధవు తోంది అతనికి. కానీ కర్తవ్యం గుర్తుచేసుకుని, "నీ దగ్గర ఉన్న ఫొటోలు ఎక్కడ ఉన్నాయి?" అడిగాడు. చిన్న బటన్ సైజులో ఉన్న కెమేరా అతనికి ఇచ్చేసింది అనిత. దానిని జాగ్రత్త చేసుకున్నాడు సందీప్. "నువ్వు వచ్చింది వీటికోసమే కదూ..." అంది అనిత ఏదో ఆలోచన వచ్చి. "నేను వచ్చింది వేటికోసమైనా, నువ్వు లేకుండా వెనక్కి వెళ్ళను, సరేనా?" అన్నాడు ఆమె కళ్ళలోకి చూస్తూ. అతని కళ్ళల్లో ఏమి కనబడిందోగానీ అతన్ని పూర్తిగా నమ్మింది అనిత.

తన మొబైల్‌లో లోకల్ రేడియోస్టేషన్ ట్యూన్ చేసిన అతనికి తను నీలమ్ నదిలో పూడ్చిపెట్టిన గ్లైడర్ పోలీసులకు చిక్కిందని తెలిసింది. 'ఇప్పుడు పోలీసులు ఒకరికోసం కాదు, ఇద్దరి కోసం అన్వేషణ చేస్తున్నారన్నమాట...' అనుకున్నాడు సందీప్. ఇంతలో బైట ఏదో శబ్దం వచ్చింది. కిటికీలోంచి చూశాడు. ఇద్దరు పోలీసులు పరిసరాలు గమనిస్తూ గేటు తీసుకుని తోట లోపలికి వస్తున్నారు. అనితను షెడ్డులోపలున్న గడ్డివాము చాటున దాచి, తను బయటకు నడిచాడు సందీప్. లోపలకు వస్తున్న పోలీసులను అప్పుడే చూస్తున్నట్టుగా నటించి ఆ ప్రాంతం యాసలో వారిని పలుకరించాడు. "ఈ అమ్మాయేమన్నా కనిపించిందా?" అనిత ఫొటో చూపించి అడిగారు.

"లేదు.." అని తను పిలవకపోయినా వారు లోపలకు రాకుండా ఆగరు కాబట్టి తనే ఆహ్వానించాడు.

ఇద్దరూ లోపలకు నడిచారు. వారికి కూర్చోడానికి చెక్క బెంచీ చూపించి, "ఇంత చలిలో ఎలా డ్యూటీ చేస్తున్నారు? ఒక పెగ్ తయారు చేయమంటారా?" అడిగాడు సందీప్. వాళ్ళు 'సరే' అనక ముందే వారి మౌనం అంగీకారంగా భావించి తన బ్యాగ్‌లో నుండి తీసి ముందుగానే బైటపెట్టిన బ్రాందీని మూడు గ్లాసుల్లో పోసి తెచ్చాడు. ఈ లోపు ఒక పోలీస్ గడ్డివాము దగ్గరకు నడవబోతున్నాడు. "సాబ్..." అంటూ ఒక గ్లాసు అతనికి అందించాడు సందీప్. అతను తన పని ఆపి తిరిగి వచ్చి దాన్ని తాగే పనిలో పడ్డాడు. తను పట్టుబడటానికి ఇంకెంతో సమయం లేదనుకుంది చాటు నుండి చూస్తున్న అనిత. అయితే వారు ఆమెను ఆశ్చర్యంలో ముంచెత్తుతూ గ్లాసులో ద్రవం పూర్తిగా తాగకముందే పక్కకి ఒరిగిపోయారు. ఏం జరిగిందో అర్థంకాక ఆశ్చర్యంగా చూస్తూ బయటకు వచ్చింది అనిత. 'మనకని రెండు సైనైడ్ కాప్స్యూల్స్ తీసుకువచ్చాను. అవి ఇలా పనికొచ్చాయి" చెప్పాడు సందీప్. అర్ధరాత్రి వరకు ఆగకుండా అప్పటికప్పుడే ఇద్దరూ బయలుదేరారు. సందీప్ తెచ్చిన చలికి తట్టుకునే కెవ్లార్ బట్టలు వేసుకుని అతన్ని అనుసరించింది అనిత. వారు అక్కడ నుండి బయటపడిన నాలుగు గంటల తరువాత పెద్ద పోలీస్ ఫోర్స్ అక్కడకు వచ్చింది.

బీటుకు వచ్చిన పోలీసులు తిరిగి రాకపోవడంతో అనుమానం వచ్చి వారు అక్కడకు వచ్చారు. జరిగినదేమిటో ఎవరూ చెప్పకుండానే వారికి అర్థమైంది. మిగిలిన అన్ని మార్గాలూ మూసి ఉన్నాయి కాబట్టి ఇక ద్రోహులు వెళ్ళగలిగింది ఒక్క పర్వతప్రాంతం మాత్రమేనని వారు గ్రహించారు.

కాలినడకన పారిపోయిన వారిని వెతుకుతూ పర్వతప్రాంతంవైపు కొందరు బయలుదేరారు. అనిత, సందీప్‌ల ప్రయాణం ఆగకుండా సాగుతూనే ఉంది. మధ్యమధ్యలో పది, పదిహేను నిమిషాలు ఆగుతూ నిరంతరాయంగా ప్రయాణిస్తున్నారు. అంత ఎత్తులో ఎముకలు కొరికే చలిలో నడవలేక అనిత డీలాపడినా సందీప్ ఆమె ఆత్మస్థైర్యాన్ని పెంపొందిస్తూ నడిపిస్తున్నాడు. చుట్టూ మంచు కప్పబడిన సన్నటి కొండ మార్గంలో ప్రయాణం సాగుతోంది. వారిని అనుసరిస్తున్న వారికీ, వీరికీ మధ్య అయిదారు గంటల తేడా ఉండటంతో మరుసటిరోజు వరకు వారి ప్రయాణం నిరంతరాయంగా సాగింది.

మరుసటి రోజు అదృష్టం కూడా వీరిద్దరికీ కలిసి వచ్చింది. మబ్బులు కమ్మి ఈదురుగాలులు వీచసాగాయి. వాటివల్ల వీరి నడక ఆలస్యమైనా వీరిని వెతకడానికి రప్పించిన హెలికాప్టర్ మాత్రం గాలిలోకి లేవలేక నిరుపయోగంగా మారింది. ఆ రాత్రికి ఇక నడిచే ఓపిక లేక ఇద్దరూ ఆగారు. అతను తెచ్చిన స్లీపింగ్ బ్యాగ్‌లో దూరి అవసరమైనంత నిద్రపోయి లేచారు. అయినా అనిత నడవలేకపోతోంది. "నువ్వు వెళ్ళు నా కోసం చూడకు. కనీసం ఒకరైనా బ్రతుకుతాం" అని అతన్ని అర్థించింది అనిత. "నీకు ఏం కాదు.." అభయం ఇస్తున్నట్టుగా అన్నాడతను.

నిన్నటి వరకు కలిసి వచ్చిన అదృష్టం మరుసటి రోజు మొహం చాటు వేసింది. ఫెళ్ళున ఎండ వచ్చింది. ఎండతో పాటే హెలికాప్టర్ కూడా వచ్చింది. తెల్లటి మంచు నేపథ్యంలో పదిహేను వేల అడుగుల ఎత్తున నడుస్తున్న వీరిని అవలీలగా గుర్తించింది. అప్పటికి అనిత ఓపిక పూర్తిగా నశించింది. అడుగుతీసి అడుగువేయలేకపోతోంది.

కొన్ని నిమిషాల్లో హెలికాప్టర్ వీరిని సమీపించింది. వీరిని ప్రాణాలతో పట్టుకోమని సైనికులకు ఉత్తర్వులు జారీచేయడంతో వారెవరూ కాల్పులు జరపలేదు. కొంతమంది హెలికాప్టర్ నుండి కిందకు దిగి ఇద్దరినీ వెదకి వారి దగ్గరున్న ఆయుధాలు స్వాధీనం చేసుకున్నారు. వారిని హెలికాప్టర్ ఎక్కించారు. అందులో ఎంతోమంది పట్టరు కాబట్టి కొంతమంది కిందే ఉండిపోయారు. ఆయుధం ధరించిన ఒక సైనికుడు వీరికి కాపలాగా ఉన్నాడు. హెలికాప్టర్ గాలిలోకి లేచింది. ఇక ఖైదీలు ఏమీ చేయలేరని కాస్త నిర్లక్ష్యం వహించాడు కాపలా ఉన్న సైనికుడు.

సందీప్ చిన్న సైగ చేశాడు. అర్థమైనట్టు తల ఊపింది అనిత. ఒకే సమయంలో సందీప్ హెలికాప్టర్ పైలట్ మీద దాడి చేస్తే, అదేసమయంలో అనిత ఆయుధం ధరించిన సైనికుడిమీదకు దూకింది. అప్పటికే పైలట్ తలవాల్చేశాడు. అతన్ని పక్కకు జరిపి తను ఆ సీట్లో కూర్చున్నాడు సందీప్. మరోపావుగంటలో మిగిలిన దూరాన్ని అధిగమించి బారాముల్లా చేరింది హెలికాప్టర్. అక్కడ ఉన్న అతని టీమ్ వారిద్దరినీ అభినందనలతో ముంచెత్తింది. అప్పుడే అక్కడకు వచ్చిన 'రా' డైరెక్టర్, సందీప్ చుట్టూ చేతులువేసి గాఢాలింగనం చేసుకున్నాడు. "ఇంత చేసిన నీకు ఏమివ్వగలను?" అన్నాడు. "నాకీ బహుమతి చాలు..." అనిత భుజాల చుట్టూ చేతులువేసి అన్నాడు సందీప్.

**సెల్: 9490158002**

## టాలీవుడ్ సూపరంట!

రకరకాల కారణాలతో టాలీవుడ్‌ని అందరూ ఆడిపోసుకుంటుంటే నిత్యామీనన్ మాత్రం తెలుగు పరిశ్రమ సూపరంటూ కితాబిచ్చింది. దక్షిణాదిన దాదాపు అన్ని భాషల్లోనూ తను నటించాననీ, కానీ ఇక్కడ హీరోయిన్లకు దక్కే గౌరవం మరే భాషలోనూ దక్కదని చెబుతోంది. మిగతా హీరోయిన్లు ఎవరైనా ఈ మాట అంటే అవకాశాల కోసం మాట్లాడుతున్నారు అనుకోవచ్చు. నిత్యాకి అంత అవసరం లేదు....ఏదైనా సరే ముఖం మీదే చెప్పే అలవాటు నిత్యాది. దాంతో చాలా మంది నిత్యా మాటలని సమర్థిస్తున్నారు. కాకపోతే ఈ సమయంలో నిత్యా ఇలాంటి మాటలు మాట్లాడాల్సింది కాదు అని కొందరు అంటున్నారు.



సురభి

# అదే ఆయన కోరిక

**తు**మ్మొచ్చినా, దగ్గొచ్చినా ఇప్పుడందరూ కార్పొరేట్ ఆస్పత్రివైపే నడుస్తున్నారు. బిల్లు తడిసి మోపెడయినా, అవసరమైనవీ, అవసరం లేనివీ అన్ని రకాల టెస్టులు చేస్తున్నా కూడా వాటివైపే పరుగులు. అసలు డాక్టర్‌ని కలుసుకోవాలంటేనే ముందుగా 500 సమర్పించుకోవాలి. కానీ ఓ డాక్టర్ మాత్రం అందుకు పూర్తిభిన్నం. శత వత్సరాలు పూర్తి చేసుకున్నా, నామమాత్రపు ఫీజుతో వైద్యసేవలు అందిస్తున్నాడు.

పుణె నివాసి డాక్టర్ బల్వంత్ గట్పాండే. ఆయన వయస్సు ఎంతనుకుంటున్నారు? 102 ఏళ్ళు. వామ్మో...సెంచరీ దాటినా ఇంకా వైద్యం చేస్తున్నారా! అని ఆశ్చర్యపో నక్కరలేదు. ఇప్పటికీ చురుగ్గా రోజుకు పది గంటలు హాస్పిటల్లోనే గడుపుతారు. వైద్యం చేస్తూనే కన్నుమూయాలనేది ఆయన గారి కోరిక. అంతలా తన వృత్తిని ప్రేమిస్తున్నారాయన. ఇంతకీ అసలు విషయమేమంటే ఆయన ఫీజు కేవలం 30 రూపాయలే! ఉన్నవారి దగ్గర తీసుకుంటారు. ఇవ్వ లేనివారిని అసలు అడగరు. ఎప్పటికప్పుడు మెడికల్ రంగంలో వస్తున్న మార్పులను అధ్యయనం చేస్తూంటారు. ఆహార నియమాలు పాటించటం, వ్యాయామం వల్లే తను ఆరోగ్యంగా ఉండి, అందరికీ సేవ చేయగలుగుతున్నానని గర్వంగా చెప్పుకుంటారు.





# హ్యూమన్ ఫ్లవర్

గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్... సాహసాలకి, అరుదైన, విచిత్ర చర్యలకి స్థానం కల్పించే ప్రపంచ వింతల బుక్కు! అందులో స్థానం సంపాదించడానికి ఎంతోమంది ఎన్నో రకాలుగా ప్రయత్నిస్తుంటారు. కాలిఫోర్నియా వాసులు కూడా రికార్డు కోసం ప్రయత్నించి, గిన్నిస్‌బుక్‌లోకి ఎక్కేశారు. ఎలాగంటారా?

అమెరికాలోని కాలిఫోర్నియాలో దాదాపు 2,400మంది ఆసియన్ ఆర్ట్ మ్యూజియంలో చేరారు. వారంతా తామరపువ్వు ఆకారంలో నిలబడి, ప్రపంచంలోనే అతి పెద్ద 'హ్యూమన్ ఫ్లవర్'గా రికార్డు సృష్టించారు. ఈ రికార్డులో భాగస్వాములైనవారందరూ దాదాపు ఐదు నిమిషాలపాటు తామరపువ్వు ఆకృతిలో ఉన్నారు.

దీనికి సంబంధించిన వీడియోను మ్యూజియం అధికారుల ఫేస్‌బుక్ పేజీలో పోస్ట్ చేశారు.

# తనవంతు సాయం చేస్తోంది

**కు**క్కకున్న విశ్వాసం మనిషికి కూడా ఉండదంటారు. ఇంటికి రక్షణగా, పెంపుడు జంతువులుగా శునకాలు మనిషి జీవితంలో ఓ భాగంగా మారిపోయాయి. చైనాలో ఓ శునకం తీరు మాత్రం మిగిలినవాటికి భిన్నంగా ఉంది. పర్యావరణ పరిరక్షణ కోసం ఆ శునకం చేస్తున్న కృషి అందరినీ ఆకట్టుకుంటోంది.

చైనాకు చెందిన ఓ శునకం గత పదేళ్ళుగా సుజోవ్‌లోని నదిలో కొట్టుకుపోయే ప్లాస్టిక్ బాటిళ్ళను నోటితో కరుచుకుని, ఒడ్డుకు తీసుకొస్తుంది. వాటిని అక్కడో ఇక్కడో పారేయదు. ఎంచక్కా డస్ట్‌బిన్ ఎక్కడుందో చూసి, అక్కడికెళ్ళి వాటిని అందులో పడేస్తుంది. ఆవిధంగా



దాని యజమాని ఆ శునకానికి ప్రత్యేకంగా శిక్షణ ఇచ్చాడు. ప్రతిరోజూ అది నదిలోకెళ్ళి కనీసం 20 నుంచి 30 ప్లాస్టిక్ బాటిళ్ళను తీసుకొస్తుంది. ఇలా ఇప్పటివరకు నదిలో కొట్టుకుపోతూ, నదీజలాన్ని కాలుష్యం చేస్తున్న దాదాపు 200 బాటిళ్ళను తీసుకొచ్చిందట ఆ శునకం. మొత్తానికి అందరిచేతా వావ్ అనిపించుకుంటూ, పర్యావరణానికి తనవంతు సాయం చేస్తోంది.

# మళ్ళీ పుట్టాడు

**పు**నర్జన్మల గురించిన కథనాలు చాలా ఆసక్తికరంగా ఉంటాయి. ఎన్నో సినిమాలు పునర్జన్మ కథావస్తువుగా రూపొందాయి. అక్కడక్కడ ఛానళ్ళలో, పేపర్లలో పునర్జన్మ గురించిన వార్తలు చదువుతూనే ఉంటాం, చూస్తూనే ఉంటాం. అలాంటి సంఘటనే ఒకటి కాంబోడియాలో జరిగింది. ఓ మహిళ చనిపోయిన తన భర్త ఆవు రూపంలో పునర్జన్మ ఎత్తాడని సంబరపడుతోంది.

కాంబోడియాలోని క్రతీ ప్రావిన్స్‌కి చెందిన కిమ్‌హాంగ్ భర్త టోల్‌ఖుట్ ఏడాదిక్రితం మృతి చెందాడు. అయితే కొద్దిరోజులుగా ఆమె ఇంటికి ఓ ఆవు దూడ రోజూ రావడం మొదలుపెట్టింది. ఆ దూడ చేసే చేష్టలు అచ్చం టోల్‌ఖుట్ చేసినట్టే ఉంటున్నాయని, తన భర్తే దూడ రూపంలో వచ్చాడని ఆనందంతో ఆ దూడను జాగ్రత్తగా చూసుకుంటోంది కిమ్‌హాంగ్. తన ఇంటిలోని మొదటి అంతస్తుకు మెట్లపై నుంచి వెళ్ళి బెడ్‌పై పడుకుంటోందని, మెత్తటి దిండును తన దగ్గరకు తీసుకుంటోందని.. తన భర్త కూడా ఇలాగే చేసేవారని కిమ్‌హాంగ్ చెబుతోంది. కిమ్‌హాంగ్ ఇంట్లో ఉన్న ఆవు దూడను చూసేందుకు రోజూ 100కు పైగా సందర్శకులు వస్తున్నారట. దీంతో అక్కడి సోషల్ మీడియాలో ఈ విషయం హాట్ టాపిక్‌గా మారింది.

**–నర్మద వాసిరెడ్డి**





**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych),
P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ
ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి

# హెపటైటిస్,హెర్పిస్‌లకు హోమియోతో చెక్

హెపటైటిస్ వైరస్ మూలంగా అనేక మంది తీవ్రమైన కాలేయ వ్యాధి బారినపడి ప్రాణాలు కోల్పోతున్నారు. వైరస్ ఉన్న రక్తాన్ని ఎక్కించడం, డ్రగ్స్ అలవాటు ఉన్న వారు ఒకరు ఉపయోగించిన నీడిల్స్ మరొకరు ఉపయోగించడం ప్రధాన కారణంగా చెప్పుకోవచ్చు. తల్లి నుంచి శిశువుకు కూడా సంక్రమించే అవకాశం ఉంది. లైంగిక సంబంధాల ద్వారా కూడా వ్యాపిస్తుంది.

### లక్షణాలు

ఆకలి లేకపోవడం, వాంతులు వచ్చినట్టు అనిపించడం, ఒళ్లంతా నొప్పులు, మూత్రం పచ్చగా రావడం, కామెర్లు అభివృద్ధి చెందడం, చర్మంపైన దద్దుర్లు రావడం జరుగుతుంది. ఈ వ్యాధి కొన్ని సంవత్సరాల తర్వాత బయటపడినట్లయితే దాన్ని క్రానిక్ హెపటైటిస్ అంటారు. దీని వల్ల కామెర్లు వస్తాయి. ఎంతకీ తగ్గవు. వాంతులు, ఒళ్లంతా దురద, కొన్నిసార్లు విరేచనాలు, కడుపులో ఉబ్బరంగా ఉండటం, పొట్టలో నొప్పి, ఆర్థరైటిస్ వాచిపోవడం, కిడ్నీకి సంబంధించిన సమస్యలు, ప్లేట్‌లెట్ కౌంట్స్ పడిపోవడం, తలనొప్పి, రక్తహీనత, రక్తకణాల సంఖ్య క్రమంగా పడిపోవడం జరుగుతుంది.

### హెర్పిస్ సింప్లెక్స్

పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలి ఎర్రగా పుండు పడుతుంది. ఇటువంటి సమయంలో తగు చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అంటారు. ఈ వ్యాధిని లక్షణాలను బట్టి గుర్తించవచ్చు. అపరిచిత వ్యక్తులతో లైంగిక సంపర్కం తరువాత వారం రోజులలో నీటి పొక్కులలాగా వచ్చి పుండ్లు కనిపిస్తాయి. కొన్నిరోజుల తరువాత పుండ్లు మానిపోయి తిరిగి కనిపిస్తాయి. దీన్ని బట్టి హెర్పిస్‌ని గుర్తించవచ్చు.

### హోమియో చికిత్స

హెపటైటిస్ వైరస్‌ను సమర్థవంతంగా అడ్డుకునే చికిత్స హోమియోలో మాత్రమే ఉంది. వైరల్‌లోడ్‌ను పూర్తిగా తగ్గించడం ద్వారా ఆరోగ్యవంతమైన జీవనం గడిపే అవకాశం దక్కుతుంది. హెర్పిస్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది.

# కిడ్నీ, గాల్‌బ్లాడర్ స్టోన్స్‌కు సర్జరీ దాకా ఎందుకు?

కిడ్నీలో ఏర్పడిన రాళ్ల వల్ల తీవ్రనొప్పి వస్తుంటుంది. సాధారణంగా చిన్న రాళ్లు అయితే శరీరం నుంచి వాటంతట అవే బయటకు వస్తుంటాయి. కాని పరిమాణంలో పెద్దగా అంటే కనీసం 2 నుంచి 3 మిల్లీమీటర్ల కంటే పెద్దగా ఉన్న రాళ్లు మూత్రపిండంలోని వివిధ భాగాల్లో చిక్కుకుపోయి తీవ్ర నొప్పి మొదలవుతుంది.

**లక్షణాలు :** మూత్రపిండంలో రాళ్ల వల్ల భరించలేని నొప్పి ఉంటుంది. ఈ నొప్పి ఎక్కువగా ఉదయం, సాయంత్రం వేళల్లో ఉంటుంది. ఈ నొప్పి వీపు వెనుకభాగంలో నుంచి బయలుదేరి పొత్తికడుపులోకి వస్తుంది. తెంపరులుగా వచ్చే ఈ నొప్పి జననాంగాలలోకి పాకుతుంది. 20 నుంచి 90 నిమిషాల వరకు ఈ నొప్పి ఉంటుంది. దీంతోపాటు తల తిరగటం, వికారం, వాంతులు కావటం, మూత్రంలో మంట, రక్తం, చీము వస్తుంది. చెమట పడుతుండటం, జ్వరం, కంగారుగా, కోపంగా ఉంటుంది. ఈ నొప్పి మొదలైన తర్వాత ఎటువైపు కదిలినా, వంగినా నొప్పితో ఉపశమనం ఉండదు. కొన్ని సార్లు కాళ్లలో వాపు ఏర్పడవచ్చు.

### పిత్తాశయంలో రాళ్లు

పిత్తాశయం అనేది కాలేయం నుంచి వచ్చే పైత్య రసాలను ఒడిసిపట్టే సంచి లాంటిది. ఇందులో ఉండే పైత్యరసాలు మనం తీసుకునే మాంసకృత్తులు, నూనె పదార్థాలను అరిగింపచేయడానికి ఉపయోగపడుతుంది. ఇందులో ఏర్పడే పైత్యరసం యొక్క గాఢత పెరిగి పోతుందో అప్పుడు రాళ్లు ఏర్పడుతుంటాయి. పిత్తాశయంలో ఏర్పడిన రాళ్లు కొన్ని సంవత్సరాల పాటు పెద్ద లక్షణాలు చూపించవు. ఎప్పుడైతే ఆకారం పెరిగి పెద్దవిగా మారుతాయె అప్పుడు లక్షణాలు కనిపిస్తాయి. దీనివల్ల పొట్ట నొప్పి ఉంటుంది. కుడివైపు పొట్టలో నొప్పి మొదలై వీపు వెనుకభాగంలోకి చేరుతుంది. దీనివల్ల వికారం, వాంతులు, జ్వరం ఉంటుంది.

**హోమియో చికిత్స :** కిడ్నీ, పిత్తాశయాల్లో రాళ్లను పూర్తిగా నయం చేయడానికి హోమియోలో అత్యుత్తమ చికిత్స విధానాలు ఉన్నాయి. హోమియో మందుల వల్ల రాళ్లు తొలగిపోవడమే కాకుండా భవిష్యత్తులో మళ్లీ ఏర్పడకుండా చేయవచ్చు. సర్జరీ అవసరం లేకుండానే కిడ్నీలో, గాల్‌బ్లాడర్‌లో ఏర్పడిన రాళ్లను తొలగించుకోవాలంటే హోమియో ఏకైక పరిష్కారంగా చెప్పుకోవచ్చు.

# హెచ్‌ఐవి అంటే మరణం కాదు

**హెచ్‌ఐవి** పేరు వింటనే తెలియని భయం. ఎందుకంటే చికిత్స లేని వ్యాధి అది. నిజమే. కానీ ఇప్పుడు అద్భుతమైన మందులు అందుబాటులోకి వచ్చాయి. వైరస్ పూర్తిగా శరీరంలో నుంచి తొలగిపోకపోయినా ఆ వైరస్ ఎటువంటి ప్రభావం చూపకుండా చేసే హోమియో మందులు అందుబాటులో ఉన్నాయి. హెచ్‌ఐవి అంటే ఒక వ్యాధి అని చెప్పడం కన్నా వ్యాధులు రావడానికి కారణమయ్యే వాతావరణాన్ని శరీరంలో కలగజేస్తుందని చెప్పవచ్చు. అంటే చిన్న వాతావరణ మార్పులకే జలుబు చేయడం, జ్వరం రావడం, టీబీ సోకడం, విరేచనాలు కావడం జరుగుతుంది. ఫలితంగా మృత్యువు చేరువవుతుంది. అంటే రోగనిరోధక వ్యవస్థ బలహీనపడితే వ్యాధులు వచ్చిపడతాయి. బలంగా ఉంటే హెచ్‌ఐవి ఏమీ చేయలేదు. సరిగ్గా హోమియో చికిత్స రోగనిరోధక వ్యవస్థను శక్తివంతం చేయడం పైనే దృష్టి పెడుతుంది.

**లక్షణాలు :** హెచ్‌ఐవి శరీరంలోకి ప్రవేశించగానే ఎటువంటి మార్పులు కనిపించవు. కొన్ని సంవత్సరాల తరువాత అంటే సీడీ 4 కణాల సంఖ్య తగ్గిపోయిన తరువాత వ్యాధి లక్షణాలు కనిపిస్తాయి. కొందరిలో ఐదారేళ్లకే సీడీ 4 కణాలు బాగా తగ్గిపోయి ఇన్‌ఫెక్షన్లు మొదలవుతాయి. మరికొందరిలో పదేళ్లు పడుతుంది.

**హోమియో చికిత్స :** హోమియో మందుల వల్ల రోగనిరోధకవ్యవస్థ తిరిగి బలపడుతుంది. సీడీ 4 కణాల సంఖ్య గణనీయంగా పెరుగుతుంది. అవకాశవాద ఇన్‌ఫెక్షన్లకు చోటు లేకుండా పోతుంది. ఆకలి బాగా పెరగడంతో బరువు పెరగడం ప్రారంభిస్తారు. హోమియో చికిత్స తీసుకోవడం ద్వారా అందరిలాగే సాధారణ జీవితం గడిపే అవకాశం లభిస్తుంది. హోమియో మందులు సక్రమంగా తీసుకుంటే హెచ్‌ఐవి ఎప్పటికీ ఎయిడ్స్‌గా మారదు.

మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్, విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106

V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 4:30కి
డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.




**కొద్దిరోజులు గడిచాయి. ఒకనాడు అన్న బలరాముడు, బావమరిది శ్రీధాముడు, మిత్రబృందం సహా మర్రిచెట్టునీడకు చేరుకున్నాడు కృష్ణుడు. ఆలమందలు దూరంగా ఉన్నాయి. మేస్తున్నాయి అక్కడ. వాటిని మాగన్నుగా చూస్తూ ముచ్చట్లాడుతున్నాడు కృష్ణుడు. అదే అవకాశంగా ప్రలంబాసురుడు అనే రాక్షసుడు, కృష్ణుని మిత్రబృందంలో చేరే ప్రయత్నాల్లో పడ్డాడు. గోపాలకుని వేషం కట్టాడు. ఎవరూ గుర్తించని విధంగా తయారయ్యాడు. వచ్చి మిత్రబృందంలో ఒకనిగా కూర్చున్నాడు. ముచ్చట్లలో మాట కలిపాడు. బలరామకృష్ణుల అంతు చూసేందుకు ఇంతకన్నా గొప్ప ఆలోచన మరొకటి లేదనుకున్నాడు. అయినదానికీ, కానిదానికీ నవ్వుతూ అందరి దృష్టినీ ఆకర్షించాడు.**

# ప్రలంబాసురసంహారణ:పర్వతార్చన

కాసేపటికి అంతా హుషారయ్యారు. ఆడుకునేందుకు సిద్ధమయ్యారు. రెండు జట్లుగా విడిపోయారంతా. ఒకజట్టుకి శ్రీధాముడు అధినాయకుడు అయితే, ఇంకొకజట్టుకి కృష్ణుడు అధినాయకుడయ్యాడు. దూరం నుంచి లేళ్ళలా పరుగుదీసి వచ్చి, మర్రిచెట్టును ముట్టుకోవాలి. ముందుగా ముట్టుకున్నవారు గెలిచినట్టు. లేనివారు ఓడినట్టు. రెండు జట్లూ పరుగుకు సిద్ధమయ్యాయి. శ్రీధామునిజట్టులో ఉన్నాడు ప్రలంబాసురుడు. వాడు బలరామునికి ప్రత్యర్థిగా నిలిచాడు. ఇటు కృష్ణుడూ, అటు శ్రీధాముడూ ఒకేసారి 'ఓం' అన్నారు. వారు అలా అనగానే ఇరుజట్లూ పెద్దగా కేకలు వేసుకుంటూ పరుగందుకున్నాయి. కృష్ణుడు జట్టే ముందుగా వెళ్ళి మర్రిచెట్టుని ముట్టుకుంది. దాంతో శ్రీధామునిజట్టు ఓడిపోయింది. ఓడిపోయినవారు ప్రత్యర్థిని వీపున మోస్తూ పరుగుదియ్యాలి. బలరాముణ్ణి, ప్రలంబాసురుడు మోయాల్సివచ్చింది. అలా మోయాల్సి రావడం తన అదృష్టంగా భావించాడు ప్రలంబాసురుడు. అదే అవకాశంగా బలరాముణ్ణి మట్టుబెట్టాలనుకున్నాడు. జాగేలనండి! మొయ్యండి! మొయ్యండి! పరుగుదియ్యండి అంటే ప్రత్యర్థుల్ని మోసారంతా. వీపున మోసుకుని పరుగుదీశారు. వచ్చిన అవకాశాన్ని వదులుకోరాదు. శత్రువును చేజారనీయరాదనుకున్నాడు ప్రలంబాసురుడు. బలరాముణ్ణి ఆకాశానికి ఎత్తుకుపోయి, అక్కడ అతన్ని సంహరించడం బాగుంటుంది అనుకున్నాడు. అనుకున్నదే ఆలస్యం, ప్రలంబాసురుడు నిజరూపం ధరించాడు. బలరాముణ్ణి సందిట బిగించి ఆకాశానికి ఎగిశాడు. తానుండాల్సింది గోపకుమారుని వీపున. ఉన్నది రాక్షసుని సందిట. ఇదెలాసాధ్యం? అయోమయానికి గురయ్యాడు బలరాముడు. భయపడ్డాడు. ఆక్రోశించాడిలా.

కృష్ణా! ఈ రాక్షసుడెవడో గోపాలుడిలా వచ్చి, నన్ను తస్కరించుకుని పారిపోతున్నాడు. భయంగా ఉంది. ఏం చెయ్యనిప్పుడు? ఎలా వీడి నుండి బయట పడను? ఊపిరి ఆగిపోతోంది, ఉపాయం చెప్పు తమ్ముడూ!

బలరాముణ్ణి తీసుకుని ఆకాశానికి ఎగిసిపోతున్న ప్రలంబాసురుణ్ణి చూశాడు కృష్ణుడు. అరచి చెప్పాడిలా.

బలదేవా! నీ శక్తి నీకు తెలియక భయపడుతున్నావు. మానుషాకృతి ధరించినా నువ్వు మానవమాత్రుడివి కాదు. నీకు ఆకాశమే శిరస్సు. పాతాళమే చరణతలం. వాయుదేవుడు నిశ్వాసం. అగ్ని ముఖం. విశ్వమంతా నువ్వే! నీకు అంతం అన్నది లేదు. అందుకే నిన్ను అంతా అనంతుడంటారు. వేల కొలది శిరస్సులతో నువ్వు అఖిల ప్రపంచాన్ని భరిస్తున్నావు. మహాబలవంతుడివి నువ్వు. నీలాంటి వాడు అసురునికి భయపడడం తగదు. పైగా నీకూ నాకూ ఆవంతైనా భేదం లేదు. నువ్వూ నేనూ ఒకటే! మనిద్దరం దుష్టశిక్షణకోసం, శిష్టరక్షణకోసం జన్మించాం. మరచిపోకు. ధైర్యం తెచ్చుకో! ఆ దానవుణ్ణి దునుమాడు!

కృష్ణుని మాటలతో తానెవరో తెలుసుకున్నాడు బలదేవుడు. స్వస్వరూపజ్ఞానంతో అధైర్యాన్ని విడిచి

**గ్రీష్మతాపం శాంతించి వర్షాకాలం వచ్చింది. వానలే వానలు. భూదేవికి రేబవళ్ళు అభిషేకమే. పచ్చగడ్డీ, లతలూ, చెట్లూ ఏపుగా పెరిగాయి. పాడిపంటలు, పసిపాపలతో ప్రజలు కళకళలాడుతున్నారు. మహేంద్రోత్సవానికి ఇదే సరైన సమయం అనుకున్నారు పెద్దలు. హడావుడి మొదలైంది. అప్పుడు కృష్ణుడు వారిని సమీపించి ఈ ఉత్సవం దేనికి? ఈ పూజలవల్ల ఫలితమేమిటి? అని ప్రశ్నించాడు. అప్పుడు పెద్దలేమన్నారు?**

పెట్టాడు. కొండవలె ఎదిగాడు. వజ్రాయుధంలాంటి పిడికిటిపోట్లతో ప్రలంబాసురుని శిరస్సును తుత్తునియలు చేశాడు. కాళ్ళూ చేతులూ మెలిపెట్టి విరిచేశాడు. రక్తధారలతో నింగి నుంచి నేలకి జారిపడి, ప్రలంబాసురుడు ప్రాణాలు విడిచాడు. వాడు మరణించడంతో బలదేవుడు ఆకాశం నుంచి ఒకే ఒక్క దూకుతో మర్రిచెట్టును సమీపించాడు. కృష్ణాదులను చేరుకున్నాడు. ప్రలంబాసురసంహారాన్ని ఆకాశవీధుల్లోంచి చూసిన అమరులు బలదేవుణ్ణి అనేక విధాల అభినందించారు. అతని బలిమిని వేనోళ్ళ వినుతించారు. విజయపారవశ్యంతో కృష్ణుణ్ణి గట్టిగా కౌగిలించుకున్నాడు బలదేవుడు. ఒకరి నొకరు కౌగిలించుకుని, అభినందించుకుంటున్న అన్నదమ్ముల్ని చూసి మిత్రబృందం పొంగిపోయింది. వారిచుట్టూ కరతాళధ్వనులు చేస్తూ ప్రదక్షిణ చేసింది. రోజులన్నీ హాయిగా ఆటగా సాగిపోయాయి.

అంతలో గ్రీష్మం ప్రవేశించింది. చంద్రనిప్పుల్ని చెరిగింది. వడగాలిని తట్టుకోలేక ఆకుల్లో దాగిన పక్షులు విలవిల్లాడుతూ నేలరాలి మరణించాయి. అడవుల్లో దావాగ్నులు విజృంభించాయి. క్రమం క్రమంగా గ్రీష్మం శాంతించింది. వర్షాకాలం వచ్చింది. వానలే వానలు! భూదేవికి రేబవళ్ళు అభిషేకం జరిగింది. కొంతకాలానికి శరత్కాలం ప్రవేశించింది. ఏరులన్నీ నదులయ్యాయి. నదులన్నీ సముద్రుణ్ణి చేరుకున్నాయి. రెల్లుపూల గుబురులు కన్నులపండువయ్యాయప్పుడు. తెల్లని కలువపూలతో చెరువులన్నీ కళకళలాడాయి. గోపికల ఆటపాటలు, వారు పాలుపితుకుతున్న సవ్వడులు, ఆబోతులరంకెలతో శరత్సమయం వెన్నెలరాత్రులు వీనులవిందు చేశాయి. వేలకొలది లేగలతో వర్ధిల్లిన తమ గోసంపత్తిని చూసి, పెద్దలంతా సంతోషించారు. అనుకున్నారిలా.

కురిసిన వర్షాలకి పంటలేకాదు, పచ్చగడ్డీ, లతలూ, చెట్లూ ఏపుగా పెరిగాయి. రోగాలు లేక పశువులన్నీ హాయిగా చల్లగా ఉన్నాయి. పాడిపంటలతో, పసిపాపలతో ప్రజలంతా కళకళలాడుతున్నారు. రాజుగారి చల్లనిచూపులో అందరం సుఖంగా బతుకుతున్నాం. మహోత్సవాలకు ఇదే సరైనసమయం. వెంటనే మహేంద్రోత్సవం జరిపిద్దాం.

అనుకున్నదే ఆలస్యం, పల్లెలో మహోత్సవాన్ని చాటింపు చేశారు. సంభారాల సేకరణకు ఉపక్రమించారు. ఎక్కడపడితే అక్కడ అంతా హడావుడిగా ఉంది. గమనించాడది కృష్ణుడు. ఏమిటి ఈ మహోత్సవం? ఎందుకు ఈ వేగిరపాటు? తెలుసుకోవాలనుకున్నాడు. పెద్దలని సమీపించాడు. అడిగాడిలా.

ఉత్సవం దేనికి? దేవుడు ఎవరు? ఆ దేవుడికి చేసిన పూజలవల్ల ఫలితమేమిటి?

కృష్ణుని ప్రశ్నలకు సమాధానం నువ్వు చెప్పు అంటే నువ్వు చెప్పు అంటూ పెద్దలంతా ఒకరిని ఒకరు ఎగదోలుకున్నారు. వారందరినీ వారించాడో




వృద్ధుడు. కృష్ణుడికిలా చెప్పాడు.

కృష్ణా! ఇది మహేంద్రోత్సవం. మహేంద్రుడు లోక పాలకులకేగాక, లోకాలన్నిటికీ అధీశ్వరుడు. వర్షాకాలానికి అతను అధిపతి. కారుమబ్బులు అతని ఆనతి శిరసావహించే కురుస్తాయి. దానికి ప్రత్యక్షసాక్ష్యమే ఇంద్రధనుస్సు. ఉరుములూ, మెరుపులూ ఆ మహనీయుని కనుసన్నలే! ఆ దేవునిదయవల్లే మన గోసంపద ప్రవర్ధమానమవుతున్నది. కొండకోనల్లో పశువులకు కడుపునిండా మేత లభిస్తున్నదన్నా, కుండలనిండా ఆ పశువులు పాలిస్తున్నవన్నా అదంతా ఆ దేవుని చలవే! అందుకే ఇంద్రునికి పూజలు చేస్తున్నాం. ఇది ఈనాడు చేస్తున్నది కాదు. ఏనాటి నుంచో వస్తున్న ఆచారం.

వృద్ధునిమాటలకు సన్నగా నవ్వాడు కృష్ణుడు. చెప్పాడిలా.

శ్రమనీ, వ్యాపారాన్నీ, పశుపాలననీ నమ్ముకున్న వారందరికీ అవే ఆరాధ్యదైవాలు. మనం అడవుల్లో సంచరిస్తాం. కొండగుహల్లో ఉంటాం. గోపాలనమే మన మనుగడ. అందువల్ల అడవులూ, కొండలూ, ఆవులే మనకి ఆరాధ్యదైవాలు. ఎవరైనా వారివారి జాతిదేవుళ్ళనే అర్చించాలి. ఇలవేల్పుల్ని కాదని, పర దేవతల్ని అర్చించడం అర్థరహితం. పైగా ప్రయోజనం కూడా శూన్యం.

మంత్రదేవతలను ఉద్దేశించి యజ్ఞాలాచరిస్తారు బ్రాహ్మణులు. నాగళ్ళను ఉద్దేశించి అర్చనలు చేస్తారు రైతులు. ఆ తీరున గోపాలురు, తమకు ఆశ్రయాలయిన మహీధరాలను ఉద్దేశించి పూజలు చెయ్యాలి. పర్వతపూజే మన మహోత్సవం. వెర్రిమొర్రి మహేంద్రుని పూజించడం మానుకుని, పర్వతార్చనకు మీరంతా నడుం కట్టండి.

ఆశ్చర్యపోయి కృష్ణుని చూశారంతా. పూచికపుల్లలా మహేంద్రుని తీసిపారేయడాన్ని తట్టుకోలేకపోయారు పెద్దలు. అది గ్రహించాడు కృష్ణుడు. అడిగాడిలా.

అసలింతకీ ఆ ఇంద్రుడు ఎవరు? అతన్ని అమరులూ, మునీంద్రులూ పూజిస్తే పూజించవచ్చు. మనం ఎందుకు పూజించాలి? అతనేమైనా ఈ కొండల్లా, ఆ అడవుల్లా మనకు కూడూ, నీడా కలిగిస్తున్నాడా? లేదు కదా? అందుకే చెబుతున్నాను, మీరేమీ భయపడనవసరం లేదు. ఆందోళన కూడా చెందవద్దు. ఆదుకున్నవాడే ఆదిదేవుడు. మనం అంతా పర్వతాల్నే పూజిద్దాం. మీరు కాదూ కూడదంటే బలవంతాన పూజలు చేయిస్తానుకాని, వదలను. మీకు నామీద ఏమాత్రం అభిమానం ఉన్నా వెంటనే పర్వతపూజకు సిద్ధంకండి.

కృష్ణుడు ఆజ్ఞాపించినట్టుగా మాట్లాడేసరికి పెద్దలంతా మిన్నకుండిపోయారు. సమాధానాల కోసం వెదుకులాడడం మానేశారు. అంగీకరించినట్టుగా చేతులు కట్టుకుని నిల్చున్నారు. పెద్దలు ఇద్దరు ముగ్గురు కల్పించుకుని, మాట్లాడారిలా.

కృష్ణా! ఆర్తత్రాయపరాయణా! నువ్వు చెప్పినట్టుగా నడుచుకుంటాం. నువ్వు మాగతివి. మాపతివి. మా మతివి. ఈ పల్లె నీవల్లే భూలోకస్వర్గమైంది. ఊహాతీతమైన ఘనకృత్యాలు నీవి. నీ నిజస్వరూపం తెలుసుకోవడం మావల్ల కాదు. నువ్వు మానవమాత్రుడివి కాదు. బలపరాక్రమాలలో ఆ దేవేంద్రుడు కూడా నీకు సాటిరాడు. అందచందాలలో ఆ చంద్రుని కన్నా నువ్వే గొప్పవాడివి. గాంగేయుడికి నువ్వు సరిజోడివి. నువ్వు చెప్పినట్టే చేద్దాం. దేవేంద్రార్చన మాటే లేదిక. పర్వతపూజే నిర్వహిద్దాం.

అద్రిపూజకు సిద్ధమయ్యారంతా. చక్కగా అలంకరించుకుని గోపికలంతా పూజాప్రదేశానికి చేరుకున్నారు. గోపాలకులు కడుజాగ్రత్తతో సంభారాలన్నీ సమకూర్చారు. పాయసాలతో, భక్ష్యాలతో, మాంసాహారాలతో, హృద్యమైనమద్యాలతో, పాలు, పెరుగు, నేయి, తేనెలతో, మంగళవాద్యాలతో గోవర్ధనపర్వత ప్రాంతమంతా హోరెత్తింది.

పర్వతప్రాంతంలో గోమయంతో అలికి ముగ్గులు పెట్టారు. మనోజ్ఞవేదికను నిర్మించారు. ఆ వేదికపై కృష్ణుణ్ణి కూర్చోబెట్టి, అతని చుట్టూ కూర్చున్నారంతా. ముందుగా కృష్ణుడు గోవర్ధనగిరిని పూజించాడు. పశువులసహా అనేక భక్ష్యాలు నైవేద్యంగా సమర్పించాడు. తనలాగే మిగిలిన పెద్దలు కూడా గిరిపూజను నిర్వహించాలని చెప్పాడు. మహావిష్ణువు చలాచల రూపుడు. అచలాకృతి గోవర్ధనగిరి అతడే! అందుకే దానికి పూజలు కావాలన్నాడు కృష్ణుడు. పూజలూ, నైవేద్యాలూ స్వీకరించి, అన్నాడిలా కృష్ణుడు.

గోపాలకులారా! మీ భక్తిశ్రద్ధలూ, మీ పూజలూ నాకు అమితమైన ఆనందాన్ని కలిగించాయి. సంతృప్తి చెందాను.

ఆ పలుకులకి పెద్దలు దోసిలొగ్గి నిలిచారు. అడిగారిలా.

కృష్ణా! మేమందరం నీ దాసానుదాసులం. నీ ఆజ్ఞను శిరసావహించడమే మా కర్తవ్యం. మమ్మల్ని ఏం చెయ్యమంటావో చెప్పు?

ఈ క్షణం నుంచి మీరు నన్నే ఆరాధించండి. పర్వతస్వరూపమైన నన్ను ఆరాధించడంలో మీ అభీష్టాలన్నీ నెరవేరుతాయి. ఆలమందలు తామరతంపరంగా అభివృద్ధి చెందుతాయి. అమృతం వంటి క్షీరధారలు అభివర్షిస్తాయి. అసలు సంగతి చెబుతున్నాను, మీ అంతరాంతరాలలో ఉన్నది నేనే! నన్ను పూజిస్తే, మిమ్మల్ని మీరు పూజించుకున్నట్టే అన్నాడు కృష్ణుడు.

అవునా! అని ఆశ్చర్యపోయి తమనితాము చూసుకున్నారు పెద్దలు. అందరూ కృష్ణులే! అలాగే వేదికమీది కృష్ణుణ్ణి చూశారు. ఎవరు చూస్తే వారే వేదిక మీద ఉన్నట్టుగా కనిపించింది. అంతేకాదు, గోవర్ధనగిరి అంతటా కృష్ణుడే! ప్రతి పుట్టలోనూ, చెట్టులోనూ, గిరి కిందా, మీదా అన్నిటా కృష్ణుడు రూపుకట్టాడు. కనువిందు చేశాడు. అంతలోనే లీలా మానుషుడయ్యాడు. కృష్ణునిలీలలను వేనోళ్ల వినుతించారు పెద్దలు. భక్తిశ్రద్ధలతో పదేపదే నమస్కరించారు.

కృష్ణుడు ఆనతి మేరకు పశువులకొమ్ములకి పూలదండలు చుట్టారు. వాటిని కుంకుమాక్షతలతో పూజించారు. చిరుగజ్జెలపేరులు అలంకరించారు. గోవర్ధనగిరిచుట్టూ తిప్పి, ఆనందంగా పెద్దగా అరిచారు. అక్కడక్కడా పశువులకు హారతులిచ్చారు. నేలపై సాగిలబడి, వాటికి మొక్కారు. పాలూ, పరమాన్నాలూ పంచిపెట్టారు. విందులారగించారు. వినోదప్రసంగాలు చేశారు. పర్వతపూజ అలా ముగిసింది. కృష్ణునిసహా పల్లెబాటపట్టారంతా.

—అరణి



మధుబాబు

6

# స్టార్ ఫైటర్

అనబడే ఫైటింగ్ ఫూల్

**చూపుడువేలు చాపి నెత్తిమీద గట్టిగా నొక్కి పట్టుకుంటే, వెల్లకిలాపడి కళ్ళు తేలవేసే ఆ చిన్ని ప్రాణానికి, తన ఒంటిని అలుముకుని ఉన్న దుర్వాసన గురించి ఎలా తెలిసిందోనని ఆశ్చర్యపడలేదు మిచిషీ.**

**దట్టమైన కొమ్మలమధ్య బయటికి కనిపించకుండా దాక్కుని ఉన్న జామపండ్లను చిటికెలో కనిపెట్టేస్తాయి అవి, తమకు దేవుడిచ్చిన ఘ్రాణశక్తి సహాయంతో.**

'ఈ బురదలో పడి ప్రాణాలు పోగొట్టుకోకుండా తిరిగి రాగలగటం నిజంగా నా అదృష్టం. నా ప్రాణాల్ని కాపాడిన వాళ్ళు ఇద్దరున్నారు. మీరు వాళ్ళని కూడా పలకరిస్తూ ఉండండి' నవ్వుతూ చెప్పి బాత్‌రూమ్ వైపు వెళ్ళిపోయింది ఆమె.

ఆకుపచ్చటి రెక్కల్ని తపతపలాడిస్తూ కూర్చున్న ప్రదేశం నుంచి పైకి లేచాయి అవి రెండు. ముందు గదిలోకి వచ్చి ఒక కుర్చీమీద వాలాయి.

'అయ్యబాబోయ్, చిలకలు... అచ్చం మన దేశంలో ఉన్న వాటి మాదిరిగానే ఉన్నాయ్' మిచిషీ తల్లి చూపించిన ఇంకో బాత్‌రూమ్‌వైపు బయలుదేర బోతున్న పొట్టిమనిషి ఆశ్చర్యంగా అన్నాడు.

'వాటి అవతారం మన వాటి మాదిరిగానే ఉన్నా కూడా, మాటల్లో మాత్రం చాలా తేడా ఉంటుంది. వీటికి నోరు కొంచెం పెద్దది. జ్ఞాపకశక్తి కూడా ఎక్కువే' అంటూ ఉన్నట్లుండి చిన్నగా తన చేతుల్ని తట్టాడు అతని జతగాడు. పెదవుల్ని ముడిచి సన్నగా ఈలవంటి శబ్దాన్ని వెలువరించాడు.

రెక్కల్ని తపతపమని కొడుతూ ఒక్కసారిగా కుర్చీ మీది నుంచి లేచి అతని భుజాల మీద వాలి నయ్ అవి.

"బాగున్నారా? ఆహారం తీసుకున్నారా?' ఆప్యాయంగా అడిగాడు అతను.

'మేము తీసుకున్నాము. మీరే తీసుకోవాలి..' అతని చెవి దగ్గిర నోరు పెట్టి కువకువలాడింది ఒకటి.

'ఏ ఊరు మీది?' అడిగాడు అతను.

'చాలాదూరం... ఒక రాత్రి, ఒక పగలు ప్రయాణం" అన్నది రెండవ చిలుక.

తనకు చూపించబడిన బాత్‌రూమ్ ద్వారం దగ్గిర ఆగి, కుతూహలంగా వెనక్కి చూస్తున్నాడు పొట్టి మనిషి. 'మనం చెప్పిన మాటల్ని తిరిగి మనకే వినిపించటం వాటికి దేవుడిచ్చిన వరం. తమంతట తాము ఆలోచించుకుని సమాధానాలు ఇవ్వటం చేతకాదని అందరూ అంటూ ఉంటారు' సాలోచనగా అన్నాడు.

'కుంగ్‌ఫూ విద్యాపీఠంలో ఇచ్చే ట్రెయినింగ్ ఫలితం ఇది. ఈ పోలీస్ అమ్మడు చెప్పిన ఆ తాత ఎవరో గాని, మంచి ట్రెయినర్ అయి వుంటాడు' అంటూ నవ్వాడు అతని జతగాడు.

'నీ నవ్వు చాలా బాగుంది. ఎప్పుడు నవ్వుతూనే ఉంటే, ఇంకా బాగుంటుంది' తడుము కోకుండా మెచ్చుకుంది మొదటి చిలుక.

'చిన్నచిన్న మాటలుతప్ప పెద్దపెద్ద వాక్యాలను పలకటం చేతకాని ఈ పక్షులు తమంతట తామే చాలా పెద్దమాటలు మాట్లాడటం... అబ్బో... చిత్రాలలో కెల్లా మహావిచిత్రం' అంటూ బాత్‌రూమ్‌లోకి వెళ్ళిపోయాడు పొట్టి మనిషి.

ముందుచూపు తనకు చాలా అధికంగా ఉన్నట్టు, శుభ్రంగా ఉన్న రెండు జతల దుస్తుల్ని తీసుకు వచ్చి అక్కడ పెట్టింది మిచిషీ తల్లి.

'మీ దుస్తులు కూడా బాగా మలినపడి పోయి ఉన్నాయి. వాటిని వదిలేస్తే శుభ్రం చేయిస్తాను' అని చెప్పింది యువకుడికి.

'అమ్మా... పాపాయి కుశలమే కదా... ప్రాబ్లమ్ ఏమీలేదుకదా' అడిగాడు అతను.

నవ్వింది మిచిషీ తల్లి... 'బంగారుబొమ్మ... చక్కటి ముఖం.. మంచి ఆరోగ్యం. మీరు బెంగపెట్టుకోవాల్సిన అవసరం ఏమీలేదు...' అంటూ ఆ యువకుడు ఇంట్లోకి వచ్చీరాగానే ఒక మూలగా పెట్టిన ఒక మూటవైపు చూసింది.

షాన్‌సూ భార్యకు బంధువైన వృద్ధురాలి దగ్గర ఉన్నది ఒక క్లాత్ బ్యాగ్. ఏవేవో మూలికలు, మందులు, అవసరమైనప్పుడు ఉపయోగించుకునేందుకు వీలైన రెండు జతల దుస్తులు ఉన్నాయి

### జరిగిన కథ

*జపాన్ వెళ్ళి, కుంగ్‌ఫూ విద్యాపీఠంలో చేరిన షాడో, ఫ్యుజీశాన్‌కు శత్రువుగా మారతాడు. అక్కడి నుంచి తన స్నేహితుడు గంగారాంతో కలిసి హాంకాంగ్ సిటీ కాంటన్ చేరుకుంటాడు షాడో. హుహుశాన్ మనుషులతో గొడవపడి షాన్‌సూ భార్యను రక్షిస్తాడు. షాడోని వెతుకుతూ బయలు దేరిన మిచిషీ కారు ఊబిలో దిగబడుతుంది. ఊబి నుంచి ఆమెను రక్షిస్తారు షాడో, గంగారాంలు. ఆ తరువాత వారిని తన ఇంటికి తీసుకువెళుతుంది ఆమె.*

*ఆ తర్వాత...*



అందులో.

ఒక జతను తీసుకుని ఏవేవో వస్తువుల్ని మూటగా కట్టాడు ఆ యువకుడు. పాపాయితో పాటు ఆ మూటను మోసుకువచ్చాడు.

'అది కూడా బురద కొట్టుకుపోయి కనిపిస్తోంది. శుభ్రం చేయకపోతే ఇల్లంతా దుర్వాసనతో నిండి పోతూనే ఉంటుంది' అంది మిచిషీ తల్లి.

రెండు క్షణాలు ఆలోచించి ఆ మూటను విప్పి అందులో దాచిపెట్టిన వాటిని బయటికి తీశాడు యువకుడు.

బాత్‌రూమ్‌లోనుంచి బయటికి వచ్చిన మిచిషీ గనుక వెనుక నిలబడి ఉండక పోయి నట్లయితే, తూలి ఒక కుర్చీ మీద పడిపోయి ఉండేది ఆమె తల్లి.

నవరత్నఖచితమైన కత్తి, వజ్రాలు పొదిగిన శిరోమణి, విలువైన రాళ్ళు పొదిగి ఉన్న కంకణాలు...

'పాపాయి పుట్టిన వేళావిశేషం. బురద నేలలో బంధించిన పూర్వకాలపు నిధి..' మురికిగా తయారైన వస్త్రాన్ని అవతల పెడుతూ చెప్పాడు యువకుడు.

తన కళ్ళను, చెవుల్ని తనే నమ్మలేక పోతున్నట్టు కూతురువైపు చూసింది మిచిషీ తల్లి.

'లోపలపెట్టేయ్.. ఈ విషయం బయటికి పొక్కితే నగరమంతా అల్లకల్లోలం అయిపోతుంది. పలుగులు, పారలు పట్టుకుని జనమంతా ఆ బురద నేలను తవ్వి పారేస్తారు' ముక్తసరిగా చెప్పింది మిచిషీ.

'నువ్వు, నేను గుట్టుగానే ఉంటాము. నీ డ్రైవర్ సంగతి ఏమిటి?' అడిగింది తల్లి. తెలివివచ్చిన వెంటనే ఆమె అందించిన బార్లీ జావను తాగి, నెమ్మదిగా బయటికిపోయాడు అతను. ఇంటిముందున్న ఒక ఫిగో చెట్టుక్రింద కూర్చుని ఫర్దర్ ఆర్డర్స్‌కోసం ఎదురుచూస్తున్నాడు.

తాము మాట్లాడుతున్న మాటలు అతనికి విన బడే అవకాశం లేదని ధృవీకరించుకుని, ఆ గదిలోనే ఉన్న ఒక బీరువాలో నుంచి రెండు కరెన్సీ నోట్లను అందుకున్నది మిచిషీ.

'నువ్వు ఇంటికిపోయి రెండురోజులు పూర్తి విశ్రాంతి తీసుకో. నీతో అవసరం వచ్చినప్పుడు ఫోన్ చేయిస్తాను' ఆ నోట్లను అతనికి అందిస్తూ చెప్పింది.

ఓపికను కూడదీసుకుని శాల్యూట్ చేశాడు అతను. నెమ్మదిగా వీధిలోకి వెళ్ళిపోయాడు.

'మాటల మనిషికాదు మిచిషీ.... చేతల మనిషి' యువకుడి భుజంమీదనే ఉన్న చిలుకల్లో ఒకటి వెంటనే కామెంట్ చేసింది.

'నువ్వు కొంచెం నోరు మూసుకుంటే చాలా బాగుంటుంది. నీకు వాగుడు చాలా ఎక్కువై పోయింది' చిరుకోపంతో దాన్ని హెచ్చరించి, యువకుడి వైపు చూసింది మిచిషీ.

'షాన్‌సూ భార్య మా దగ్గర ఉన్నంతవరకూ ఆమెకు, ఆమె బిడ్డకు ఎటువంటి ప్రాబ్లం ఎదురు కాదు' అన్నది.

'హుహుశాన్‌కి తెలియకుండా ఉండదు. తెలిసిన మరుక్షణం వాళ్ళకే కాదు మీకు కూడా తప్పదు ముప్పు' అన్నాడు అతను.

'లాగిపెట్టి కొడితే లేచి నిలబడటం చేతకాని షాన్‌సూ వంటి ఒక ఆర్డినరీ మనిషి మీద అంత కక్ష పెంచుకోవటం దేనికో నాకు అర్థం కావటం లేదు..' అన్నాడు అప్పుడే బాత్‌రూమ్‌లోనుంచి బయటికి వచ్చిన పొట్టిమనిషి.

'నువ్వు మాట్లాడుతూ ఉండు' అంటూ తను బాత్‌రూమ్‌లోకి ఎంటర్ అయ్యాడు యువకుడు.

బురదతో నిండిన తన దుస్తుల్ని శుభ్రం చేసి తీసుకువచ్చాడు పొట్టిమనిషి. మిచిషీ తల్లి సిద్ధం చేసిన దుస్తుల్ని ధరించి, తన దుస్తుల్ని తీసుకుపోయి ఇంటి వెలుపల ఒక పొదమీద ఆరబెట్టి వచ్చాడు.

'హుహుశాన్‌కి రకరకాల వ్యాపారాలున్నాయి. వాటిలో ఏ ఒక్కదానికి అడ్డం వచ్చినా అమితమైన ఆగ్రహం వచ్చేస్తుంది అతనికి. ఏం చేస్తాడో తనకే తెలియదు' చెప్పింది అతనికి మిచిషీ.

'షాన్‌సూతో మేము మాట్లాడటానికి ఏమైనా వీలుంటుందా?' సాలోచనగా అడిగాడు అతను.

తడుముకోలేదు మిచిషీ. క్షణం కూడా ఆలస్యం చేయకుండా తల అడ్డం తిప్పింది.

'షాన్‌సూ బంధించబడి ఉన్న ప్రదేశంలో చాలా మంది అధికారులు కనిపిస్తూ ఉంటారు. అందరికీ భయమే. ఎవరూ సహకరించరు. చిటికెలో విషయం బయటికి పొక్కేస్తుంది' అన్నది.

ఆయిల్ డ్రమ్ము మాదిరి ముందుకు పొడుచుకు వచ్చిన పొట్టను సవరించుకుంటూ ఒక గోడను ఆనుకుని నిలుచున్నాడు పొట్టిమనిషి.

'తన దారికి అడ్డం వచ్చినట్లు భావించి ఉంటే షాన్‌సూని పోలీసులకు పట్టించవలసిన అవసరం లేదు. అతను నడిపే బోటు సముద్రంలో ఉండగానే నాశనం చేసి అతన్ని హతమార్చి ఉండవచ్చు. అలా



చేయకుండా మీ దగ్గరికి పంపించటానికి ఇంకేదో కారణం ఉండి ఉంటుంది. అది తెలిస్తే-' అంటూ మాటల్ని ఆపాడు.

'రోజుకు రెండుమార్లు హుహుశాన్ మనిషి ఒక తను స్టేషన్‌కి వచ్చి షాన్‌సూతో మాట్లాడి వెడుతూ ఉంటాడు. ఏం మాట్లాడతాడో మాకు తెలియదు' చెప్పింది ఆమె.

'తనకు కావల్సిన ఇన్ఫర్మేషన్ షాన్‌సూ దగ్గర ఉన్నదని అతను భావిస్తూ ఉండి ఉంటే, తనదగ్గరే ఉంచుకుని తనే స్వయంగా ఇంటరాగేషన్ మొదలు పెట్టి ఉండవచ్చు. బహిరంగంగా బయటికి తీసుకు వచ్చి మీకు అప్పగించవలసిన అవసరం లేదు' సాలోచనగా అన్నాడు పొట్టిమనిషి.

'బయటికి కనిపిస్తున్నంత సింపుల్ విషయం కాదు ఇది. ఏదో ఉంది. ఆ ఉన్నది ఏమిటో ఎవరికీ తెలియదు' అన్నది మిచిషీ.

'నికార్సయిన పోలీస్ మనిషి తను. మనం హుహుశాన్‌కి కావాల్సిన వాళ్ళమేనని గ్రహించిన తర్వాత కూడా మనకి సహాయం చేయటం దేనికో అది కూడా అడుగు' బాత్‌రూమ్‌లో నుంచి పొట్టిమనిషి మాదిరిగానే శుభ్రం చేసుకున్న తన దుస్తుల్ని బయటికి తీసుకుపోతూ అన్నాడు యువకుడు.

మరోసారి ఆ భాషను అర్థం చేసుకోవటానికి ప్రయత్నించి విఫలం అయింది మిచిషీ. అయితే ముఖ కవళికల్నిబట్టి భావాన్ని తేలికగానే పసిగట్టేసి చిరునవ్వు నవ్వింది.

'బాగుంది మిచిషీ. నీ నవ్వు బాగుంది' వత్తి వత్తి పలికింది యువకుడి నవ్వును మెచ్చుకున్న చిలుక.

కనులు చిట్లించాడు యువకుడు.

వెంటనే ఎలర్ట్ అయిపోయాడు పొట్టిమనిషి. 'నీకేమైనా ఆలోచన వచ్చిందా?' అడిగాడు.

'ముందు నా ప్రశ్నకు సమాధానం కావాలి' అన్నాడు అతను.

'హుహుశాన్ వట్టి చీడపురుగు. మా నగరంలోని సామాన్య ప్రజలకు అతను చేస్తున్నది ఏమీ లేదు, వారి రక్తాన్ని జలగలా పీల్చుకోవటం తప్ప. అధికారులందరినీ మచ్చిక చేసుకోవటంవల్ల వాడి ఆటలు అప్రతిహతంగా కొనసాగిపోతున్నాయి' అన్నది మిచిషీ.

ఆమె డ్రైవర్‌కి తెలివి రానప్పుడు అతని సిగరెట్ పాకెట్‌లో నుంచి తాను సంగ్రహించి జాగ్రత్తగా దాచి పెట్టుకున్న ఇంకో సిగరెట్‌ని తీసి వెలిగించుకున్నాడు యువకుడు.

'మమ్మల్ని వెంటాడటానికి బయలుదేరి మధ్యలోనే దెబ్బతిన్న విషయం మీ అధికారులకు నువ్వే తెలియచెప్పాలి. అది షాన్‌సూ బంధించబడి ఉన్న స్టేషన్ దగ్గరికిపోయి చేయాలి. చెయ్యగలవా?' అని అడిగాడు.

'అది ఏమంత పెద్దపని కాదు. కాని దానివల్ల ఉపయోగం ఏముంటుంది?' అడిగింది మిచిషీ అయోమయంగా.

చిటికె వేశాడు యువకుడు. వెంటనే వచ్చి అతని భుజాల మీద వాలాయి చిలుకలు.

'వీటిని వెంటబెట్టుకుపోవాలి. షాన్‌సూ దగ్గర వదిలి రెండు నిమిషాలు నువ్వు ఇవతలకి వచ్చేయాలి' అన్నాడు అతను.

నొసలు ముడిచి చూస్తున్న మిచిషీ పెదవుల మీద వెంటనే ప్రత్యక్షం అయింది ఒక అందమైన చిరునవ్వు.

'అమ్మా, నేను వెంటనే స్టేషన్‌కి పోవాల్సిన పని ఒకటి వచ్చింది. ఒక గంటలో వచ్చేస్తాను' అని తల్లికి చెపుతూ క్షణాలమీద తన యూనిఫామ్ ధరించి ఇంటి బయటికి కదిలింది.

'వెళ్ళండి. తనతో వెళ్ళి తాను చూపించిన మనిషితో మాట్లాడండి' చిలుకలకు చెప్పాడు యువకుడు. పెదవులు ముడిచి చిన్నగా శబ్దం చేశాడు.

'ఏమిటి నీ నేరం?' అన్నాడు.

వెంటనే ఆ మాటను రిపీట్ చేసింది ఒక చిలుక.

'నిర్భయంగా చెప్పు. నీకు పాపాయి పుట్టింది' అన్నాడు మళ్ళీ.

ఆ మాటల్ని తను అంది పుచ్చుకున్నది రెండవ చిలుక.

తలల్ని తడిమి వాటిని రెండింటినీ మిచిషీ వైపు ఎగురవేశాడు అతను.

***

'మిచిషీ కంటే ముందుగానే నగరంలోని అధికారులందరికీ తెలిసిపోయింది ఆమెకు ఎదురైన ప్రమాదం గురించి... ఇంటికిపోయి విశ్రాంతి తీసుకోవాల్సిన డ్రైవర్, ఆ పని చేయటం కంటే ముందుగా తనే స్వయంగా అందరికీ టాంటాం చేసేశాడు.

'ఎవరు మిచిషీ? నిన్ను, నీ డ్రైవర్‌ని కాపాడింది ఎవరు?' కుతూహలంగా అడిగారు వాళ్ళు ఆమెను చూసిన వెంటనే.

'మా తాతగారి దగ్గర పిట్టల్ని పెంచుతూ ఉంటారు. నాకు బహుమతిగా పంపించబడిన చిలుకలు

**చిటికె వేశాడు షాడో. వచ్చి అతని భుజాల మీద వాలాయి చిలుకలు రెండూ. వాటికి రెండే రెండు వాక్యాలు నేర్పాడు. గుర్తు పెట్టుకోమని మరీమరీ చెప్పాడు. వాటి తలలు నిమిరాడు. పెదవులు ముడిచి చిన్నగా శబ్దం చేశాడు. వెంటనే అవి గాల్లోకి ఎగిరాయి. షాడో చెప్పిన మనిషిని చేరుకున్నాయి. వాక్యాలు వల్లించేశాయి. అసలు షాడో వాటికేం నేర్పాడు? ఎవరి దగ్గరకు పంపించాడు?**

ఇవి' తన భుజాల మీద ఉన్న చిలుకల్ని చూపిస్తూ అప్పటికప్పుడు సందర్భానికి సరిపోయే కథను అల్లి, ఆ సంఘటనను సవివరంగా చెప్పింది ఆమె.

స్పృహలేని సమయంలో తమ వెంట వచ్చిన షాన్‌సూ భార్యను గురించి, ఆమెతో పాటున్న వృద్ధురాలి గురించి తెలియదు డ్రైవర్‌కి. అతనికి తెలివి వచ్చే సమయానికి వారిద్దరు పాపాయితో సహా లోపలి గదుల్లోకి వెళ్ళిపోయారు.

'ఓకే మిచిషీ... టేక్ సమ్ రెస్ట్.. బురద నేలకు అవతల ఏం జరిగిందో ఇంకా తెలియలేదు. తెలిసిన తర్వాత ఏం చేయాలో ఆలోచించుకుందాం. ఇప్పటికే బాగా లేట్ అయిపోయింది. వెళ్ళి విశ్రాంతి తీసుకో' అన్నాడు. మిచిషీ స్టేషన్‌కి వచ్చిందని తెలిసిన వెంటనే ఆదరాబాదరాగా తను కూడా వచ్చిన ఆమె పై అధికారి.

ఆ మాటల్లో అసత్యం అంటూ ఏమీలేదని మిచిషీకి తెలుసు. రాత్రంతా నడుస్తూనే ఉన్నారు తామందరూ. సూర్యోదయం అవుతున్న సమయంలో తన ఇంటికి చేరుకున్నారు.

నిద్ర పోకపోవడం వల్ల ఇసుకపడినట్టు గరగరమంటున్నాయి కళ్ళు. నీరసం ముంచుకు వచ్చేస్తోంది.

'ఒక్కసారి షాన్‌సూని చూసి వెంటనే వెళ్ళిపోతాను సార్' అంటూ ఆ అధికారికి చెప్పి అతను బంధింపబడి ఉన్న గదిలోకి ఎంటర్ అయింది ఆమె.

తన భార్యను గురించి అమితంగా కలవరపడుతున్నాడు కాబోలు – నిద్రపోవడం లేదతను. గదిలో ఒక గోడకు ఆనుకుని, చెమ్మగిల్లుతున్న కనులను తుడుచుకుంటున్నాడు.

'నీ భార్యను గురించి చెప్పు షాన్‌సూ. నీకు సాయం చేయటానికి ప్రయత్నించేవాళ్ళు ఎవరైనా ఉండి ఉంటే వాళ్ళని గురించి కూడా వెంటనే చెప్పు' గది ద్వారం దగ్గర నిలబడి ఉన్న కానిస్టేబుల్స్‌ని కనుచివరలనుంచి గమనించుకుంటూ హుందాగా అడిగింది మిచిషీ.

'నాకు బంధువులు ఎవరూ లేరు. నా భార్యకు ఉన్న ఒక వృద్ధురాలి గురించి మీకు ఎప్పుడో చెప్పేశాను. ఆమె కూడా దగ్గర్లో లేదు, దూరంలో ఉన్నది' నిరాశ నిండిన కంఠంతో చెప్పాడు షాన్‌సూ.

'వట్టొట్టి మాటలతో సమాధానాలు రావు మేడమ్. లాటీలకు పని కల్పిస్తే టకటక వచ్చేస్తయ్' తను అడగక పోయినా, వెంటనే ఒక సలహా ఇచ్చాడు గది వెలుపల నిలబడి ఉన్న కానిస్టేబుల్.

'నీకు అరగంట టైము ఇస్తున్నాను. నీ కారణంగా



నేను బురదలో చిక్కుకుని ప్రాణాలు వదిలే పరిస్థితికి గురి అయ్యాను. ఆలోచించుకో' కంఠంలో దారుణమైన కాఠిన్యాన్ని నింపుకుంటూ హెచ్చరించి, గది బయటికి వచ్చేసింది మిచిషీ.

'తలుపులు మూయండి. గొంతు ఎండుకుపోయినా సరే గుక్కెడు నీళ్ళుకూడా ఇవ్వకండి' అని చెప్పింది బయట ఉన్న ఇద్దరికీ.

అంతకుముందు ఎన్నడూ ఆమె నోటివెంట అటువంటి కఠినమైన మాటలు విని ఉండకపోవటం వల్ల, ఆశ్చర్యంగా చూస్తూ గది తలుపులు మూసి, ఆమెతో పాటు అవతలి గదిలోకి పోయారు వారిద్దరూ.

***

ఉబికి వచ్చేశాయి షాన్‌సూ కళ్ళల్లోకి నీళ్ళు. ధారగా బుగ్గల మీదికి జారటం మొదలు పెట్టాయి.

అప్పటికి చాలాసార్లు వచ్చి అతనితో మాట్లాడింది మిచిషీ. వచ్చిన ప్రతిసారి, తినటానికి ఏదో ఒకటి ఇప్పించేది, మంచినీళ్ళు అందించేది. తన గుండెల్ని పిండేస్తున్న నిరాశ నిస్పృహలు మటుమాయం అయిపోతూ ఉండేవి ఆమెను చూసిన వెంటనే.

'ఇప్పుడేమిటి ఇలా బ్రహ్మరాక్షసి మాదిరి తెగబడిపోతున్నది? తాను కొత్తగా ఏదయినా తప్పు చేయటం జరిగిందా? హుహుశాన్ దగ్గర్నించి నూతనంగా ఏవైనా ఆజ్ఞలు వచ్చివుంటాయా?' సమాధానం లభించని ఆ ప్రశ్నలు అదేపనిగా వేధించడం మొదలు పెట్టాయి అతని అంతరంగాన్ని.

'బాగున్నావా షాన్‌సూ?' ఉన్నట్లుండి వినిపించింది ఆ ప్రశ్న.

అదిరిపడి తల తిప్పిన అతని కనులకు కనిపించాయి, ఆ గదిలో ఒక మూలగా ఉన్న చెక్కబల్ల మీద వాలి ఉన్న రెండు చిలుకలు.

'మీరు.. మీరు ఎలావచ్చారు? ఎక్కడినుంచి వచ్చారు?' అమితమైన ఆశ్చర్యంతో అడిగాడు – ఒక్క క్షణం పాటు తన నైర్యాశ్యాన్ని మర్చిపోయి. ఆలస్యం చేయలేదు ఆ చిలుకలు.

'ఏమిటీ నీ నేరం?' సూటిగా అడిగేసింది ఒకటి.

అంతకుముందే తడి అయి ఉన్నాయి షాన్‌సూ బుగ్గలు. ఇప్పుడు మరింతగా తడిసిపోయాయి, ఆగకుండా వస్తున్న కన్నీటితో.

'నిర్భయంగా చెప్పు. నీకు పాపాయి పుట్టింది' అన్నది రెండవ చిలుక.

నిలబడి ఉండటం అసాధ్యమై పోతున్నట్టు మోకాళ్ళ మీద కిందికి కూలిపోయి, చేతుల్లో ముఖాన్ని దాచుకున్నాడు అతను.

'నిర్భయంగా చెప్పు. నీకు పాపాయి పుట్టింది' రిపీట్ చేసింది రెండవ చిలుక.

'కునీ ద్వీపం... రెండో కంటివాడికి తెలియకుండా హుహుశాన్ చాలా పెద్దతప్పు చేస్తున్నాడు. నేను అడ్డుకున్నాను' తడబడుతున్న కంఠంతో చెప్పాడు షాన్‌సూ.

ఒకదాని వంక ఒకటి చూసుకున్నాయి అవి. తలల్ని పక్కకు వంచి, అతనివంక ఓరగా చూశాయి.

పూర్తిగా కాకపోయినా కొంచెంగా అర్థం అయింది అతనికి తను చేసిన తప్పు. 'కునీ ద్వీపం... గుర్తు పెట్టుకోండి.. కునీ ద్వీపం' ఒకటికి రెండుసార్లు వాటికి చెప్పాడు.

ఆ తర్వాతి మాటల్ని కూడా చిన్నచిన్న పదాలతో వాటి నోటికి అందుబాటులో ఉండే విధంగా చెప్పే వాడే.. సడన్‌గా అలికిడి అయింది ఆ గది తలుపుల దగ్గర.

'మర్చిపోయాను. నాతో పాటు మా తాత నాకు బహుమతిగా ఇచ్చిన చిలుకలు లోపల ఉండిపోయాయి. తలుపులు తెరవండి' అస్పష్టంగా వినవచ్చింది మిచిషీ కంఠం.

వెంటనే వినవచ్చింది తలుపులకు వేసిన తాళం తీయబడుతున్న శబ్దం. గుబగుబలాడుతున్న గుండెల్ని చిక్కబట్టుకుంటూ తను చెప్పదలుచుకున్న మాటల్ని ఉచ్చరించబోయాడు షాన్‌సూ.

తెరుచుకున్నాయి తలుపులు. 'రండి వచ్చేయండి... హుహుశాన్ సారు దగ్గర్నించి ఆయన అనుచరుడు వచ్చాడు. మనం ఇక్కడ ఉండకూడదు' ద్వారంలో నిలబడి మృదువుగా చెప్పింది మిచిషీ.

రెక్కల్ని వేగంగా కదిలించి, గాలిలోకి ఎగిరాయి చిలుకలు. ఆమె భుజాలమీద వాలి, ఓరగా చూశాయి షాన్‌సూ వైపు.

చేతులు కట్టుకుని వినయంగా తలవంచి నమస్కరించాడు అతను. 'సమయం చాలలేదు. సగం సగమే చెప్పటం జరిగింది' చిన్నకంఠంతో తనలో తను గొణుక్కున్నాడు.

ఆ మాటలు తనకు వినపడనట్టు గిరుక్కున వెనుతిరిగి వెళ్ళిపోయింది మిచిషీ. ఆమె వెనుకే గది ముందు ప్రత్యక్షం అయ్యాడు హుహుశాన్ పంపించిన దృఢకాయుడు.

అతను గదిలో అడుగుపెట్టిన వెంటనే, తలుపుల్ని మూసి అవతలి గదిలోకి వెళ్ళిపోయారు అక్కడ కాపలా డ్యూటీ చేస్తున్న కానిస్టేబుల్స్.

తన నడుము దగ్గర దుస్తుల్లో దాచి ఉంచిన పొడుగాటి వెదురుచువ్వను బయటికి తీసి, బలంగా షాన్‌సూ భుజాల మీద మోదాడు ఆ దృఢకాయుడు. 'చెప్పు షాన్‌సూ... ఒక్కమాట కూడా దాచుకోకుండా మొత్తం చెప్పు' పళ్ళు బిగించి, అతని ముఖంలో ముఖం పెడుతూ వికృతంగా అడిగాడు.

వెదురుచువ్వ దెబ్బకు నరాలు మెలికపడిపోయినట్టు గిలగిలలాడుతూ నేలమీద చతికిల పడిపోయాడు షాన్‌సూ.

***

కళ్ళుకూడా పూర్తిగా తెరచి చూడటం చేతకాని పాపాయి బుగ్గల్ని నిమిరి సున్నితంగా ముద్దు పెట్టుకున్నది మిచిషీ.

## ఇబ్బంది పెడుతున్న పచ్చబొట్టు



*పచ్చబొట్టు వేయించుకోవడం ఇష్టంతో కాకుండా ఫ్యాషన్‌గా మారిపోయింది. చాలామంది తారలు శరీరం మీద రకరకాల పచ్చబొట్లు వేయించుకుంటూ ఉంటారు. లోకనాయకుడు తనయ శ్రుతి హాసన్ కూడా శరీరం మీద ఐదారు పచ్చబొట్లు వేయించుకుంది. చేతి మణికట్టు మీదున్న పచ్చబొట్టు ఇపుడు ఇబ్బందిగా మారింది అంటోంది శ్రుతి. షూటింగ్ సమయంలో అది కనపడకుండా ఉండేందుకు కొన్ని సార్లు హెవీ మేకప్ వేసుకోవలసి వస్తోందట! శ్రుతి బాధ చూస్తుంటే 'అడుసు తొక్కనేల....కాలు కడగనేల' అన్న సామెత గుర్తుకు వస్తోంది అంటున్నారు సినీ జనాలు.*

## నారాయణదాసుకు ఎవరు స్ఫూర్తి?

*నేటి మన హరికథలకు ప్రేరణ కుప్పుస్వామి మొదలియార్. ఆయన తమిళ హరికథకుడు. కుప్పుస్వామి ఒకసారి విజయనగరంలో హరికథలు చెప్పారు. ఆ హరికథలు విన్న ఆదిభట్ల నారాయణ దాసుగారు, అన్ని కళలలో హరికథ ఎంతో గొప్పదని భావించి, ధ్రువచరిత్రను హరికథగా రూపొందించారు. ఈ ధ్రువచరిత్ర నేటి హరికథలకు ధృవతార అని 'నాట్యకళ' గ్రంథంలో శ్రీ శ్రీనివాస చక్రవర్తి పేర్కొన్నారు.*



*అంతటి దాసుగారిని–*

*'హరికథా పితామహుడు ఆదిభట్లదాసు*

*'సంగీతం–సాహిత్యం సరితూచిన త్రాసు' అని శ్రీశ్రీ ప్రశంసించారు.*

**–సేకరణ : ఎన్.తారకరామారావు**

'నీ భర్త ప్రస్తుతానికి బాగానే ఉన్నాడు కాబట్టి నువ్వు బెంబేలు పడాల్సిన అవసరం లేదు.' షాన్‌సూ భార్యకు చెప్పి, ముందు గదిలోకి వచ్చింది.

'ఇప్పుడు చెప్పండి. మీరు తెలుసుకువచ్చిన విశేషాలు ఏమిటి?' అప్పటివరకూ మౌనంగా ఉన్న యువకుడు – అప్పుడు అడిగాడు ఒకకుర్చీ మీద కూర్చుని ఉన్న చిలుకల్ని.

'కునీ ద్వీపం... కునీ ద్వీపం' తడుముకోకుండా చెప్పింది ఒకటి. రెండవ దానివైపు చూసింది మిచిషీ.

'హుహుశాన్ తప్పు చేస్తున్నాడు. హుహుశాన్' అన్నది రెండవది.

'చెప్పేది సరిగ్గా చెప్పు. ఎటువంటి తప్పు? ఎక్కడ? కునీ ద్వీపంలోనా?' అడిగింది మిచిషీ.

'హుహుశాన్.... హుహుశాన్...' అన్నది అది మరోసారి.

'అదికాదే పిచ్చిమొఖమా... ఆ ద్వీపంలో ఏం జరుగుతోంది? షాన్‌సూ ఏమని చెప్పాడు?' రెట్టించబోయిన మిచిషీని ఆపేశాడు యువకుడు.

'దాని చిన్న మెదడుకు అర్థం అయ్యేవిధంగా చిన్న




చిన్న వాక్యాలు చెప్పాలి. షాన్‌సూ కంగారుపడి గడగడా మాట్లాడి ఉంటాడు. ఆ మాటలు దాని మెదడులో ఇంప్లాంట్ కాలేదు' అన్నాడు.

ఉన్నట్టుండి ఎడమచేత్తో తన నుదుటిమీద టపటపా చరుచుకున్నది మిచిషీ. 'నాదే తప్పు. హుహుశాన్ దగ్గర్నించి ఒక మనిషి వచ్చాడు. అతనికి నేను చిలుకల్ని ఆ గదిలో వదిలిన సంగతి తెలియకుండా ఉండేందుకు అర్థాంతరంగా పోయి తలుపులు తీయించాను' అన్నది.

'ఓ.కే.. మరేం పరవాలేదు. ఇప్పుడు మనకి ఒక మాట తెలిసింది. కునీ ద్వీపం ఎక్కడ ఉంటుంది?' అడిగాడు యువకుడు.

ముందు గదిలోనే ఉన్న అలమరాలో నుంచి పెద్ద మ్యాప్‌ని బయటికి తీసి నేలమీద పరిచింది మిచిషీ.

తమ నగరానికి ఆరువందల మైళ్ళ దూరంలో సముద్రంలో ఉన్న కొన్ని చిన్నచిన్న ద్వీపాల్ని అతనికి చూపించింది.

'రాళ్ళురప్పలు, విషపు పురుగులు తప్ప మానవులు నివసించటానికి పనికిరాని ప్రదేశాలు ఇవి' అంటూ ఆ ద్వీపాల మధ్యలో ఉన్న ఒక ఎర్రటి గుర్తును చూపుడు వేలితో స్పృశించింది.

'పాడుబడిన కోట ఒకటి ఉంటుందిట ఈ ద్వీపంలో. మింగ్ చక్రవర్తుల కాలంలో సముద్రం మీద తిరిగే యుద్ధ నౌకలకు కేంద్ర బిందువుట. దాని పేరే కునీ ఐలండ్' అని చెప్పింది.

'ఈ గొడవ అంతా దేనికి గురూ? ఇంకోసారి ఆ స్టేషన్‌కివెళ్ళి ఆ షాన్‌సూతో మాట్లాడితే బాగుంటుంది కదా' ఉన్నట్టుండి తన అభిప్రాయాన్ని వెల్లడించాడు పొట్టిమనిషి.

'నిమిషానికి ఒకసారి అక్కడికి పోవటమంటే, సరాసరి హుహుశాన్ ఎదుటికి పోవటం లాంటిదే. నేను ఇవతలకు వచ్చిన మరుక్షణం వెళ్ళిపోతుంది ఆ మాట అతని దగ్గరికి' తడుముకోకుండా చెప్పింది మిచిషీ.

మనం వెళ్ళి మాట్లాడటానికి వీలుపడదు. ఈ అమ్మడు వెళ్ళటానికి కూడా కొన్ని పరిమితులున్నాయ్. ఆలోచించి చూస్తుంటే నాకు ఒకటి అనిపిస్తోంది' నెమ్మదిగా చెప్పాడు పొట్టిమనిషి.

'ఏమిటి అది?' అడిగాడు అతని జతగాడు.

'షాన్‌సూ భార్యను కాపాడాము. పాపాయిని క్షేమంగా జనవాసంలోకి తీసుకు వచ్చాము. వాళ్ళ జీవితాలు పూర్తిగా గడిచిపోవటానికి అవసరం అయ్యే సంపదను తవ్వి బయటికి తీశాము. మన జోక్యం ఇంక అనవసరం. మన దారి ఏదో మనం చూసుకోవటం చాలా బాగుంటుంది' అన్నాడు పొట్టిమనిషి.

'సంపద సంపద అంటూ అదేపనిగా గగ్గోలు పెడుతున్నావు. ఆ సంపదను ఇప్పుడు ఉపయోగపడే విధంగా కాష్ చేయాలి. అది చేయనంతకాలం చూసి మురుసుకోవటానికి తప్ప మరెందుకూ ఉపయోగపడదు అది' అన్నాడు యువకుడు.

'అది ఒక పెద్ద పనేమీ కాదు. సాయంత్రం ఒకసారి అలా అలా పెద్ద బజార్లోకి పోయి–' అని మొదలుపెట్టి అర్థాంతరంగా మాటల్ని ఆపేశాడు పొట్టిమనిషి.

అపురూపమైన వస్తువులు తమకు దొరికినవి. వాటిని చూసిన వారి కళ్ళు జిగేల్మంటాయి. ఎక్కడివని అడుగుతారు. ఏదో ఒక సమాధానం చెపితే అక్కడితో ఆగరు. పెద్దబజార్లో వాటిని అమ్మకానికి పెట్టిన మరునిమిషంలో అలా పోయి ఇలా పోయి హుహుశాన్ చెవులదాకా చేరిపోతుంది. మంది మార్పులంతో తనే స్వయంగా బయలుదేరి వచ్చేస్తాడు అతను.

'ఈ మధ్యన నాకు తొందరపాటు చాలా ఎక్కువ అయిపోతోంది. ఏం చేద్దాం గురూ?' తన పొరపాటును తనే గుర్తించి చిన్నముఖం చేసుకుంటూ అడిగాడు అతను.

'ఎటుచూసినా ఈ హుహుశాన్ ఒక్కడే ప్రతిపనిలోను జోక్యం చేసుకునే మనిషి మాదిరిగా కనిపిస్తున్నాడు' అన్నాడు అతని జతగాడు.

'ఇట్లాంటి కోన్‌కిస్కాగాళ్ళని మనం చాలామందిని చూసి ఉన్నాం. గట్టిగా గాలి ఊదితే ఎండుటాకు మాదిరి ఎగురుకుంటూ వెళ్ళిపోతాడు. మరి మన బాబాయ్ సంగతి ఏమని ఆలోచించావు?' అడిగాడు పొట్టిమనిషి.

బాబాయి ఎవరో విడమర్చి చెప్పవలసిన అవసరం లేకపోయింది, అప్పటివరకూ ఎంతో ప్లెజెంట్‌గా ఉన్న యువకుడి ముఖం. కొంచెం కోపంతో ఎర్రబడింది.

'వద్దని చెప్పాను. మనకంటే తనే గొప్పవాడని త్రికరణశుద్ధిగా అంగీకరించి తల వంచుకున్నాను. అయినా వదిలిపెట్టటం లేదు. అసహ్యకరంగా మాట్లాడటం మానుకోవటం లేదు. ఎదుటపడి అటోఇటో తేల్చుకోవటమే మంచిదని అనిపిస్తోంది' అన్నాడు.

'నువ్వు ఆ నిర్ణయానికి వచ్చినతర్వాత ఇక ఆలస్యం చేయటం దేనికి? హుహుశాన్ సంగతి తర్వాత చూద్దాం, ముందు బాబాయ్ వ్యవహారం తేల్చిపారేద్దాం' అంటూ లేచి నిలుచున్నాడు పొట్టిమనిషి.

'పది సంవత్సరాలు పడుతుంది' ఉన్నట్లుండి మాట్లాడింది అప్పటివరకూ మౌనంగా ఉన్న చిలుకల్లో ఒకటి.

ఉలిక్కిపడి దానికేసి చూశాడు పొట్టిమనిషి.

'నోటి మీద దెబ్బ నుంచి కాచుకోవాలంటే నువ్వు ఇంకో పది సంవత్సరాల పాటు సాధన చెయ్యాలి' ఆగి ఆగి చాలా పెద్దవాక్యాన్ని చెప్పింది అది.

అయోమయంగా తన జతగాడి వైపు చూశాడు పొట్టిమనిషి.

'మనం మాట్లాడుకుంటున్న మాటలు దానికి అర్థం కావటం జరగదుకాని అర్థం అయినట్టు మాట్లాడుతోంది. ఏమిటీ విచిత్రం?' అన్నాడు.

'ఫ్యుజీశాన్.... ఫ్యుజీశాన్' రెక్కల్ని టపటపలాడిస్తూ పలికింది రెండవ పక్షి.

మౌనంగా కూర్చుని ఉన్న మిచిషీ ముఖం నవ్వులమయమైపోయింది.

'ఇవి మా తాత దగ్గర ఉండగా అక్కడ ఏదో జరిగింది. బహుశా మా తాత ఫ్యుజీశాన్‌తో చెప్పిన మాటలై ఉంటాయి అవి..' తన చిలుకల్ని ముద్దు చేస్తూ చెప్పింది.

'నిజమే గంగూ... ఫ్యుజీశాన్‌ని ఎదిరించటానికి ఇప్పుడు నాకున్న శక్తి చాలదు. ఇంకో పది సంవత్సరాల పాటు సాధన చేయాలి' సాలోచనగా అన్నాడు పొట్టిమనిషి జతగాడు.

'అన్నిమాటలు నువ్వే మాట్లాడితే ఎలా గురూ?' చిరుకోపంతో అతన్ని వెక్కిరించాడు పొట్టిమనిషి.

**(ఇంకా వుంది)**

# మహావాస్తు

## 'విశ్వం నిండా గోచరించేవి ఏమిటి?
## దీనికి వాస్తుకు ఉన్న సంబంధం ఏమిటి?'
## పంచభూతములు, పంచేంద్రియములు అంటే ఏమిటి?

వాస్తు విద్వాన్, సాయిశ్రీ
గౌ. డా. దంతూరి పండరీనాథ్



విశ్వం నిండా గోచరం అయ్యేది రెండే! ఒకటి 'పదార్థం' (Matter)/ రెండవది 'పదార్థం కానిది' (Non-Matter). భౌతిక శాస్త్రవేత్తల నిర్వచనం ప్రకారం కొన్ని ధర్మాలు కలిగివుండి, కొంత స్థలాన్ని ఆక్రమించి, ఒక ఆకారం కలిగి ఉన్నది పదార్థం. పదార్థం నుండి వస్తువు రూపొందించబడుతుంది. పదార్థమే వస్తువు అనుకోవచ్చు. శాస్త్రజ్ఞుల నిర్వచనం ప్రకారం రెండింటికీ పెద్దగా తేడా లేదు. విశ్వంలో ఉన్న పదార్థమంతా వస్తువుల సముదాయమే! **వస్తుసముదాయ క్రమాన్ని నిర్దేశించేది 'వాస్తు'**. అనంత విశ్వవ్యాప్తమైన గ్రహ, శకల, వాయు, మేఘ, నక్షత్ర సముదాయమంతా వ(వా)స్తు క్రమమే! అటువంటి **'విశ్వవాస్తు'**లో మన వసుధ ఒక అణువంత! ఇక మనమెంత!!



ఆకాశంలో మేఘాలు ఢీకొన్నప్పుడు గర్జనలతో ఉలిక్కిపడే ఒక్క మెరుపు కూడా త్రుటి కాలం భూమిపై పూర్తిగా పరచుకొని తన ప్రభావాన్ని చూపిస్తుంది. ఘనీభవించిన కాంతి ఒక **'సూర్యుడు'**. పేలిపోయిన సూర్యుని ఒక శకలమే **'భూమి'**. ఆ భూమి **'పంచభూత'** సమన్వితం. భూమిపై పుట్టిన మనం కాంతి పరావర్తనదారులం! పంచభూతాల సమన్వయానికి ప్రతినిధులం!!

**'సంపూర్ణ సంతృప్తి చెందిన పటిక ద్రవం'**లో ఒక పటిక ముక్కను వ్రేలాడదీస్తే ద్రవంలోని పటిక అంతా తిరిగి వచ్చి పటికను పట్టుకుంటుంది. అలాగే పంచభూతాలతో ఏర్పడిన మన మీద, పంచభూతాల ప్రభావం అత్యంత ప్రతిభావంతంగా ఉంటుంది. అది తెలుసుకుని **'ఆ ప్రభావాన్ని తగుపాళ్లలో ఉపయోగించుకుని సత్ఫలితాలు పొందటం'** మానవ కల్యాణానికి నాందీ ప్రస్తావన కావాలి. ఏదేమైనా... పంచభూతాల ధర్మాలను, గుణాలను తెలుసుకుని, నిజ జీవితానికి అన్వయించుకొని, సత్ఫలితాలను పొందటానికి గాను అనాదిగా మనిషి తన మేధస్సును అత్యంత శ్లాఘనీయంగా వాడుకుంటున్నాడు. ఆ వివరాలను తెలిపే శాస్త్రమే వాస్తుశాస్త్రంగా ప్రసిద్ధి చెందినది.

**పంచభూతములు ఐదు:** 1. ఆకాశం 2. వాయువు 3. అగ్ని 4. జలము 5. భూమి

**పంచేంద్రియములు ఐదు:** 1. కర్ణము(చెవి) 2. చర్మము(తోలు) 3. చక్షువు (కన్ను) 4. జిహ్వ (నాలుక) 5. నాసిక(ముక్కు)

ఈ భూమిపై జన్మించిన మనం ఏ అనుభూతినైనా సరే.. పంచభూతముల మరియు పంచేంద్రియముల సంపర్కము ద్వారానే గ్రహింపగలుగుతున్నాము. పంచభూతముల ధర్మాలను, గుణాలను, ఉద్భవ, ఉత్పత్తులను అధ్యయనం చేసి, వైద్య యోగ్యంగా అన్వయించుకున్న శాస్త్రం **'వైద్యశాస్త్రం'** (Medical Sciences) అయింది. యంత్రయోగ్యంగా అన్వయించుకున్న శాస్త్రం యంత్రశాస్త్రం (Mechanical Engineering) అయింది. పంచభూతాలను **'నిర్మాణ'** పరంగా అన్వయించుకున్న శాస్త్రం **'వాస్తుశాస్త్రం'** (Civil Engineering)అయింది. ఈ విధంగా పంచభూతములపాత్ర లేని ఏ శాస్త్రమును కూడా మనం ఊహించు కోలేము.

**వచ్చేవారం... 'పంచభూతములకు, పంచేంద్రియాలకు ఉన్న సంబంధం?'**

## తిరిగి అమ్మేయమంటారా?

- **పటములో చూపెట్టినట్టున్న స్థలము (ప్లాటు) కొనవచ్చునా? మేము ఈ స్థలాన్ని ఈ మధ్యనే కొన్నాము. అప్పటి నుంచి మాకేమి చెడు ఫలితాలు కలుగలేదు. కాని 'వీధిపోటు ఉన్న స్థలము కొనగూడదని, చెడు జరుగుతుందనీ' కొందరు అంటున్నారు. తిరిగి అమ్మేయమంటారా? తూర్పు పల్లం ఉన్న స్థలం ఉంది.**

  **-జగదీశ్వర్ గౌడ్,** కోదడా.




✔ మీరు పేర్కొన్న స్థలానికి పశ్చిమ వాయ్వ్యము నుండి వీధి తగులుతుంది. వీధిపోటున్న స్థలాలు చెడు ఫలితాలిస్తాన్నమాట వాస్తవమే! అయితే అన్ని వీధిపోట్లు చెడుఫలితాలనివ్వవు. మంచి ఫలితాలనిచ్చేవి కూడా ఉంటాయి. చెడు ఫలితాలనిచ్చే వాటిని **'వీధిపోట్లు'** అని, మంచి ఫలితాలనిచ్చేవాటిని **'వీధిచూపులు'** లని వాస్తు శాస్త్రంలో వివరణ ఉంది. మీరు కొన్న స్థలానికి **'పశ్చిమ వాయువ్య'** భాగాంలో వీధి తగులుతుంది. ఇది **'పశ్చిమ వాయువ్య వీధి చూపు'**. నాలుగు రోడ్ల కూడలిలో ఇటువంటి వీధిచూపు చెడుఫలితాలనివ్వదు. అనుకూల ఫలితాలనిస్తుంది. మీరు అక్కడ వాస్తు ప్రకారం గృహనిర్మాణం గావించుకొని నిశ్చితంగా నివసించవచ్చును.

**వచ్చేవారం... 'ఇంట్లో ఈ వాస్తు దోషాలు ఉంటే కలహాలే..!'**



వాస్తువిద్వాన్ **డా॥ దంతూరి పండరినాథ్** పాఠకుల జాతక మరియు వాస్తు సమస్యలకు 'మహావాస్తు'లో సమాధానాలిస్తారు. ఈ కింది కూపన్ జతచేసి సమస్యలు పంపవలసినది.

పూర్తి పేరు:..............................................................
పుట్టిన తేది:.............................. ఊరు:..............................
జన్మనక్షత్రం:.............................. తల్లి పేరు:..............................
చిరునామా:..............................................................
..............................................................ఫోన్:..............................

మా చిరునామా : **వాస్తుసాయి సేవా ఆశ్రమం**
**మహావాస్తు, 3-2-4, కింగ్స్‌వే, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్ - 500003.**




**"అయ్యా, మహారాజా!" – అన్నాడు తెనాలి రామలింగయ్య.**

**"చెప్పండి మహాశయా" – అన్నాడు శ్రీకృష్ణదేవరాయలుగారు.**

**భువనవిజయసభ మాంచి రక్తిగా నడుస్తోంది. మధ్యలో ఈ రామలింగయ్య, పద్యంలో యతిభంగం లాగ ఏమిటీ ప్రస్తావన? – అనుకున్నారు మిగిలిన దిగ్గజాలు.**

# ఇరకాటంలో పెట్టే పొరపాట్లు

"చిత్తం ఇది గమనించారూ! సాధారణంగా అందరం తప్పులు చేస్తుంటాం. దిద్దూనూకుంటాం. అయితే ఈ దిద్దుకోవడం జాగ్రత్తగా చెయ్యాలి. తడబడితే అవమానమే...." అని పొడిగించాడు వికట కవి.

రాయలు చిరునవ్వు నవ్వి "అదెలాగో!" అంటూ కళ్లెగరేశాడు.

"అయ్యా విషయం గుర్తుకొచ్చి చెప్పానంతే. సందర్భం వచ్చినప్పుడు నిరూపిస్తాను కద!" అంటూ మనవిచేసి, ఇతర దిగ్గజాలవైపు చూస్తూ ఒక కొంటె నవ్వు నవ్వాడు.

వీడు ఎవరి కొంపతీస్తాడో! అని వాళ్ళ ప్రాణాలు ఠావులు తప్పాయి.

సరే, సర్దుకుని సభా సాహిత్య సందర్భం కొన సాగించి ముగించారు.

దేవరాయలవారికి ఆ రామలింగయ్య మాట ములికిలాగ మనస్సులో మిగిలిపోయింది.



కొంతకాలం గడిచింది. రాచకార్యాల సందడిలో ఆయనకాసంగతి మరుపు తగిలింది కూడా.

ఒకనాడు బాగా సూర్యాస్తమయం అయ్యాక యథాలాపంగా రామలింగయ్య, దేవరాయలు గారు, అంతఃపురం తోటలో పచార్లు చేసుకుంటూ కొంత సాహిత్యం, కొంత లోక వ్యవహారాలు మాట్లాడుకుంటున్నారు. ఉండిఉండి హఠాత్తుగా రామలింగయ్య దేవరాయలవారి వెనక నుంచి ఒక తాపు తన్నేడు.

దేవరాయలవారికది మెరుపుదెబ్బ. కోపం నషాళానికంటింది.

"అరే! ఏమి రామలింగయ్యా ఇది?" అని గుడ్లెర్ర జేశారు.

రామలింగయ్య చేతులు జోడించి, "క్షమించాలి మహారాజా! రాణీగారనుకున్నాను" అని తడబాటుగా అనేశాడు. కొంప ములిగిపోయేదే!

రామలింగయ్య చనువుగా చిరునవ్వు విసిరి, "పొరపాటు దిద్దుకునే తరుణంలో తడబాట్లు ఇలాగే ఉంటాయి మహారాజా!" అన్నాడు.

ఎట్టబడిన రాయలవారి కళ్ళు చల్లబడ్డాయి. రసిక కవి శేఖరుడాయె! ఆయన పకపక నవ్వేసి, "క్షమించాను పోవయ్యా" అనేశాడు.

– ఈ సంఘటన ఇలాగే జరిగిందా? లేదా? అనేదికాదు ప్రశ్న–

రామలింగయ్య లేవనెత్తిన 'పాయింటు' ముఖ్యం.

అచ్చం ఇలాగే కాకపోయినా, మనం ఎప్పుడో ఒకప్పుడు చేసే పొరపాట్లు మనల్ని ఇరకాటంలో పెట్టేస్తుంటాయి.

ఇండో ఆంగ్లికన్ రచయితల్లో ప్రసిద్ధుడైన ఆర్.కె.నారాయణ్‌గారికి ఇంగ్లండులో పేరుపొందిన "లీడ్స్ యూనివర్సిటీ" గౌరవపూర్వకంగా "డాక్టర్ ఆఫ్ లెటర్స్" పట్టానిచ్చింది. ఆ సభ వైభ వంగా జరిగింది. ఆ రాత్రి ముఖ్యులందరికీ యూనివర్సిటీ ఒక విందు ఏర్పాటుచేసింది. పెద్దలూ, అధికారులూ, ప్రొఫెసర్లూ వచ్చారు. విందులో ఆర్.కె.నారాయణ్ గారి పక్కన కూర్చున్న ఒక ప్రొఫెసరు చాలాసేపు గంభీరంగా ఉండి, నారాయణ్‌గారివైపు ప్రశంసా పూర్వకంగా ఒక చిరునవ్వు ప్రసరిస్తూ, "మీ రచనలేవైనా ఇంగ్లీషులోకి అనువాదమయ్యాయా?" అని అడిగాడు. నారాయణ్‌గారు ముందు కొంచెం తెల్లబోయినా తేరుకుని, హాస్యప్రియుడు కూడా కనుక–

"ఐ రైట్ ఓన్లీ ఇన్ ఇంగ్లిష్" అనేశారు.

ప్రొఫెసర్‌గారికి ఏం అనాలో తోచలేదు. కాస్త సర్దుకుని, "ఓ!.....నాకు ఫ్లైట్ టైమవుతోంది వస్తా.." అని నిష్క్రమించాడు.



ఇంకొక సందర్భం– నవ్యసాహిత్యపరిషత్తు సమావేశాలు ఆంధ్రదేశంలో ముమ్మరంగా జరిగే రోజులనాటి మాట! భావకవి మూర్ధన్యులు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారంటే సినిమాస్టార్లకుండే ఆకర్షణలాంటి ఆకర్షణ ఉండేది. అభిమానులు, సాహిత్యవేత్తలు, ఆయనను కలుసుకోవాలని ముచ్చటపడుతుండేవారు. ఒకసారి నవ్యసాహిత్యపరిషత్ సభ కోసం ఒక ఊరువచ్చి, బసలో వారు ఒక్కరే ఉన్నారని తెలిసి ఒక తెలుగుపండితకవి ఆయన్ని కలిసి ప్రశంసల్లో ముంచెత్తారు– ఏమని?–

"అయ్యా, తమరు కవిసార్వభౌములు. భారత,

భాగవత, రామాయణాలను ఒక్కచేతి మీదుగా తెలుగు చేశారంటే, సామాన్య విషయమా! నేనెంతోకాలంగా కృష్ణమూర్తిశాస్త్రులు గారిని చూడాలనుకుంటున్న కల నేటికి నెరవేరింది" అంటూ పాదాభివందనం చెయ్యబోయాడు. కృష్ణశాస్త్రి గారు ఎంతటికవో, అంతటి చమత్కారి. "చాలా సంతోషం. కవిసార్వ భౌములు శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారు రాజమండ్రిలో ఉంటారు. నేను వట్టి దేవులపల్లి కృష్ణశాస్త్రిని...." అంటూ ఆ పండితకవి భుజం తట్టారు.

ఆ అభిమానికి గుక్కతిరగలేదు. ఏమనాలో తోచలేదు. తేరుకుని, "తమరుమాత్రం!!....." అంటూ వేగంగా నిష్క్రమించాడు. తెలుగుకథా, నవలా రచయితల్లో 'చలం'గా ప్రసిద్ధిపొందిన గుడిపాటి వెంకటచలంగారు కొద్ది రోజులు కృష్ణాజిల్లా నూజివీడులో టీచరు ఉద్యోగం చేశారు. ఒకరోజున ఆయన బజారులో నడిచిపోతుంటే ఒక మధ్య వయస్కుడు ఎదురువచ్చి నమస్కరించి, "అయ్యా, నేను తమ వీరాభిమానిని. మీ నవలలంటే నాకు వల్లమాలిన ఇష్టం. నేను పాండురంగ సినిమా థియేటర్‌లో హిందీసినిమాల ట్రాన్స్‌లేటర్‌ని. ఇప్పుడు నాతో ఒక్కసారి మా ఇంటికి రావాలి. కాఫీ తాగి వెడుదురుగాని" అంటూ ఎంతో ప్రేమగా ఆహ్వానించాడు. చలంగారు కాదన లేక, అతనివెంట వెళ్లారు. కాఫీ తాగారు. కబుర్లధోరణిలో ఆ అభిమాని, "ఆంధ్రదేశంలో కొవ్వలి లక్ష్మీనరసింహారావుగారి నవలల్ని ఇష్టపడని వారెవరు చెప్పండి" అని తన అంతరంగాన్ని వెల్లడించాడు. చలంగారు గతుక్కు మన్నారు. చిరునవ్వు నవ్వేసి, 'నేను చలాన్ని, మీ అభిమాన రచయిత కొవ్వలి లక్ష్మీనరసింహారావును కాను" అని మెల్లగా బయటికి జారుకున్నారు.

రచయితల సంగతి వదిలెయ్యండి. ఇంకొక ముచ్చట చెపుతాను. ఆంధ్రుల అభిమాననటుడు అక్కినేని నాగేశ్వరరావుగారి గురించి ఒకసంగతి విన్నాను. ఆయన ఒక సందర్భంలో గుంటూరులో ఏదో సభలో పాల్గొనడానికి వెళ్లారు. అనుకోకుండా చిన్నపాటి సుస్తీ చేసింది. గుంటూరులో గొప్పవైద్యు లుగా అత్యంత ప్రశస్తిపొందిన వ్యక్తి దగ్గరకు ఒక మిత్రుడు తీసుకువెళ్లాడు. ఆ డాక్టరు, క్షణం తీరిక దొరకక నిరంతరాయంగా తన వృత్తిలోనే గడిపే వ్యక్తి. సినిమాలు, ఇతర సాంస్కృతిక కార్యక్రమాలు ఆయనకు బహుదూరం.

మిత్రుడు డాక్టరుగారికి నాగేశ్వరరావుగారిని అప్పగించి బయట కూర్చు న్నాడు. డాక్టరుగారు పరీక్ష పూర్తిచేసి, "మీ పేరు నాగేశ్వరరావా? సినిమాల్లో నటిస్తూంటారా?- పాపం, ఏమైనా కిట్టుబాటుగా ఉంటుందా?" అని క్షేమ సమాచారం అడిగారు. నాగేశ్వరరావుగారికి పరిస్థితి అర్థమైంది. పైగా చమ త్కారికదా, నవ్వేసి "ఫరవాలేదండి" అన్నారు.

డాక్టరుగారు అంతటితో ఊరుకోక "డిఫికల్ట్ ఫీల్డ్, నా దగ్గరికి జనార్దన రావు అనే ఒక సినిమా నటుడు వచ్చేవారులెండి...ఇబ్బందిపడేవారు" అనేసి కేసు ఫైనల్‌చేసి పంపేశారు. నాగేశ్వరరావు గారు నవ్వుకుంటూ వెళ్లిపోయా రని వినికిడి.

హాస్యరచయిత 'తంబు' అసలుపేరు తోలేటి చంద్రశేఖర్. హాస్యం వ్రాయ డమేకాదు, ప్రాక్టికల్ జోక్స్ వర్షించడంలో కూడా ఆయన నేర్పరి.

ఒకసారి ఏలూరులో ఒక సభకు వెళ్ళాం. అతను ఉపన్యాసం ప్రారంభి స్తూనే "కవులూ, రచయితలూ చాలా అమాయకులండి. దేశమంతా మన రచనలు, చదివేసి, మన పరిచయం కోసం, రాకకోసం పరితపిస్తూంటారని వెర్రి నమ్మకం. మన ప్రతిష్ఠ ఎంతటిదో ఇలాంటి చోటకి వచ్చినప్పుడు తెలు స్తుంది. మనని సభకి పిలిచిన వారికే మనగురించి తెలియదు. మన బయో డేటా మననే అడిగి మనతో, మన రచనలతో బాగా పరిచయంవున్నట్టు సభకి పరిచయం చేస్తారు. నా సంగతే చూడండి. ఇప్పుడే నా బయోడేటా ఇచ్చాను. అయితే మా ఆవిడ కూడా డాక్టరే అనే విషయం దాచాను. చూశారా?" అన్నాడు. సభంతా నవ్వులతో మోగి పోయింది. సభా నిర్వాహ కులు కూడా, తంబుగారి హాస్యచమత్కారాలలో అదొక భాగంగా భావించి చప్పట్లు కొట్టేశారు.

సారాంశం ఏమిటయ్యా అంటే; మన భ్రమలూ, మన అహంకారాలూ, మన ఎరుకలూ, మన పరిచయాలూ, మనల్ని మభ్యపెట్టి ఇక్కట్లు తెచ్చిపెడ తాయి. సిగ్గుపడజేస్తాయి.

నవ్య

# గడపదాటితే మరో దేశం!

ఓ*య్ సినిమాలో హీరోయిన్ ఒకేసారి రెండు రాష్ట్రాల్లో ఉండాలని కోరుకుంటుంది. అప్పుడు హీరో ఆమెను అలాంటి చోటికే తీసుకెళ్తాడు. ఆ సీన్ గుర్తొచ్చిందా? ఇప్పుడు ఈ భవనం గురించిన కథ చదివితే అలాగే అన్పిస్తుంది. ఒకరాష్ట్రం నుంచి మరొక రాష్ట్రానికి ప్రయాణించినంత సులువుగా ఒకదేశం నుంచి మరోదేశానికి ప్రయాణించడం అంత సులువు కాదు. పాస్‌పోర్ట్, వీసాలాంటి రకరకాల నిబంధనలు ఉంటాయి. ఆ నిబంధనలు అతిక్రమించిన వారికి తగిన శిక్షలు వేస్తారు. కానీ ఈ ఇంటిని కొనుగోలు చేస్తే రెండుదేశాల్లో ఎంచక్కా నిబంధనలు లేకుండానే ఉండొచ్చు. ఈ ఇంట్లో ఉంటే ఒక దేశం వైపు కూర్చుని టీ తాగితే మరో దేశం వైపు కూర్చుని టిఫిన్ తినొచ్చు. అదేంటి ఇల్లేంటి, రెండుదేశాల్లో ఉండడం ఏంటి అనుకుంటున్నారా? అదేంటో మీరూ తెలుసుకోండి మరి!*

*ఇప్పుడు చెప్పబోయే ఇంటిని 1782లో నిర్మించారు. ఏడువేల చదరపు అడుగుల విస్తీర్ణంలో ఈ ఇంటిని అమెరికాలోని వెర్మోంట్ రాష్ట్రంలోని ఉత్తర దిక్కు ప్రాంతంలో నిర్మించారు. కెనడా దేశంలోని క్యూబెక్ రాష్ట్రం*



*సరిహద్దులు దీన్ని ఆనుకుని ఉంటాయి. ఇంకాస్త వివరంగా చెప్పాలంటే ఆ ఇంటి వెనుక గేటు అమెరికావైపు ఉంటే, ముందుగేటు కెనడావైపు ఉంటుంది. రెండు సరిహద్దుల వైపూ ఇరుదేశాల సైనికులు పహారా కాస్తుంటారు. అంటే ఈ ఇంటికి ఒక గేటు నుంచి వచ్చి మరో గేటు నుంచి బయటకు వెళ్తే ఏకంగా దేశం దాటేయొచ్చు. దీంతో ఆ ఇంట్లో ఉంటే రెండుదేశాల పౌరసత్వాన్ని పొందవచ్చు. అలాంటి ఆ ఇంటికి యజమానులు బ్రియన్, జున్ డుమౌలిన్ దంపతులు. అయితే వారు కెనడాలోని తమ పిల్లల వద్ద స్థిరపడాలని అనుకుంటున్నారు. అందుకోసం వంశపారంపర్యంగా వచ్చిన ఆ ఇంటిని అమ్మాలనుకుంటు న్నారు. పాతకాలం ఇల్లు కావడంతో ఆ ఇంటి డిజైన్లో రిపేర్ చేయాల్సిన పనులు చాలా ఉన్నాయి. ఆ ఇంటి ధర ప్రస్తుతం 71 లక్షల రూపాయలు. మరమ్మత్తులు చేయిస్తే ఇంకా ఎక్కువగానే ఖర్చు అవుతుంది. అయినప్పటికీ ఆ ఇంటి అమ్మకానికి అమెరికా, కెనడా దేశాలకు చెందిన హౌజ్ ఏజెంట్లు ముందుకొస్తున్నారట. అంతేకాదు ప్రతిరోజు పది నుంచి 12మంది కొనుగోలుదారులను తీసుకొస్తున్నారు. కానీ ఇక్కడే ఓ సమస్య వచ్చిపడింది. కొనుగోలుదారులు కూడా వస్తున్నారు కదా ఇంకేం సమస్యలుంటాయి అనుకుంటున్నారా? ఆ ఇంటిని కొనుగోలు చేసేందుకు ఇంటి వెనుకగేటు నుంచి వచ్చిన వారు ముందుగేటు నుంచి బయటకు వస్తున్నారు, ముందుగేటు నుంచి వచ్చినవారు వెనుక గేటు నుంచి బయటకు వస్తున్నారు. దీంతో దేశ సరిహద్దును దాటి వచ్చారనే ఆరోపణలతో సరిహద్దు భద్రతా సిబ్బంది వాళ్లని అడ్డగిస్తున్నారట. అయితే బ్రియన్ దంపతులు వివరణ ఇచ్చిన తర్వాత సమస్య పరిష్కారం అవుతున్నప్పటికీ ఇంటి అమ్మకానికి ఇది ఓ ఇబ్బందిగా అనిపిస్తున్నట్లు చెబుతున్నారు ఆ దంపతులు. ఇక మరి ఆ ఇల్లు ఎప్పటికి అమ్మకం అవుతుందో, తమ సమస్యలు ఎప్పుడు తీరుతాయో, కొడుకుల దగ్గరికి ఎప్పుడు వెళతామో అని ఆ దంపతులు వేయి కళ్లతో వేచి చూస్తున్నారు.*

నవ్య



# ఒక్క మిత్రుడే చాలు! వద్దులే వరహాలు!

## ఆగస్టు 6 ఇంటర్నేషనల్ ఫ్రెండ్‌షిప్ డే

**రెండు అక్షరాల పదం స్నేహం.**

**అది వింటే చాలు ఎవరికైనా సరే ఓ మధురమైన ఆత్మీయ భావన మనసులో మెదులుతుంది. స్నేహం ఒక అనిర్వచనీయమైన అనుభూతి. స్నేహం చేయడం ఒక కళ. చాలా కొద్దిమంది మాత్రమే స్నేహాన్ని దేవుడిచ్చిన బహుమతిగా భావిస్తారు. మనం కష్టాల్లో ఉన్నప్పుడు, ఆపదలో ఆదుకుని ఓదార్పునిచ్చే స్నేహితులుంటే చాలు. వారి మాటలే మనకు శక్తిమంతమైన ఔషధంలా పనిచేస్తాయి.**

**కటికచీకటి కమ్ముకున్నవేళ అతనో కాంతిపుంజంలా మనకు వెలుగునిస్తాడు. కనురెప్పల మాటున లక్ష్యం దాగున్నవేళ దారిచూపే మార్గదర్శి అతను. మదితెరపై మరక పడితే అతని స్పర్శే మనకు మంచిగంధం. మనలోని లోపాలను సరిదిద్దే వైద్యుడు, ఒత్తిడిని తొలగించి సేదతీర్చే మానసిక వైద్యుడు. ఆపదలలో ఆప్తుడు, ఆనందాల గూడు, పిలిస్తే పలికే ప్రాణమిత్రుడు, కడదాకా తోడుండేవాడు. అతడే స్నేహితుడు. ఆగస్ట్ 6 స్నేహితుల అంతర్జాతీయ దినోత్సవం సందర్భంగా ప్రత్యేక కథనం మీకోసం!**

మనసు మారిపోతుంది ఒక్కమాటతో, కల చెదరిపోతుంది ఒక్క మెలకువతో, ప్రేమ విడిచి వెళ్లిపోతుంది ఒక్క అనుమానంతో... కానీ జీవితమే ఉన్నతంగా మారుతుంది మంచి స్నేహంతో అంటారు. సృష్టిలో తోబుట్టువులు, తల్లిదండ్రుల ఎంపికలో మన ప్రమేయం ఉండదు. స్నేహితుడి విషయంలోనే అది సాధ్యం. ఫ్రెండ్స్ చాలామంది ఉండొచ్చు కానీ వారిలో బెస్ట్ అంటే చాలా తక్కువ మందే ఉంటారు. ఎవరో ఒకరిద్దరు మాత్రమే ఎవరెస్ట్‌లా ఉంటారు. అలాంటివారే ప్రాణస్నేహితులు. ఎవరితోనూ పంచుకోలేని విషయాలను సైతం వారితో పంచుకుంటాం. అదే స్నేహమంటే. నిజానికి మనకు నిత్యం కొత్త ఫ్రెండ్స్ పరిచయమవుతూనే ఉంటారు. అలాగని ప్రతిరోజు ఫ్రెండ్‌షిప్ డే చేసుకోలేం కదా. స్నేహానికున్న ప్రాధాన్యాన్ని దృష్టిలో పెట్టుకుని ఆగస్టు మొదటి ఆదివారాన్ని స్నేహితుల దినోత్సవంగా సెలబ్రేట్ చేసుకుంటున్నాం.

### స్నేహితుల దినోత్సవం

స్నేహితుల దినోత్సవం అమెరికాలో పుట్టింది. నేడు ప్రపంచ దేశాల్లో అంతటా జరుపుకుంటున్నారు. 1919లో అమెరికాలో ఆల్‌మార్క్ అనే వ్యక్తి ఆగస్టు మొదటి ఆదివారం ఫ్రెండ్‌షిప్‌డే పాటించాలని భావించాడు. గ్రీటింగ్స్ పంచుకోవాలని ప్రచారం మొదలుపెట్టాడు. కొంతకాలం అది కొనసాగినా 1940 మధ్యకాలంలో దీనిపై ఆసక్తి తగ్గిపోయింది. ఆ తర్వాత 1958 నుంచి మళ్లీ ఫ్రెండ్‌షిప్‌డే పాటించడం మొదలైంది. 1990లో ఆల్‌మార్క్ ఆధ్వర్యంలో ఫ్రెండ్‌షిప్‌డేను అధికారికంగా పాటించడానికి అమెరికా ప్రభుత్వం అంగీకరించింది. ఇలా ఇది ప్రపంచ దేశాలకు వ్యాపించింది. ఐక్యరాజ్యసమితి జనరల్ సెక్రటరీ కోఫీ అన్నన్ భార్య కూడా 1998లో ఓ సమావేశంలో ఫ్రెండ్‌షిప్ ప్రాముఖ్యాన్ని ప్రస్తావించింది. తర్వాత ఏడాది 1999 ఏప్రిల్ 27న ఐక్యరాజ్య సమితి జనరల్ అసెంబ్లీలో అంతర్జాతీయంగా ఫ్రెండ్‌షిప్‌డే పాటించాలని తీర్మానం చేశారు. కాగా స్పెయిన్‌లో జూలై 20న స్నేహితుల దినోత్సవం చేసుకుంటుండగా మనదేశంలో ఆగస్టు మొదటి ఆదివారం చేస్తాం.

### మంచి స్నేహంతో జీవితం ధన్యం

ఒక యుద్ధం జరుగుతోంది. ఆ సైన్యంలో

### ఆన్‌లైన్ స్నేహాలకు హద్దు

*సామాజిక అనుబంధాల వెబ్‌సైట్లు పరిచయాల్ని పెంచుతాయి. కానీ సామూహికంగా తప్ప అనుభూతులు, భావోద్వేగాలను వ్యక్తిగతంగా పంచుకోగలస్థాయిలో స్నేహితుల్ని మనకు సమకూర్చలేవు. మంచి స్నేహాలు బహుకొద్ది మాత్రమే దొరికే అవకాశం ఉంది. ముఖ్యంగా యువత ఆన్‌లైన్ స్నేహాలకు అర్రులు చాస్తోంది. అబ్బాయిల మధ్య లేదా అమ్మాయిల మధ్య ఆన్‌లైన్ స్నేహంలో సమస్యలు లేవుగానీ, ఆపోజిట్ సెక్స్ మధ్య స్నేహాలతోనే సమస్య తలెత్తుతోంది. ఆన్‌లైన్ స్నేహితులు ఒక స్థాయి దాటాక ఊహాజనితంలో జీవిస్తారు. 24 గంటలూ సెల్‌ఫోన్‌తో గడుపుతారు. అర్ధరాత్రి వరకు చాటింగ్‌లోంచి బైటకురారు. సమయానికి భోజనం చేయరు. కుటుంబసభ్యులతో కలివిడిగా*



*ఉండరు. చదువును విస్మరిస్తారు. లక్ష్యం లేకుండా గడుపుతారు. ఆ ఆన్‌లైన్ బంధం చెదరిపోతే తట్టుకోలేరు. కొందరు సున్నిత మనస్కులైతే ఆత్మహత్యలకు పాల్పడుతుంటారు. అందుకే ఇలాంటి స్నేహాలు చాలా ప్రమాదమని, వాటిపట్ల జాగ్రత్తగా ఉండాలని, హద్దు మీరొద్దని మానసిక నిపుణులు హెచ్చరిస్తున్నారు.*



ఇద్దరు ప్రాణస్నేహితులున్నారు. వారిలో ఒక స్నేహితుడు శత్రుదేశం తూటా తగిలి అమరుడయ్యాడు. నేలకొరిగిన స్నేహితుణ్ణి చూసి గుండెపగిలేలా బాధ పడ్డాడా ఆ స్నేహితుడు. ఒక కందకంలో కూర్చుని శత్రుసైన్యంతో పోరాటం చేస్తున్నాడతను. తూటాలు అతడి తలపై నుంచి దూసుకుపోతున్నాయి. ఎటు చూసినా తుపాకీ చప్పుళ్ళు. అలాంటి పరిస్థితుల్లో ఆ సైనికుడు తన లెఫ్టినెంట్‌ని ఇలా అడిగాడు.

"సర్, నేను అక్కడికెళ్ళి మా మిత్రుణ్ణి తీసుకు వస్తాను"

"వెళ్ళిరా, కాదనను. కానీ నువ్వక్కడికి వెళ్ళినా పెద్దగా ప్రయోజనం ఉండకపోవచ్చు. మీ స్నేహితుడు ఇప్పటికే చనిపోయి ఉండవచ్చు. లేదా నీ ప్రాణాలే పోవచ్చు" అన్నాడు లెఫ్టినెంట్.

అతని సలహా లక్ష్యపెట్టకుండా సైనికుడు ముందడుగు వేశాడు. ఎలాగోలా మిత్రుడు నేలకు ఒరిగిన చోటకు చేరుకోగలిగాడు. అతన్ని తన భుజంమీద మోసుకుని కందకం దగ్గరకు తీసుకొచ్చాడు. తూటా దెబ్బ తిన్న ఆ సైనికుణ్ణి లెఫ్టినెంట్ పరీక్షించాడు. అతను అప్పటికే ప్రాణాలు వదిలేశాడు. తూటాల దాడి జరుగుతున్న ప్రదేశం నుండి స్నేహితుణ్ణి మోసుకొచ్చిన సైనికుణ్ణి జాలిగా చూశాడు.

"నేను ముందే చెప్పాను దీని వల్ల ఏమీ ప్రయోజనం లేదని. ఇప్పుడు చూడు నీకు తగిలిన గాయాలూ అలాంటివే" అన్నాడు.

"కానీ నాకు తృప్తిగా ఉంది సర్. మీ దృష్టిలో ప్రయోజనం అంటే ఏమిటి?"

"నీ స్నేహితుడు చనిపోయాడుగా"

"నేను వెళ్ళేసరికి బతికే ఉన్నాడు సర్. 'నువ్వొస్తావని నాకు తెలుసురా!' అన్న నా స్నేహితుడి ఒక్క మాట చాలు నాకు, అదే నా దృష్టిలో గొప్ప ప్రయోజనం!" అన్నాడతను.

గొప్పస్నేహం ఎప్పుడూ ఉన్నతంగానే ఉంటుంది. పురాణాలలో కూడా స్నేహబంధం గురించి ఉన్నతంగా వివరించారు. రాముడు-సుగ్రీవుడు, శ్రీకృష్ణ-కుచేల స్నేహబంధం మానవాళికి ఆదర్శమైనది. దుర్యోధనుడు-కర్ణుడి స్నేహబంధం మనకు తెలిసినదే. పురాణగాథల నుంచి నేటివరకు స్నేహబంధం నీరాజనాలు అందుకుంటోంది. స్నేహం ముందు అన్నీ బలాదూరే.

'శత్రువు ఒక్కడైనా ఎక్కువే, మంచి మిత్రులు వందమందైనా తక్కువే' అని స్వామి వివేకానంద చెప్పినట్లు ప్రతిపనిలో నేనున్నానంటూ తోడు నిలిచి, గెలుపు ఓటముల్లో నీడలా వెన్నంటి నిలిచి మన క్షేమాన్ని, అభివృద్ధిని కాంక్షించే స్నేహితుడు ఒక్కడుంటే చాలు, వెయ్యి వరహాలు కూడా వ్యర్థమే!

### స్నేహంలో అపార్థాలు

ఎలాంటి బంధంలోనైనా చిన్న చిన్న గొడవలు, అపార్థాలు సహజం. విడిపోవడానికి చిన్న కారణం చాలు. ఎంత దగ్గరి స్నేహితులకైనా అభిప్రాయ బేదాలు, మనస్పర్థలు సహజం. అప్పుడే వాదన ముదురుతుంది. ఎవరూ వెనక్కి తగ్గరు. ఈ ప్రవర్తనే ఏళ్ళనాటి వారి స్నేహానికి గండి కొడుతుంది. యూ ఆర్ మై బెస్ట్ ఫ్రెండ్ అనుకున్నవారే బద్ధశత్రువులై పోతారు. అలా కాకుండా ఇద్దరిలో ఏ ఒక్కరైనా చొరవచూపి ఎదుటివారి తరుపున ఆలోచిస్తే వారి సమస్య మాయమవుతుంది. అందుకే స్నేహంలో పట్టువిడుపులుంటే ఎంతపెద్ద గొడవైనా దూదిపింజలా ఎగిరిపోతుంది. అయితే ఇక్కడొక విషయం బాగా గుర్తుంచుకోవాలి. ఎంత ప్రాణ స్నేహితుడైనా, ఎంత చనువున్నా సరే ఫ్రెండ్‌కి ఓ వ్యక్తిగత పరిధి ఉంటుంది. దాన్ని దాటెళ్ళే హక్కు మనకు లేదు. అలా కాకుండా తను ఏం చేస్తున్నా సరే పూర్తి సమయం నాతోనే ఉండాలి, నాకే కేటాయించాలంటే కుదరదు. స్నేహితుల మధ్య గిల్లికజ్జాలు వచ్చినప్పుడు క్షమాపణ చెప్పుకోవడం తప్పుకాదు. స్నేహితుడిపై కేవలం పొగడ్తలే కాదు, తప్పుచేస్తే విమర్శలు కూడా చెయ్యాలి. అయితే ఆ విమర్శ మిత్రుని మనసు నొప్పించకూడదు.

### ఎలాంటి స్నేహితులు?

మన స్నేహితుల జాబితాలో కొందరు బెస్ట్ ఫ్రెండ్స్, మరికొందరు మామూలు ఫ్రెండ్స్ ఉంటారు. కానీ మనకున్న రకరకాల ఫ్రెండ్స్ గురించి తెలుసుకోండి.

**వ్యక్తిగతం:** ఇలాంటి వ్యక్తిగతమైన స్నేహితులు కనీసం ఒక్కరైనా మనకు ఉండాలి. వాళ్ళతో వాదించవచ్చు, గొడవపడొచ్చు, ఇంట్లో చెప్పలేని విషయాలు వారితో పంచుకోవచ్చు. మన జీవితంలో ప్రతి విషయం, మనం తీసుకునే ప్రతి నిర్ణయం ఆ స్నేహితునికి తెలియజేసేలా ఉండాలి.

**సలహాలు:** మనకు సలహాలు ఇచ్చే స్నేహితులు అన్నీ తెలిసినవారై, విస్తృత ఆలోచనా పరిధి కలిగినవారై ఉండాలి. ఏ చిన్న సహాయమైనా చేయగలగాలి. సమస్య వచ్చినప్పుడు స్నేహితుడు లేదా స్నేహితురాలు ఉందనే ధైర్యం మనలో ఉండాలి.

**సరదాగా నవ్వించేవారు:** కొందరు మాట్లాడితే హాయిగా నవ్వుకోవచ్చు. ఇలాంటి వారితో మాట్లాడితే ఎంత కష్టంలో ఉన్నప్పుడైనా హాయిగా అనిపించగలగాలి. మన మూడ్‌ని మార్చగలిగిన స్నేహితులై ఉండాలి. మానసిక సాంత్వన కలిగించేవారై ఉండాలి.

**వయోభేదం:** స్నేహానికి వయసు బేదం లేదు. వయసుకు అతీతంగా మన అనుభవాలను వారితో పంచుకోవచ్చు. వాళ్ల అనుభవాలు మనం తెలుసుకోవచ్చు. తద్వారా మనల్ని మనం మార్చుకునే ప్రయత్నం చేసుకోవచ్చు. మన స్నేహితుల జాబితాలో వయసులో పెద్దవారుంటే ఇంకా మంచిది. ఎందుకంటారా మన గురించి ఎక్కువ శ్రద్ధ పెడతారు. పొరపాటు చేస్తే మందలించి మార్గం చూపించడంలో ముందుంటారు.

– సంతోషలక్ష్మి దహగాం

## రక్షాబంధనం

*యేన బద్ధో బలీ రాజా దానవేంద్రో మహాబలః*
*తేన త్వామి ప్రతిబధ్నామి రక్షే మాచల మాచల*

రాక్షస రాజు, మహాబలవంతుడూ బలి చక్రవర్తి. దేవతల కోరికపై విష్ణువు తన శక్తితో బలిచక్రవర్తిని బంధించాడు. అంతటి విష్ణుశక్తి గల రక్షను నీకు కడుతున్నాను. ఆ శక్తి నిన్ను ఎల్ల వేళలా కాపాడుతుంది. ఓ రక్షాబంధనమా! నీవు మా సోదరుణ్ణి కాపాడు అని పై శ్లోకానికి అర్థం.

రక్ష అన్న పదమే క్రమంగా రాఖీ అయింది.

తన సోదరుని క్షేమం కాంక్షించే ప్రతి సోదరి పై శ్లోకం చదువుతూ పవిత్ర రక్షను అతని మణికట్టుకు ముడి వేస్తుంది. ఈ రక్ష ఏ ఆపద సమయంలోనైనా తన సోదరుణ్ణి రక్షించాలని ఆమె ఆకాంక్ష. సోదరి ప్రేమకు సంకేతంగా ఉండే ఈ సూత్రం సోదరుడికి అక్క లేదా చెల్లెలు విషయంలో బాధ్యతలను గుర్తుచేస్తుంది. సోదరి సుఖసౌభాగ్యాల కోసం అతను ఎలాంటి త్యాగాలు చేయటానికైనా అవసరమైన ప్రోత్సాహం కలిగిస్తుంది. నేడు చాలా రకాల రాఖీలు మార్కెట్లో దొరుకుతున్నాయి. అన్నిటికంటే నూలుపోగుతో చేసిన రాఖీ శ్రేయస్కరమని పురాణాలు చెబుతున్నాయి.



# జీవనరాగం

-అన్నపూర్ణ

**పార్క్‌లో**

**యోగా చేస్తున్నానేగానీ నా మనస్సు నిలకడగా లేదు. అస్సలు నిలకడ లేనిదేగా మనస్సంటే! నా నలభయ్యేళ్ళ కష్టార్జితం తెగనమ్మి నేనిలా నా ఇద్దరు కొడుకులకీ, కూతురికీ పంచేయటం నా మిత్రత్రయానికి విడ్డూరంగా తోచింది.**

**"నీ పిల్లలందరూ ఆర్థికంగా బాగా స్థిరపడినవాళ్ళే! నువ్వా, అరవైదాటినా దుండుముక్కలా ఆరోగ్యంగానే ఉన్నావ్! అదీగాక విజయవాడలో స్థలాలరేట్లు ఇప్పుడిప్పుడే ఊపందుకుంటున్నాయ్! నువ్వెందుకీ నిర్ణయం తీసుకుంటున్నావో మాకు పాలుపోవటం లేదు" ఆనాటి సాయంకాలం పార్కు సమావేశంలో నా ఆప్తమిత్రులు ముగ్గురూ తెగ బాధపడ్డారు.**

చెప్పాలంటే మా ముగ్గురిస్నేహం ముప్పైసంవత్సరాల పైమాటే! మా కష్టసుఖాల్లో నలుగురం మంచం కోళ్ళలాగా కలిసే ఉన్నాం! వాళ్ళకి నా ఆంతర్యమేమిటో తెలియజేయాలి మరి!

"నేను బ్రతికుండగానే నా కష్టార్జితాన్ని నా పిల్లలు ఆనందంగా అనుభవించటం నా కళ్ళతో నేను చూడాలిరా! 'మా నాన్న మాకు ఇచ్చిన ఆస్తి' అని వాళ్ళు గర్వంగా అనుకోవాలి! అప్పుడే నాకూ తృప్తి మిగుల్తుంది" భావోద్వేగంతో అన్నాను.

నా మనస్సులో చాలా ఆలోచనలున్నాయ్! వాటిని త్వరగా అమలు చేయాలి. ఇంకెంతకాలం బ్రతుకుతానో? జీవితం అన్నాక ఎప్పుడూ ఒక్కలాగే ఉంటుందా? ఇంతకాలం సౌకర్యంగా బ్రతకటానికి ఏర్పాట్లున్నాయి. ఇహ నేను పోయినా నా భార్య పార్వతి ఏ లోటూ లేకుండా జీవితాన్ని ఎదుర్కోటానికి ఏర్పాట్లుచేయాలి!

రోజూకన్నా పావుగంట ముందుగానే ఇంటి ముఖం పట్టాను. లోపలికి వెళ్ళగానే పార్వతి లేచి గ్లాసుతో మంచినీళ్ళిచ్చింది. అది తన అలవాటు. నేను కూడా అవసరం లేకపోయినా రెండు గుక్కలు మంచినీళ్ళు తాగుతాను. నా అలవాటది.

ఏదో ఆలోచిస్తున్నవాడిలా ఉన్న నా మొహంలోకి పరీక్షగా చూస్తూ "కాస్త అన్నం వండనా... లేదా టిఫినా?" అడిగింది. "నా కోసం ప్రత్యేకంగా వండొద్దు. నేనూ నీతోపాటు పాలల్లో ఓట్స్ వేసుకుని తింటాలే!" నా గొంతులో ప్రేమ!

"పిచ్చిపార్వతి!! గుండులా మల్లెచెండులా ఉండేది! అరవై వచ్చీరాగానే చాలామార్పొచ్చింది తనలో! ఎంతో కష్టపడి తెచ్చుకున్న డిగ్రీల్లా మా ఇద్దరికీ షుగర్, బీపీ తోడుగా వచ్చాయ్! అస్తమానం 'నాకేది సమకూర్చాలా' అనే తపనే పార్వతికి! మరి నేను మాత్రం తన గురించి ఆలోచించద్దూ? నేను పోయిన తర్వాత ఈ ఒంటరిదాన్ని పిల్లలు శ్రద్ధగా చూస్తారో చూడరో? అమ్మానాన్నా ఇద్దరూ ఉన్నంతకాలమే మర్యాద! ఇద్దరిలో ఏ ఒక్కరు పోయినా రెండోవాళ్ళు చులకనే అవుతారు! నేనంటే మగవాణ్ణి! ఎలా అయినా నెగ్గుకురాగలను మరి!



పాపం పార్వతి అందరికీ కమ్మగా వండి కడుపు నిండా అన్నం పెట్టటంతప్ప, ఎన్నడూ గడపదాటి బయటికి పోయిన మనిషి కాదు!

నేను రెండ్రోజులు ఊరెళ్ళినా అతలాకుతలం అయిపోతుంది. మందులు సరిగ్గా వేసుకోదు! నిద్ర కూడా పట్టదంటుంది. 'మీరు నా కళ్ళముందుంటేనే నాకు నిశ్చింత! హాయిగా నిద్రొస్తుంది' అంటుంది! ఇహ నా గురించి కన్నా పార్వతి గురించే ఆలోచించాలి!

పడక్కుర్చీలో పడుకుని ఆలోచిస్తున్నాను. కళ్ళు మూసుకున్నా తెరచినా నిన్నటి దృశ్యాలే కన్పిస్తున్నాయ్! యోగా గురువుగారి మాటలు చెవులో రింగుమంటున్నాయ్!

"సంసార లంపటాన్ని ఇహ ఇప్పుడన్నా వదిలించుకోవాలి! హాయిగా మూడుపూటలా ధ్యానం! జపం! సత్సంగం!! ఇంతకంటే ఏంకావాలి ఈ వయస్సులో! మన బాధ్యతలు ముగిసినాయ్!"

నాకూ ఆయన మాటలు బాగా నచ్చాయి! ఇహనన్నా వైరాగ్యం రావాలి! పార్వతికి కూడా ముందు ముందు నేను లేకున్నా బ్రతుకుబండిని ముందుకు లాక్కెళ్ళే తర్ఫీదు కావాలి!

'పది రోజులు ఉండమ్మా మాతో' అని పిల్లలు ఎప్పుడూ బ్రతిమిలాడతారు. కానీ ఉండదు. నా గురించే విజయవాడ పరుగెత్తుకొస్తుంది! కోడళ్లతో కూడా కాస్తదూరంగానే ఉంటుంది! వాళ్ళమీద ఎప్పుడూ 'పెత్తనం' చెలాయించదు. వాళ్ళు కూడా ఉద్యోగస్థులు. వాళ్ళ హడావిడి వాళ్ళది! ఒకవేళ కర్మకాలి పార్వతి వాళ్ళతో ఉండాల్సొస్తే?! అందుకే పార్వతీ నేనూ విడివిడిగా ఉంటానికి అలవాటు పడాలి! ఈ ఆలోచన రాగానే  నా మనస్సంతా చేదుగా మారింది.

'రోజూ ఏడు దాటినప్పట్నించీ దిబ్బరొట్టె వేస్తావా! దోసెలు పోస్తావా?' అని గొడవచేసే ఈ మనిషి ఈ రోజేంటి ఇలా మౌనంగా ఉన్నారు?' పైగా టిఫిన్ కూడా వద్దంటున్నారు. కొంపతీసి ఒంట్లో బాగోలేదా? నేను దగ్గర లేకపోతే ప్రతిదానికీ ఇబ్బంది పడతారీయన. ఒక్క పనీ చేయటం రాదు. పాలు, డికాక్షన్ ఎదురుగా ఉన్నా కాఫీ నేనే కలపాలి! లేకపోతే కాఫీ రుచిగా ఉండదట! భోజనం చేసేప్పుడు ముద్దముద్దకీ కూర బావుందోయ్, పప్పు ఎంత కమ్మగా ఉందో, అబ్బో చారు మరీ బ్రహ్మాండం! ఇలా పొగుడ్తూ ఆప్యాయంగా తింటారు. అన్నం వేడిగా లేకపోతే ముట్టరు. నేను పోతే కోడళ్లు ఆయనకిలా అమరుస్తారా? ఆకలికి ఆగలేరు. అమాయక చక్రవర్తి! అందుకే కొడుకులు నాల్రోజులుండమని బ్రతిమిలాడినా నాలుగు రోజుల్లో బెజవాడకి ప్రయాణం కడ్తారు!' పార్వతికి

ఆలోచనలు తెగటంలేదు. గదిలో నిశ్శబ్దాన్ని భగ్నం చేస్తూ గోడ గడియారం ఎనిమిది కొట్టింది.

పార్వతి లేచి "రండి రెండు దోశెలు తిని, ఆ తర్వాత నాలుగు ముద్దలు మజ్జిగన్నం తిందురు గానీ! సాయంత్రమే దోశెపిండి పట్టాను. తియ్యా దోశెలు. మీకిష్టం అని ఉల్లికారం చేశాను. పార్వతి నా వంక సమ్మోహనంగా నవ్వుతూ చూస్తూ అంది.

'ఈ భార్యల్తో వచ్చిన చిక్కేయిది! ఎంత ఆకలి లేదన్నా వినరు! భర్తలచేత వ్రతభంగం చేయించటంలో దిట్టలు!' పార్వతి మాటల్తో నా ఆకలి నిద్ర లేచింది! పులవని దోశెపిండితో దోశెలు తియ్యగా... వాటిలోకి పచ్చి ఉల్లిపాయముక్కల్తో కారంగాచేసిన పచ్చడి, ఆ పచ్చడిలోకి పేరుకున్న నెయ్యి.... వేడి వేడిగా మా ఆవిడ వేసే దోశెలు రెండేవిటి నాలుగు తినకుండా ఉంటానా?

విజయవాడలో ఆరొందలగజాల స్థలం, ఒంగోల్లో రెండు ఎకరాల పొలం అమ్మి ఆ వచ్చిన డబ్బు, నా ముగ్గురు పిల్లలకే కాకుండా నా భార్యకి కూడా 'సమంగా' వాటా వేశాను. వాళ్ళు నలుగురికీ తలా పాతిక లక్షలూ, నా పేరున ఓ ఐదూ, నా ఇద్దరు చెల్లెళ్లకు తలా రెండూ, మా ఊరి రామాలయానికో లక్షా.... అలా వచ్చిన డబ్బంతా పంచేసి తేలిక పడ్డాను!

పిల్లలు పైకి డబ్బొద్దన్నా మనస్సులో సంతోషంగానే ఉన్నట్టు కన్పించారు! ఒక్క పార్వతీ, గుళ్లో రాములవారు మాత్రమే ఏ భావాలూ పలికించలేదు! ఊరు చివర రాళ్లల్లో రప్పల్లో నాకు, ఇంత డబ్బుందని ఏనాడూ అనుకోలేదు! పార్వతికి పొదుపుఖాతాలో కొంత డబ్బుంచి, ఎ.టి.ఎమ్ కార్డు తీసుకుని డబ్బు ఎలా తీసుకోవాలో నేర్పించాను!

"నాకే లావాదేవీలెందుకు హాయిగా అన్నీ మీరు చూస్తారుగా?" మొండిగా విసుక్కుంది! నేర్పుగా ఓర్పుగా పార్వతికి బోధించాను! మొత్తానికి దారిలోకొచ్చింది! పార్వతి స్వతహాగా తెలివైంది! లేకపోతే బడిపంతులుగా నేను తెచ్చే జీతంతో ఎంత పొదుపుగా సంసారం లాగకపోతే పిల్లలంతా పెద్దపెద్ద చదువులు చదివి యింత దర్జాగా బ్రతకగలుగుతున్నారు!

నా నలభైఏళ్ళ కాపురంలో పార్వతి ఓ నగ కావాలనిగానీ, చీరలు సారెలనిగానీ ఏనాడూ అడగలేదు. తన ఆశలన్నీ ముందు నా చుట్టూ, తర్వాత నా పిల్లల చుట్టూ అంతే! హాట్సాఫ్! భగవంతుడా అనుకూలవతి అయిన భార్యకన్నా ఏ మొగాడికైనా జీవితంలో ఇంకేం కావాలి? ఆ వెన్నెలరోజు పార్వతికి మెల్లిగా చెప్పాను నా మనస్సులో మాట! "యోగా గురువుగారు, ఆయన శిష్యులతో కలిసి నేను కూడా వందరోజులు హిమాలయ యాత్రకి వెళ్తున్నాననీ... ముగ్గురు పిల్లల దగ్గర ఒకొక్కనెల ఉండమనీ!"

పార్వతి మ్రాన్పడి పోయింది! ససేమిరా ఒప్పుకోనంది! కాసేపు అలిగింది. తనూ వస్తానంది. ఏడ్చింది. అన్నం మానేసింది! కానీ.....నాకు తెల్సు. నా భార్య నేను నచ్చచెప్తే వింటుంది! ఈ హిమాలయాలు చూడాలనే కోరిక ఇప్పటిది కాదని, ఎన్నో ఏళ్ళుగా ఎదురు చూస్తున్నానని నా ప్రయాణం అడ్డుకోవద్దని కాళ్ళు పట్టుకున్నంత పని చేశాను!

పైగా కొడుకులు కోడళ్ళతోను, కూతురు అల్లుడుతోనూ, మనమరాలు మనవళ్ళతోను, తను

హాయిగా గడపటం ఒక 'యోగం' అని, అది ఇంచు మించు హిమాలయ యాత్రతో సమానమని నా వాక్చాతుర్యంతో పార్వతిని ఒప్పించాను. నేను ఒంటరిగా వెళ్ళటానికి పిల్లలు కొంతనసిగినా వాళ్ళ అమ్మవచ్చి నెలేసి రోజులుండటం వాళ్ళకి చాలా నచ్చిన అంశం! అందుకే వాళ్ళూ ఒప్పుకున్నారు!!

ముందు పెద్దకొడుకు ఇంటికి హైదరాబాద్, తర్వాత రెండోది కూతురు కనక రాజమండ్రిలో వాళ్ళింటికి, చివరగా చిన్న కొడుకు ఇంటికి వైజాగ్ వెళ్ళేట్టుగా ప్లాన్ వేసింది నా భార్య!

పెద్దవాడికిష్టం అని మిరప్పళ్ల గోంగూర పచ్చడి, అమ్మాయి కిష్టం అని నిమ్మకాయ ఊర గాయ, చిన్నకొడుకు కోసం ఆవకాయ, గుమ్మడి వడియాలూ, మనవలు, మనవరాలి కోసం మినప సున్నుండలు, కజ్జికాయలు, చక్రాలు ఇలా అన్నీ తయారు చేయించి ప్యాక్ చేయించింది కోడళ్లకి, కూతురికి, పిల్లలకి సగం బజారు బట్టలు కొని సర్దింది. 'ఆవిడలో ఇంత హుషారు దాగి ఉందా?' అని ఆశ్చర్యం వేసింది! తన ప్రయాణం సందడిలో నన్ను పూర్తిగా మర్చిపోయిందనిపించింది. పార్వ తిని హైదరాబాద్ రైలెక్కించి ఇంటికొచ్చిన నేను ఆ రాత్రి సరిగ్గా నిద్రపోలేదు. చాలా వెలితిగా ఫీల య్యాను. నా ఇల్లు నాకే కొత్తగా వింతగా తోచింది.

ఆ మర్నాడు నా ప్రయాణం. నా మిత్రుడు రాఘవ ఇంటికి భోజనానికి పిల్చాడు.

'ఎంత ఆకలిగా ఉన్నా నాభార్య వంటంత రుచించ లేదు ఆ భోజనం. అన్యమనస్కంగానే తిన్నానన్పిం చాను! "అన్నయ్యగారు అప్పుడే వదినగారిమీద బెంగేసుకున్నారు!" రాఘవ భార్య నాతో మేలమా డింది.

"అబ్బే! అదేం లేదు! తను ఎప్పుడూ ఒంటరిగా వెళ్ళలేదు!" నాగొంతు నాకే దిగులుగా వినిపించింది. "భలేవాడివిరా! మీ ఆవిడ ఎక్కడికెళ్ళిందనీ, పిల్లల దగ్గరి కేగా! హాయిగా ఉంటుందిచూడు! హాయిగా ఇంటి పట్టునుండక నువ్వే హిమాలయాలకి వెళ్తున్నావ్ అంతదూరం!" రాఘవ నన్ను దెప్పిపొడిచాడు. మూడునెలలు నేను ఉండనని దిగులు వెధవకి! నన్ను ఇంకా వెనక్కి లాగుదామనే ఆలోచన!! "బాగుందండీ! అన్నయ్యగారికి కాబట్టి అంత మంచి ఆలోచన! అందరికీ ఉండద్దూ ఆ భాగ్యం?"

రాఘవ భార్య నేను చిన్నబుచ్చుకోకుండా పొగి డింది!

యోగా గురువుగారితో కలిపి మా బృందం ముప్ఫైమంది అనుకున్నా అనారోగ్య కారణాల వల్ల మా వాళ్ళు ఓ ఐదుగురు డ్రాపయ్యారు.

మేం అందరం కలిసి మంచి 'ఓల్వో బస్సు' మాట్లాడుకున్నాం. అరవైపడిలో వాళ్ళం, షుగరు, బీపీ, కొలెస్ట్రాల్ వగైరా వగైరా భుజకీర్తులున్న వాళ్ళం కనుక ఆహారం విషయంలో చాలా ముందు చూపుతో ఇద్దరు మెరికెల్లాంటి వంటవాళ్ళు, వంట సామాగ్రితో వెళుతున్నాం. కనుక, మాకు తిండి విషయంలో ఢోకాలేదు. మా యోగా గురువు శ్రీ వెంకటేశ్వర్లుగారు రిటైర్డ్ పి.టి.మాస్టర్. ఒంగోల్లో యోగాశ్రమం కూడా నడుపుతున్నారు. అరవై దాటినా, నిరంతర యోగాసాధనవల్ల ఆయన దృఢంగా ఆరోగ్యంగా ఉంటారు. అంచెలంచెలుగా హిమాలయాలు చేరుకున్నాం! హిమగిరి పాదాల చెంత ధ్యానం, యోగం, తత్సంగం! చాలా ప్రశాం తంగా ఉంది. కానీ ఒకళ్లుకాక ఇద్దరు ముగ్గురు చేరారంటే ఇంటిమీదే ధ్యాస! భార్యా... పిల్లలూ... అలవాట్లూ.. ఆలోచనలూ..! ఇంటిమీద గాలి మెల్లి మెల్లిగా మనస్సుని ఆక్రమిస్తోంది!

ఈయాత్ర ఇంకెన్నిరోజులు...ఇంటికెళ్ళగానే అర్జం టుగా చెయ్యాల్సిన పనులేమిటి! ఇలా... మెల్లిమెల్లిగా దారి తప్పుతున్నాం. 'పార్వతి ఎట్లా ఉందో? పార్వతి సంతోషంగా ఉందా? ఏమైనా ఇబ్బంది పడ్తోందా?' అనే నా ఆలోచన. ఈలోగా బృందంలో సభ్యులందరూ ఇన్ని రోజులు టూర్ ఉండకూడదు అని చెవులు కొరుక్కున్నారు, గురువుగారికి వినపడకుండా!

***

పెద్దకొడుకు స్టేషన్కొచ్చి తల్లిని రిసీవ్ చేసుకు న్నాడు. "అమ్మా!" అంటూ ఆప్యాయంగా కావలించు కున్న కొడుకు తల నిమురుతూ "రఘూ! ఏంటిలా నీ తలలో తెల్లవెంట్రుకలున్నాయ్?" దిగులుగా అడి గింది జానకి!

"అమ్మా! నాకు ఇంకో రెండేళ్ళలో నలభై రాబో తున్నాయ్! ఇంకా నేను చిన్నవాడిననుకుంటు న్నావా?" తేలిగ్గా అన్నాడు.

రమకి అత్తగారి ఆచారం అంటే భయం వేస్తోంది. పనిమనిషి వంట ఇంట్లోకి వచ్చి కిచెన్




**అతను రిటైరై ఫ్రెండ్స్, యోగాలతో హ్యాపీలైఫ్ గడుపుతున్నాడు. అతని ముగ్గురు పిల్లలూ సెటిలయ్యారు. ఆకస్మికంగా పొలం, స్థలాలు అమ్మేసి కొడుకులకీ, భార్యకీ డబ్బు సమానంగా పంచాడతను. ఆనక మెల్లిగా భార్యకు చెప్పాడు, మూడునెలలు హిమాలయాలకు వెళ్ళొస్తానని. ససేమిరా ఒప్పుకోలేదామె. ఎలాగో ఒప్పించాడతను. కానీ ఆ మూడునెలలూ మూడుక్షణాల్లా గడిపింది ఆమె. మరి అతను....?**

శుభ్రం చేయటం, కూరలు కోయటం అత్తగారికి నచ్చుతుందో లేదో? ఆ అమ్మాయి అన్నీ రెడీ చేస్తేనే గానీ తొమ్మిదింటికల్లా వంటా, టిఫిన్స్, బాక్సలు రెడీ చేయటం పూర్తికావు. కోడలు రమ ముఖంలో పార్వతికి టెన్షన్ కన్పించింది. మధ్యాహ్నం భోజ నాలు పూర్తైన తర్వాత మెల్లిగా చెప్పింది రమ. "అత్తయ్యా! పనిమనిషి కిచెన్లోకొచ్చి పని చేయటం మీకేం, అభ్యంతరం లేదుగా?"

తేలిగ్గా నవ్వేసింది పార్వతి "మీలాంటి ఉద్యోగ స్థులు ఇలాటి ఛాదస్తాలు పెట్టుకుంటే, ఎలా కుదు ర్తుందమ్మా! అయినా రమా! నేను ఉన్నన్నిరోజులూ నువ్వు హాయిగా రెస్ట్ తీసుకో! యూనివర్సిటీలో పాఠాలు చెప్పిచెప్పి అలసిపోతావ్! నా చేతుల్తో నా కొడుకింట్లో వంటచేసి పెట్టానన్న తృప్తి నాకుం టుంది. నువ్వేం టెన్షన్ పడకు. నాకు ఐదింటికే లేచే అలవాటుంది. మీరు వెళ్ళిన తర్వాతే నేను నింపా దిగా నా పూజ పని చూసుకుంటాను!" కోడలికి నచ్చచెప్పింది. అయినా రమ కూడా అత్తగారితో కిచెన్లో వంటలో సాయం చెయ్యటంతో ఎనిమిది కల్లా వంటలు, టిఫిన్లు తెమిలిపోతున్నాయ్! అత్తా కోడళ్ళూ కలిసి వంటచేయటం చాలా సందడిగా ఉండి, రఘుకూడా వంటింట్లోనే కబుర్లుచెప్తూ సందడి చేస్తున్నాడు! మనవరాలితో ముచ్చట్లు చెప్తూంటే పార్వతికి చాలా హాయిగా ఉంది.

రోజులు చకచకా కదిలి నెల పూర్తయ్యింది. రాజమండ్రినించి కూతురు పద్మ తల్లిని తీసికెళ్ళ డానికి వచ్చింది. ఆ తల్లీ కూతుళ్ళు వెళ్తుంటే రమకి చాలా వెలితిగా అనిపించింది.

"అత్తయ్యగారూ! మీరు మళ్ళీ రావాలి మావc గారితో కలిసి. మేం ఇద్దరం డ్యూటీలకెళ్ళినా మీరు ఇంట్లో ఒంటరిగా ఉంటారనే బాధ ఉండదు నాకు!" మనస్ఫూర్తిగా అంటున్న కోడలి తల ఆప్యాయంగా నిమిరింది పార్వతి!

రైలు రాజమండ్రి చేరేప్పటికి అల్లుడు ప్రసాద్ కొత్తకారు తీసుకుని స్టేషన్కి వచ్చాడు అత్తగారిని భార్యని రిసీవ్ చేసుకోటానికి. "కారు చాలా బావుంది అల్లుడుగారూ!" పార్వతి మెచ్చుకుంది! "మా మావగారు కొనిచ్చారు!" ప్రసాద్ గర్వంగా చెప్పాడు. సందేహంగా చూస్తున్న తల్లితో "అదేనమ్మా, నాన్నగారు ఇచ్చిన డబ్బుతో ఇంటికి వేయగా మిగిలిన డబ్బుతో కారు కొన్నారీయన! అడిగినవాళ్ళకి అడగనివాళ్ళకి కూడా యిలా గొప్పగా చెప్పుకుంటూ ఉంటారు!" పద్మ చెప్పింది

## ఐటెంసాంగ్‌కు మూడున్నర కోట్లు?

**టా**లీవుడ్‌లో ఐటెంసాంగ్‌కు ఇస్తున్న అత్యధిక పారితోషికం ఇదే! కాకపోతే మామూలు సాదా సీదా హీరోయిన్‌కు ఇంత సమర్పించుకోవడం లేదు. జేజమ్మ అని టాలీవుడ్ అంతా ముద్దుగా పిలుచుకుంటున్న అనుష్కశెట్టికి ఇంత సొమ్ము చెల్లిస్తున్నారు. 'బాహుబలి'తో ప్రపంచవ్యాప్తంగా గుర్తింపు పొందిన అనుష్క కథలో సత్తా ఉంటే తప్ప సినిమా ఒప్పుకోవడం లేదు. అలాంటిది ఐటెంసాంగ్ చేయబోతోంది అంటే ఆ సినిమాతో పాటు పాటలో కూడా సత్తా ఉందనే అంటున్నారు టాలీవుడ్ జనాలు. కాకపోతే ఈ విషయంలో ఇంత వరకు అనుష్క నోరు విప్పి చెప్పలేదు. మౌనం అర్ధాంగీకారం కనుక అందరూ ఇదే నిజమని అనుకుంటున్నారట!

నవ్వుతూ!

ఇంట్లో ప్రసాద్ తల్లి శ్రీదేవమ్మగారు డెబ్బైఏళ్ళు దాటినా ఆరోగ్యంగానే ఉంటారు. కానీ ఊబకాయంవల్ల ఎక్కువగా తిరగ లేదు. అస్తమానం కోడల్ని పద్మా అదివ్వు, యిదివ్వు అంటూ పిలుస్తూనే ఉంటుంది. పద్మకూడా అత్తగారిని విసుక్కోదు. ఓర్పుగా సేవలు చేస్తుంటుంది. అందుకే ప్రసాద్‌కి భార్యంటే ప్రాణం. ఇద్దరు కొడుకుల్తో ప్రసాద్ చాలా ఫ్రెండ్లీగా ఉంటాడు. పిల్లలిద్దరూ ఆటల్లో చదువులో అన్నింటిలో ఫస్టు! వియ్యపురాలు పార్వతిని దగ్గర కూర్చోబెట్టుకుని కబుర్లు చెప్తూంటుంది. కూతురు కాపురం చూసి పార్వతికి కడుపు నిండిపోయింది. వాళ్ళతో చాలా సరదాగా గడిచిపోయింది.

చిన్నకొడుకు అమ్మని తనింటికి తీసుకెళ్ళటానికి రాగానే పద్మ ఏడుపు మొహం పెట్టింది.

"అప్పుడే నెలై పోయిందిరా? ఇంకో వారం ఉండి వస్తుందిలే అమ్మ!" తమ్ముణ్ణి గదమాయించింది.

"అదేం కుదర్దు! ఎప్పుడెప్పుడా అని అమ్మకోసం రెండునెలలు వెయిట్ చేశాను. నా పెళ్ళి తర్వాత మా ఇంటికి అమ్మ ఇదే రావటం! రూల్స్ వయొలేట్ చేస్తే మర్డర్లు జరుగుతాయ్ అక్కా!".

తమ్ముడు గోపీ అక్కతో యుద్ధానికిదిగాడు. మేనమావ మీదికి పిల్లలిద్దరూ కుస్తీకి దిగారు.

మా అమ్మతో యుద్ధం చేస్తావా? అంటూ!

భార్య, బావమరిది చెలగాటాల్ని ప్రసాద్ ఫోన్లోంచి వీడియో తీస్తూ ఆనందించాడు.

ఇక తప్పనిసరై అమ్మని కావలించుకుని ఏడుస్తూ పంపిస్తూంటే పిల్లలిద్దరూ పద్మని వింతగా చూశారు. చిన్నకొడుకు గోపీ యూనివర్సిటీలో క్లాస్‌మేట్ వసంతని కులాంతరవివాహం చేసుకున్నాడు. గోపీ పెళ్ళికి అన్నా, అక్కా తమ్ముడికి సపోర్ట్‌గా నిలబడి తల్లీతండ్రిని ఒప్పించారు. అందుకే చిన్నకోడలు వసంత పార్వతిని తప్పించుకుని బెరుగ్గా తిరుగుతుంటే పార్వతి దగ్గరికి పిలిచింది.

"మా అబ్బాయిని పెళ్ళి చేసుకున్న తర్వాత ఇక నువ్వు మా పిల్లవే వసంతా! రమా, పద్మా, నువ్వూ నాకు ఒక్కటే! మా వాడికి ఇష్టమైన వంటలన్నీ 'నువ్వు నా దగ్గర్నుంచి నేర్చుకోవూ? ఈ నెల్రోజులు. నీకు మంచి ట్రైనింగ్ ఇస్తాను. సరేనా?" అత్తగారి మాటలకి వసంత పులకరించిపోయింది. బెరుకంతాపోయి అన్ని సందేహాలూ అడిగేది.

"అబ్బా! దోసకాయ పప్పు, ఆలూ ఫ్రై అచ్చు మా అమ్మలాగా, చేశావు వసూ!" కొడుకు భార్యని మెచ్చుకుంటే పార్వతి మురిసిపోయింది!! భర్తని తల్చుకుంటూ అనుకుంది. 'ఈ మూడు నెలలు పిల్లల్తో ఎంత హాయిగా గడిచిపోయింది? పాపం ఈయనే వాళ్ళని మిస్ చేసుకున్నారు!' అని.

***

నేను హిమాలయ యాత్ర భారంగా ముగించాను. విజయవాడ వచ్చేప్పటికల్లా పిల్లలు ముగ్గురూ కుటుంబాల్తో సహా నాకు స్వాగతం పలికారు. మూడునెలల పాటు నా భార్యని విడిచి నేనెప్పుడూ ఉండలేదు! పార్వతి చాలా సంతోషంగా, కొత్తగా కనిపించింది. ఇల్లంతా పండగ వాతావరణంలా ఉంది.

ఈసారి పార్వతి కోడళ్లతో, అల్లుడితో కూడా చాలా కలివిడిగా ఉంది. వాళ్ళుకూడా ముఖ్యంగా చిన్నకొడుకు కోడలు ఇంట్లో సందడి చేశారు! పార్వతి వెళ్ళి వాళ్ళిళ్ళల్లో ఉండటం వల్ల కాబోలు! ఈ మార్పు చాలా హాయినిచ్చింది నాకు!

అంతేకాదు, నాకు పార్వతిని చూసి జెలసీ కలిగింది! నా ఆలోచనా ధోరణి తప్పనిపించింది! "కొడుకులు కూతురు మనవాళ్ళేగానీ, కోడళ్లు అల్లుడు మనవాళ్ళా పార్వతీ! ఎంతో తప్పనిసరైతేనే వాళ్ళిళ్ళకు వెళ్ళాలి. మనం ఆరోగ్యంగా ఉన్నంత కాలం మనకోసం మనంలా ఉండాలి." అనేవాణ్ణి అలానే ఉండేవాణ్ణి.

పార్వతి వాదించేది, "వాళ్ళతో కలిసిమెలిసి ఉంటేనే కదా మనతో వాళ్ళకి దగ్గరితనం ఏర్పడేది! ఎప్పుడూ రోగాలు రొష్టుల్లోనే వాళ్ళిళ్ళకి వెళ్ళాలనుకోవటం సరికాదు. వాళ్ళతో సంతోషంగా గడిపే కాలమే మనకి కావాలి!" అని. నా భార్య వాదన కరెక్ట్!

నేను హిమాలయాలదాకా వెళ్ళి పొందలేని మానసికానందం నా భార్య పిల్లల్తో గడిపి సాధించింది!

ఈ మూడు నెలలూ ఎప్పుడు గడుస్తాయా అని నేను ఎదురుచూస్తే 'అప్పుడే మూడునెలలు గడిచిపోయాయా?' అనుకుంది నా భార్య! తనే కాదు పిల్లలు కూడా అలాగే అనుకునేలా సంతోషాన్ని పంచింది!

జీవితాన్ని 'ఇలా గడపాలి అలా గడపాలి' అనుకోవటం కాదు. జీవితాన్ని ప్రేమిస్తూ ప్రేమని పంచుతూ గడపాలి! నా భార్య నా దృష్టిలో హిమాలయాలంత ఎత్తుగా తోచింది!!

**సెల్: 7893882080**



# ఓ వారాలబ్బాయి జయభేరి

## (మురళీమోహన్ జీవితాలాపన)

**విజయం ఎప్పుడూ ఒంటరిది కాదు. విజయోత్సవాన్ని జరుపుకోడానికి చుట్టూ వందమంది గుమికూడతారని అంటారు. నిజానికి గుర్తించాల్సిన విషయం ఇక్కడ ఇంకోటి ఉంది. విజయమనే గమ్యాన్ని చేర్చే ప్రయాణం కూడా ఎప్పుడూ ఒంటరిది కాదు. దానికి కూడా చాలా అంశాలు ఊతాన్నిస్తాయి. సరైన లక్ష్యం, ఆ లక్ష్యాన్ని చేరుకోవాలనే తపన, అవిశ్రాంతమైన కృషి, అలుపెరగని ఓర్పు...ఇలా పలు అంశాల తోడ్పాటుతోనే విజయం వరిస్తుంది. అంతటి గొప్ప విజయమే 'వారాలబ్బాయి' మురళీమోహన్‌తో 'జయభేరి' మోగించింది.**

'గెలుపులో బతుకు ఉండదు.. బతికే విధానమే గెలుపును నిర్ణయిస్తుంది. నా జీవితంలో విజయం పంచిన తీపికన్నా దాన్ని చేరుకోవడానికి చేసిన

## బిజినెస్‌మేన్ కావాలనుకున్నా!

ప్రయాణం చాలా ఆహ్లాదకరంగా ఉంటుంది' అంటారు మురళీమోహన్. వ్యాపారవేత్తగా, నటుడుగా, బాధ్యత గల భర్తగా, ఆదరాభిమానాలున్న తండ్రిగా, రాజకీయ నాయకుడిగా ఆయన జీవితం పరిపూర్ణం.

'చేయాల్సిన పనులతో క్షణాలన్నీ బిజీగా మారి పోయాయనుకోండి. చెడు గురించి ఆలోచించే తీరికే ఉండదు.. ఏమంటారు?' అని శ్రోతని ప్రశ్నిస్తారాయన. అంతటి చలాకీతనం ఉండటం వల్లనేమో 77 ఏళ్ళ వయసులోనూ హుషారుకే హుషారు పుట్టేలా ఉండగలుగుతున్నారు. నవతరంతో పోటీపడుతూ ముందుకు సాగిపోతున్నారు. ఆయన జీవిత ప్రస్థానాన్ని 'నవ్యవీక్లీ'లో ధారావాహికగా ప్రచురిస్తే బావుంటుందనిపించింది. ఆ విష యాన్నే ఎడిటర్ జగన్నాథశర్మగారి ముందు ఉంచితే, 'బావుంటుంది. చేయండి. ఒక ప్పుడు మధ్యతరగతి కుటుంబాలను ప్రతిబింబించే కథల్లో మురళీమోహన్ చాలా బాగా చేశారు. చాలామంది మిడిల్ క్లాస్ వాళ్ళకి ఆయన పాత్రలు ప్రతినిధులు. 'వారాలబ్బాయి' అప్పట్లో ఎంత పెద్ద హిట్టో.. 'ఓ వారాలబ్బాయి జయభేరి' అని టైటిల్ పెట్టి రాస్తే బావుంటుంది. ఆయన పర్మి షన్ తీసుకోండి' అని సూచించారు. వెంటనే ఆ రోజు మధ్యాహ్నం మురళీ మోహన్‌గారికి ఫోన్ చేశాం.

"మీ వృత్తి, ప్రవృత్తి.. జీవితంలోని పదనిసలతో మా 'నవ్య వీక్లీ'లో ధారా వాహిక రాయాలనుకుంటున్నామండీ" అని చెప్పాం.

'ఓ.. దానిదేముంది.. నాలుగు రోజులు కాసింత బిజీగా ఉంటాను. ఆ తర్వాత కలుద్దాం వద్దురుగానీ..' అన్నారు. అన్నట్టుగానే నాలుగు రోజుల తర్వాత ఫోన్ చేశాం. 'ఇవాళ వస్తారా.. కాస్త హెక్టిక్‌గా ఉంది.

**(కొత్త శీర్షిక ప్రారంభం)**

ఇంకో గంటలో ఎక్కడికి రావాలో చెబుతాను. వచ్చే యండి' అన్నారు. మరలా ఆయనే ఫోన్ చేసి 'ఉదయం 11 గంటలకు ఫిల్మ్‌చాంబర్ ఆవరణలోని 'మూవీ ఆర్టిస్ట్ అసోసియేషన్' కార్యాలయానికి వస్తాను. అక్కడో ముఖ్యమైన పని ఉంది. పూర్తవ గానే మనం కూర్చుందాం' అన్నారు.

అక్కడికి వెళ్ళాం.

హడావిడిగా మెట్లుదిగుతూ కనిపించారు మురళీ మోహన్. ఆయనతోపాటు మూవీ ఆర్టిస్ట్ అసోసి యేషన్ అధ్యక్షుడు శివాజీరాజా, సభ్యుడు సురేశ్ కొండేటి మరికొందరూ ఉన్నారు.

'ఏంటండీ.. ఎలా ఉన్నారు?' అని శివాజీరాజా పలకరించారు. 'మీరు వచ్చేశారా.. మీరు ఏమీ అను కోకపోతే, మేం.. కె.విశ్వనాథ్‌గారి ఇంటికి వెళ్తున్నాం. త్వరగా వచ్చేస్తాం. మాట్లాడుదాం. పది నిమిషాలు ఉండగలరా.. పర్వాలేదుగా..' అన్నారు మురళీమోహన్.

"పర్వాలేదు సార్.. వెళ్ళిరండి.."అన్నా. మరలా ఆయనే ఫోన్ చేసి, 'ఇక్కడ కాస్త ఆలస్యం అయ్యేట ట్టుంది. మనం 'జయభేరి' ఆఫీసులో కూర్చుని మాట్లాడుకుందాం, అక్కడికి రాగలరా' అని అడిగారు. "వస్తున్నామండీ" అని అక్కడికి చేరుకున్నాం.

మేం వెళ్ళేసరికే మురళీమోహన్‌గారు ఆఫీసులో ఉన్నారు. వరుసగా ఫోన్లు మాట్లాడుతూనే ఉన్నారు. ఓ పావుగంట తర్వాత రూమ్‌నుంచి బయటికి వచ్చి 'అరే.. మీరు అప్పుడే వచ్చేశారా... మీకే ఫోన్ చేద్దామనుకుంటున్నాను. పార్టీ ఆఫీసు నుంచి అర్జెంట్ కాల్ వచ్చింది. తప్పక వెళ్ళాలి, ఏమీ అనుకోకండి ప్లీజ్. ఇవాళ ఇంత బిజీగా ఉంది ఎందుకో మరి.. తప్ప కుండా కబురుపెడతాను.. కలుద్దాం' అని అక్కడి నుంచి హుటాహుటిన వెళ్ళిపోయారు.



**ఈ రాజబాబు గురించి మరింత అర్థంకావాలి..అంతేగా**

ఆయన ఫోన్ కోసం ఎదురుచూస్తూ ఆఫీసులో కూర్చున్నా. సాయంత్రం సరిగ్గా ఐదుగంటలకు ఫోన్. 'నేను ఫిల్మ్‌నగర్ దైవ సన్నిధానంలో ఉన్నాను. మీకోసమే.. మీ ఆఫీసుకు దగ్గరగా ఉంటుందని ఇక్కడే వెయిట్ చేస్తున్నాను. వచ్చేస్తారా.. ఇక్కడే మాట్లాడు కుందాం..' అన్నారు మురళీమోహన్‌గారు.

"ఐదు నిమిషాల్లో అక్కడ ఉంటా సార్" అని వెంటనే దైవసన్నిధానం చేరుకున్నా. ఉదయాన్నే చూసిన వ్యక్తికీ, ఇప్పుడు గుడిలో చూస్తున్న వ్యక్తికీ చాలా మార్పు ఉంది. ఉదయం చూసిన మురళీ మోహన్‌గారు రొటీన్‌లో హడావిడిగా ఉన్నారు. గుడిలో అందుకు పూర్తిగా విరుద్ధంగా ఉన్నారు. గుడి కార్యాలయంలో చిన్న రూమ్. చాలా నిరాడంబరంగా ఉంది. ఆయన కూడా చాలా ప్రశాంతంగా కనిపించారు.

'ఏమీ అనుకోకండి. ఇన్నిసార్లు నేను ఎవరినీ తిప్పలేదు. గుర్తొస్తే నాకే ఏదోలా అనిపించింది. అందుకే ఇక్కడైతే మీకు వెసులుబాటుగా ఉంటుందని వచ్చేశాను' అన్నారు.

"పర్లేదు సార్.. మీరు ధారావాహికకు ఒప్పుకున్నందుకు ధన్యవాదాలు" అని చెప్పా.

'ఎన్ని వారాలు వస్తుంది? ఏమేం చెప్పాలి?' అడిగారాయన. "జీవితంలో మీరు ఎదిగిన వైనం, మీ అనుభవాలు, అనుభూతులు, విజయ రహస్యాలు.. ఇలాంటివన్నీ చెప్పండి సార్" అన్నాను.

'అంటే ఇది చదివిన వారికి ఈ రాజబాబు (మురళీమోహన్ అసలు పేరు) అర్థమవ్వాలి. మురళీమోహన్ మరింత అర్థం కావాలి, అంతేగా... తప్పకుండా చేద్దామండీ.. రాసుకోండి' అన్నారు. ఒక్క క్షణం కళ్ళు మూసుకుని ఆలోచించి.. వెంటనే అందుకున్నారు.

### సమరయోధుల కుటుంబం

"మాది పశ్చిమగోదావరి జిల్లా ఏలూరు మండలం చాటపర్రు గ్రామం. చాలా అందమైన ఊరండీ. పచ్చటి పైరు, పిల్ల కాలువలు, ఆయా రుతువులకు అనుగుణంగా మారే ప్రకృతి.. మా ఊరికి కొంచెం అటువైపు వెళ్తే కొల్లేరు. అక్కడికివచ్చే స్థానిక, వలస పక్షుల అందాలు ఒకవైపు, ఏలూరు పట్టణం సొగసులు మరోవైపు....మా చాటపర్రును వర్ణించాలేగానీ చాలా అందంగా ఉంటుంది.

మా అమ్మగారి స్వగ్రామం గుంటుపల్లిలో జూన్ 24న నేను పుట్టాను. కృష్ణాజిల్లా ఇబ్రహీంపట్నం దగ్గరలో ఉంటుంది గుంటుపల్లి. పుట్టడమైతే అక్కడే గానీ, పెరిగింది, చదువుకున్నది మొత్తం చాటపర్రులోనే. మా నాన్నగారు మాగంటి మాధవరావు గారు. వ్యవసాయం చేసేవారు. మా అమ్మ మాగంటి వసుమతీదేవిగారు. గృహిణి. మా నాన్నగారికి మొదటినుంచి రాజకీయాలమీద ఆసక్తి మెండుగా ఉండేది. ఆయన కాంగ్రెస్ పార్టీలో ఉండేవారు. స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు.

### విదేశీ వస్త్ర దహనం

### మెడలో బంగారం గాంధీకి విరాళం

మా నాన్నగారే కాదు.. మా ఇంట్లో చాలా మంది స్వాతంత్ర్యసమరయోధులున్నారు. మా పెద్దమ్మ (పెదనాన్నగారి భార్య) మాగంటి అన్నపూర్ణాదేవిగారు కూడా స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్నారు. ఒకసారి గాంధీమహాత్ముడు ఏలూరు వచ్చారు. ఆ రోజు మా పెద్దమ్మ మాగంటి అన్నపూర్ణాదేవిగారు అక్కడికి వెళ్ళారు. మాది ధనిక కుటుంబం కావడంవల్ల ఆ రోజుల్లో మా పెద్దమ్మ అన్నీ ఫారిన్ చీరలే కట్టేది. గాంధీగారు ఏలూరు రావడం, ప్రత్యక్షంగా ఆవిడ గాంధీగారి ప్రసంగం వినడంతో ఎంతో స్ఫూర్తిపొందారు. వెంటనే ఇంటికి కబురు పంపించి, ఇంట్లో ఉన్న విదేశీ వస్త్రాలన్నీ తెప్పించి నడిరోడ్డుమీద కుప్ప గాపోసి తగులబెట్టేసింది. ఆ క్షణంనుంచి మా పెద్దమ్మ జీవితాంతం ఖద్దరు దుస్తులే ధరించారు. అలాగే ఒంటిమీద ఉన్న బంగారం మొత్తం తీసేసి గాంధీగారికి విరాళంగా అందజేసింది. అలాంటి ఉన్నతభావాలుగల ఆదర్శ కుటుంబం మాది. మా కుటుంబంలో అందరికీ రాజకీయ చైతన్యం చాలా ఎక్కువ. మా పెదనాన్నగారు మాగంటి బాపినీడుగారు కూడా స్వాతంత్ర్యసమరంలో పాల్గొన్నారు. అప్పట్లో ఆయన్ను రాజమండ్రి జైలులో నిర్బంధించారు. బాపినీడుగారు మా సొంత పెదనాన్నగారు కాదు. మా నాన్న, ఆయన కజిన్స్ అన్నమాట. వాళ్ళకి ఇంకో కజిన్ మాగంటి సీతయ్యగారు కూడా స్వాతంత్ర్య సమరయోధుడే. వీళ్ళందరూ కలిసి అప్పట్లో చాలా పోరాటాల్లో పాల్గొనేవారు. ఆ మాటకొస్తే స్వాతంత్ర్య సమరయోధులు మా ఊరులోనే ఎక్కువ. మా చుట్టుపక్కల గ్రామాలన్నింటిలోకీ మా చాటపర్రు చాలా అభివృద్ధి చెందిన గ్రామం. మా గ్రామస్థులకు రాజకీయ చైతన్యం ఎక్కువగా ఉండేది. అందరూ మంచి వ్యవసాయదారులు. ఒక్క మాటలో చెప్పాలంటే ఆ రోజుల్లో మా చాటపర్రు మంచి ధనికవంతమైన గ్రామం.

**స్వాతంత్ర్య పోరాటం ఉధృతంగా సాగుతున్న రోజులవి. దేశం స్వాతంత్ర్య కాంక్షతో రగిలిపోతోంది. ఊరూరా పోరాట చైతన్యమే. వ్యవసాయపరంగా స్వతహాగా అభివృద్ధి చెందిన ఆ గ్రామంలో రాజకీయ చైతన్యం మరీ ఎక్కువ. చెప్పాలంటే ఆ చుట్టుపక్కల అన్ని గ్రామాలకంటే ఆ గ్రామంలోనే స్వాతంత్ర్య సమరయోధులు ఎక్కువగా ఉండేవారు. పైగా ఆ కుటుంబంలో మరీనూ.. స్త్రీపురుషులందరూ స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొన్నవారే...!**

### జెండా రెపరెపలు..

బ్రిటీష్ పాలన నుండి విముక్తి పొంది మన దేశానికి స్వాతంత్ర్యం రావడం నాకు ఇంకా బాగా గుర్తు. అప్పుడు నాకు ఏడేళ్ళు. భారతదేశానికి స్వాతంత్ర్యం ప్రకటించారని తెలియగానే మా ఊళ్ళో ఆనందానికి అవధులు లేవు. జెండాలు ఎగరేసుకుని, ఒకరికొకరు తీపి మిఠాయిలు పంచుకుని ఆ రోజును చాలా ఉత్సాహంగా, ఒక పండుగలా చేసుకున్నారు. ఆ రోజుల్లో మా నాన్నగారు సిగరెట్ కాల్చేవారు. ఒకటీ అరా కాదు, అప్పటికే ఆయన చైన్ స్మోకర్. అప్పట్లో ప్లేయర్స్ కిట్ అని టిన్స్‌లో వచ్చేవి సిగరెట్లు. వాటిని కాల్చేవారు. ఓ రోజు సిగరెట్ వెలిగించుకుని, వాలు కుర్చీలో కూర్చుని సావధానంగా సిగరెట్ కాలుస్తున్నారు. రేడియోలో వార్తలు మొదలయ్యాయి. గాంధీగారిని కాల్చేశారని, ఆయన చనిపోయారని మొదటి వార్తలోనే చెప్పారు. అప్పట్లో టీవీలు, వంటివి లేవు కదా.. ఏదైనా రేడియోలో వస్తేనే వార్త. వెంటనే ఒక్కక్షణం మా నాన్న ముఖం జేవురించినట్లైంది. ఆ వార్త విని ఆయన తట్టుకోలేకపోయారు. వెంటనే చేతిలో ఉన్న సిగరెట్ ఆర్పేశారు. 'ఎవరక్కడా' అని పిలిచారు. అక్కడున్నవాళ్ళు రాగానే, 'సిగరెట్ టిన్ వాళ్ళకి ఇచ్చేసి అందరికీ పంచేయండి, ఈ క్షణం నుంచి నేను సిగరెట్ కాల్చను. వదిలేస్తున్నాను' అన్నారు. గాంధీజీ మరణవార్త ఆయన్ను కలచి వేసింది. ఆ బాధతో నాన్నగారు సిగరెట్ మానేశాడు. ఆ తర్వాత ఎప్పుడూ ఆయన సిగరెట్ వెలిగించడం నేను చూడలేదు. మా నాన్నగారు మనసులో ఓ మాట అనుకుంటే ఎంత దృఢనిశ్చయంతో ఆ మాటకు కట్టుబడి ఉండేవారో చెప్పడానికే ఇదంతా చెప్పా.



### బిజినెస్‌మ్యాన్ కావాలనుకున్నా

గాంధీగారు చనిపోయిన కొన్నాళ్ళకి మా నాన్నగారు చాటపర్రులో వ్యవసాయం వదిలేశారు. అప్పుడు నేను ఎలిమెంటరీ స్కూల్లో చదువుతున్నా. ఆదిలాబాద్ జిల్లాలో ఫారెస్ట్ కాంట్రాక్ట్‌లు చేయడం మొదలుపెట్టారు. అప్పటికే మా మేనమామలు ఎక్కువగా బిజినెస్‌లో ఉండేవారు. మా నాన్న తోడల్లుళ్ళు.. అంటే మా చిన్నాన్నలు కూడా బిజినెస్‌లోనే ఉండేవారు. పెద్దయ్యాక పెద్ద బిజినెస్‌మ్యాన్ కావాలని అప్పటి నుంచే నా మనసులో కోరిక ఉండేది. కానీ నన్ను ఇంజనీర్‌ని చేయాలన్నది మా నాన్నగారి కోరిక.

**(ఇంకా ఉంది)**

**డా. చల్లా భాగ్యలక్ష్మి**
**సెల్: 88850 55528**



6

# నిధి

-వక్కంతం సూర్యనారాయణరావ్ సెల్: 98662 67287

**"నిధీ, నువ్వు కొంచెం ఎడంగా జరుగు!" శ్వేతాశ్వానికి కళ్ళెం బిగించి జీను సర్దిన నిధికి అశ్వత్థామ హెచ్చరిక వినిపించింది. నిధి అశ్వపాలకుడి వైపు చూశాడు. తిరుగుబాటు చేయకుండా, బుద్ధిగా నిలబడిన అశ్వాన్ని నోరు వెళ్ళబెట్టి చూస్తున్నాడతను. అతనికి అశ్వత్థామ కంఠం వినిపించి నట్టు లేదు! ఆయన తనని ఉద్దేశించి మాట్లాడుతున్నాడు. అందువల్ల తనకు మాత్రమే ఆయన కంఠధ్వని వినిపించేలా ఉంది!**

జీను సర్దేసి, నిధి దూరంగా జరిగాడు. అతని చూపులు గుర్రం మీదే ఉన్నాయి. ఎందుకో ఒక్క సారిగా గుర్రం శరీరం జలదరించింది. తోక ఆవే శంగా అటూ ఇటూ బంగారు రంగు వింజామరలా కదిలింది. చెవులు నిక్కబొడుచుకున్నాయి. తల దేనికో అంగీకరిస్తున్నట్లు క్రిందికీ పైకీ ఊగింది.

"నిధీ, అశ్వాన్ని తీసుకువెళ్ళు. ఈ క్షణం నుండీ నువ్వు నడవమన్నట్టు నడుస్తుంది, ఆడమన్నట్టు ఆడుతుంది! గుర్రం మీద చెయ్యిచేసుకోవడం కాదు కదా, ఈగను కూడా వాలనీయవద్దు సుమా!" అశ్వ త్థామ హెచ్చరిస్తూ అన్నాడు.

"అలాగే ఆర్యా!" నిధి అన్నాడు.

అశ్వపాలకుడు కళ్ళు చిట్లించాడు. "ఏమిటో అన్నారు; నన్ను ఉద్దేశించే అన్నారా?"

నిధి నాలుక కరుచుకున్నాడు. "అబ్బే... నిన్ను కాదు.. గుర్రాన్ని అడిగాను ఆర్యా అననా అని!"

"తెల్లగుర్రానికి మహారాజుగారెప్పుడో నామ కరణం చేశారు. దాని పేరు 'వాయు'. ఆ పేరుకే స్పందిస్తుంది!"

"ఓహో! జవనాశ్వం అన్నావు కదా! వేగానికి తగిన పేరు! ఆ పేరుతోనే పిలుస్తాను!" నిధి నవ్వుతూ అన్నాడు. "తలుపు తెరిస్తే వెళ్ళిపోతాను.."

"భయం లేదా? తలుపు తెరిచి నేను దూరంగా వెళ్ళేదాకా గుర్రాన్ని బైటికి తీసుకురాకు!" అశ్వపాల కుడు ముందు జాగ్రత్తతో అన్నాడు.

"శ్వేతాశ్వం నాకు మచ్చిక అయిపోయింది. భయపడకు!" నిధి ధైర్యం చెప్పాడు.

"నా భయం అదే! అంత త్వరగా మచ్చికై పోయిందే; ఎంత త్వరగా తిరగబడుతుందో అని!" అంటూ కటకటాల గొళ్ళెం తీసి, దూరంగా పారి పోయాడు అశ్వపాలకుడు.

నిధి కళ్ళేన్ని వదులుగా తన భుజం మీద వేసు కుని, బైటికి నడిచాడు. "వాయూ! రా వెళ్దాం!" అంటూ ముందుకు అడుగులు వేశాడు. వాయు వినయంగా అతని వెంట ఠీవీగా నడవసాగింది. అశ్వపాలకుడు నోరు వెళ్ళబెట్టి చూస్తూ ఉండిపోయాడు.

శ్వేతాశ్వం నిధి వెనకాలే, గోవు వెంట దూడలా వినయంగా వెళ్తోంది. వందలాది గుర్రాల సకిలింత లతో అంతసేపూ మారుమోగిన ప్రాంగణంలో ఇప్పుడు సకిలింతలు లేవు. గుర్రాలు అటూ ఇటూ యథేచ్ఛగా సంచరిస్తున్నాయి. ఆశ్చర్యం నుండి తేరుకున్న అశ్వపాలకుడు గుర్రాల మధ్య వేగంగా వెళ్ళి, కటకటాల తలుపు తెరిచాడు. నిధి గుర్రంతో పాటు కటకటాల అవతలికి వెళ్ళాడు. తలుపు వెంటనే మూసుకుంది. నిధి ఆగి, వెనుదిరిగి చూశాడు. చాలా గుర్రాలు గోడ అటువైపు నుండి మోరలు పైకెత్తి శ్వేతాశ్వాన్ని చూస్తున్నాయి. నిధి అశ్వపాల

## జరిగిన కథ

బాకీపడ్డ కప్పం వెంటనే చెల్లించాల్సిందిగా సుభిక్ష రాజ్య మహారాజు నందికేశ్వరుడికి చక్రవర్తి విజయానందులు లేఖ పంపిస్తాడు. జ్యోతిష్కుడు సూచించిన పరిష్కారం ప్రకారం నవనిధులను సాధించాల్సిందిగా నిధిని కోరతాడు మహారాజు. అశ్వత్థామ అదృశ్య రూపంలో ఉంటూ నిధికి అండగా నిలుస్తానని చెబుతాడు. దాంతో నవనిధుల సాధనకు తాను సిద్ధమని మహారాజుకు తెలియజేస్తాడు నిధి. జ్యోతిష్కుని ద్వారా నవనిధుల వివరాలు తెలుసుకుంటాడు. అశ్వశాలలో, అశ్వత్థామ నిధిని శ్వేతాశ్వాన్ని తీసుకోమంటాడు. ఆ తర్వాత...

కుడికి చిరునవ్వుతో ధన్యవాదాలు చెప్పాడు. గజశాల ఆవరణగుండా వెళ్ళి, ప్రధాన ద్వారం దాటాడు.

రాజవీధిలో శ్వేతాశ్వం వాయు, రాజసం ఉట్టిపడేలా నడుస్తోంది. దానిమీద నిధి ఠీవీగా కూర్చున్నాడు. రాచవీధిలో అటూ ఇటూ వెళ్తున్న జనం గుర్రాన్నీ, నిధినీ ఆశ్చర్యంగా చూస్తున్నారు. వీరదశమినాడు ప్రత్యర్థి కేసరిని చిత్తుచేసిన నిధి అందరికీ తెలుసు. ముత్యాలు విసిరికొట్టినందుకు నొచ్చుకున్న మహారాజుగారు యోధుడైన నిధికి శ్వేతాశ్వాన్ని బహుమతిగా ఇచ్చి ఉంటారనుకుంటున్నారు జనం.

***

తెల్లగుర్రం ఆవరణలోకి ప్రవేశించింది. నవనీత లేడిలా గెంతుతూ, ఉత్సాహంగా అరుస్తూ ఎదురుగా వచ్చింది. నిధి గుర్రం దిగి, సుడిగాలిలా వస్తున్న చెల్లెలి కోసం సిద్ధంగా ఉన్నాడు. చూడగానే గాలిలా దూసుకురావడం, సమీపించగానే అలసటతో తన మీదికి వాలిపోవడం నవనీత అలవాటు!

లేగదూడలా వేగంగా వచ్చి, తటాలున ఆగి సోలిపోతున్న చెల్లెల్ని పొదివి పట్టుకున్నాడు నిధి.

"ఎంత తెల్లగా ఉందో మల్లెపువ్వులా!" నవనీత అంది.

"ప్రత్యేకంగా ఎన్నిక చేసి, ఎక్కి వచ్చాం!" నిధి అన్నాడు గర్వంగా.

"ఆ బంగారు గీతేంటి అన్నాయ్?" నవనీత గుర్రం మీదున్న గీతను చూస్తూ అడిగింది. "ముట్టుకోవచ్చా?"

నిధి మాట్లాడకుండా చెల్లెలి కందిరీగ నడుమును రెండు చేతుల్తో పట్టుకున్నాడు. ఏం జరుగుతోందో నవనీత ఊహించేలోగా, ఆమెను అవలీలగా బొమ్మను ఎత్తినట్టు ఎత్తి గుర్రం మీద కూర్చోబెట్టాడు. నవనీత కేరింత కొడుతూ, అప్రయత్నంగా కళ్ళేన్ని పట్టుకుంది. నిధి ఆమెను వదిలేసి ముందుకు నడిచాడు. గుర్రం నిధిని, నీడలా అనుసరిస్తోంది.

"అన్నాయ్!"

నిధి ఆగాడు. తిరిగి చూశాడు. అతను ఆగగానే గుర్రం ఆగింది.

"ఇదేంటన్నాయ్, నువ్వు సాగితే సాగుతుంది. ఆగితే ఆగుతుంది? ఇంత త్వరగా ఎలా నేర్పించావు?"

"నేను నేర్పలేదే! అది మన మంత్రం మహిమ!" నిధి నవ్వుతూ అన్నాడు.

"మంత్ర మహిమా!! ఇదిగో నీ మంత్ర మహిమను మాయం చేస్తా!" నవనీత ఉల్లాసంగా అంది.





## డ్రగ్స్ ఎలా ఉంటాయో చెప్పమంటోంది

**టా**లీవుడ్ మొత్తం డ్రగ్స్ ప్రకంపనలతో వణికిపోతుంటే సొట్టబుగ్గల తాప్సీ మాత్రం తనకు డ్రగ్స్ గురించి తెలియదంటోంది. సినిమాల్లో వీటిని చూడడమే తప్ప నిజజీవితంలో చూడలేదట! వీటిని వాడితే ఎలా ఉంటుందో చెప్పమని చాలామందిని అడిగిందట...కానీ ఎవరూ సరైన సమాధానం చెప్పలేదట! తనకు పబ్బులకు పార్టీలకు వెళ్ళే అలవాటు లేదనీ, అందుకే తనకు వీటి గురించి తెలియదనీ అంటోంది. అయితే ఢిల్లీలో పెరిగిన తాప్సీకి డ్రగ్స్ గురించి తెలియదంటే నమ్మేటంత అమాయకులు ఎవరూ లేరని సినీ జనాలు అంటున్నారు.

నిధి గడపముందు పక్కపక్కనే నిలుచుని ఉత్సాహంగా చూస్తున్న తల్లిదండ్రుల వైపు చిరునవ్వు నవ్వుతూ కదిలాడు. గుర్రం కదిలింది. నవనీత కళ్ళెం బిగబట్టి ఆపే ప్రయత్నం చేసింది. గుర్రం ఆగలేదు. నిధి వెంట ఠీవీగా నడుస్తోంది. మంత్రమహిమ.

"శ్వేతాశ్వం... చాలా అందంగా ఉంది నాన్నా... కొన్నావా? ఎంత?" తల్లి ప్రశ్నించింది.

నిధి ఆమెను చిరునవ్వుతో చూశాడు. "మహారాజు గారి కానుక!"

"కానుకేమిటి కానుక! దివాణానికి నీతో అవసరం కలిగింది. అందుకు ఇచ్చి ఉంటారు. పని ముగించుకుని, తిరిగి రాగానే తీసుకుంటారు!" అరుంధతి చిన్నగా నవ్వింది.

"అమ్మ మాట అబద్ధం కాదేమో!" నిధి చిరునవ్వుతో అంటూ నవనీతను గుర్రం మీద నుంచి దింపాడు.

"అన్నాయ్... మన గుర్రానికి పేరుందా? పెట్టనా?" నవనీత అడిగింది.

"మహారాజుగారెప్పుడో నామకరణం చేసేశారు. ఇది జవనాశ్వం! అంటే ఏమిటో తెలుసా? మహా వేగంగా వెళ్ళే అశ్వం. అంచేత 'వాయు' అనే సార్థక నామధేయం పెట్టారు. ఆ పేరుకి గుర్రం బాగా అలవాటు పడిపోయింది కూడా!"

"అలాగా!" నవనీత గుర్రం వైపే చూస్తూ అంది. "వాయూ.." అంటూ పిలిచింది. గుర్రం ఆమె వైపు తలతిప్పి చూసింది.

"ఔనన్నాయ్! నువ్వు చెప్పింది నిజమే! గుర్రానికి నేను ఏదైనా తినిపించాలి. పాపం, నన్ను కాసేపు మోసిందిగా. ఏం పెట్టమంటావ్?"

"అభ్యూషం"

"ఏంటీ?" నవనీత కళ్ళు చిట్లిస్తూ అంది.

"అభ్యూషమే! అంటే ఏంటో తెలీదా? గుగ్గిళ్ళు! వెళ్ళు. శనగలు చక్కగా ఉడికించి గుగ్గిళ్ళు సిద్ధం చెయ్.."

"గుగ్గిళ్ళు అని ముందే చెప్పొచ్చుగా.." నవనీత దెప్పుతున్నట్టు అని ఇంట్లోకి పరుగెత్తింది.

"వాహనం కూడా వచ్చిందంటే సాహసయాత్ర చేయబోతున్నావన్నమాట!" అరుంధతి కొడుకుతో అంది.

"వెళ్ళక తప్పదు. కన్నతల్లి 'వీరమాత' అని నిరూపించాలిగా... ఏం నాన్నా?" నిధి ఉత్సాహంగా అన్నాడు.

"ఔనౌను! నిరూపించాల్సిందే! ఎన్ని యుద్ధ విద్యలు నేర్పినా, ఎంతో గొప్ప వీరుడిగా రూపొందించినా తండ్రిని 'వీరపిత' అని అనరుగా!" కర్దముడు అసూయ నటిస్తూ అన్నాడు. "మగబతుకే అంత! తల్లి వీరమాత! పెళ్ళాం వీరపత్ని! అంతే!"

"ఎంతైనా తల్లి తల్లే... భార్య భార్యే..." అరుంధతి కంఠంలో లీలగా గర్వం ధ్వనించింది.

"కాదనే మొనగాడెవడు? మొగుడి వల్ల అంటే ఈ మహావీరకర్దముడి వల్ల 'వీరపత్ని' అయ్యావు. కొడుకు వల్ల 'వీరమాత' అవబోతున్నావు..."

"నేనిప్పటికే వీరమాతనూ అయిపోయాను. వీరదశమినాడు వీరకేసరి కొడుకు 'మహావీర కేసరి'ని నా కొడుకు మట్టి కరిపించాడు. కళ్ళారా చూశాను. మీరు రాలేదుగా. కొడుక్కి గాయాలవుతాయేమో అన్న పిరికితనంతో మందు నూరుతూ కూచున్నారు." అరుంధతి నవ్వింది.

"నాయనా నిధీ, నీ వీరమాతను ఇంట్లోకి తీసుకెళ్ళు... కడిగేస్తోంది." కర్దముడు నవ్వాడు.

అరుంధతీ, నిధీ ఇద్దరూ నవ్వారు.

"ఎప్పుడు నాయనా, నీ ప్రయాణం?" అరుంధతి అడిగింది.

"అమ్మ చేతివంట అమృతం" అన్నారుగా అమ్మా, కడుపారా భోంచేసి.."

"నవమి ఘడియలొచ్చేశాయి. రేపు సూర్యోదయం వేళకి శుభఘడియలున్నాయి. ఆ సమయంలో ప్రయాణం మంచిది. అప్పుడు బయల్దేరుతున్నావ్!" కర్దముడు అన్నాడు.

"అలాగా! అలాగే నాన్నా!" అంటూ గుర్రాన్ని నీడపట్టుకు తీసుకెళ్ళాడు నిధి. అరుంధతి ఇంట్లోకి వెళ్ళింది. కర్దముడు గున్నమామిడి చెట్టు కిందున్న అరుగువైపు అడుగులు వేశాడు. అరుగుమీద కూర్చుని, నిధి వైపు చూశాడు. నిధి శ్వేతాశ్వాన్ని నిమురుతున్నాడు. అతని చేతి మీద కండరాలూ, నరాలూ కదులుతూ కనిపిస్తున్నాయి. తన కొడుకుది కండలు తిరిగిన శరీరం. నిరంతర వ్యాయామం, ఖడ్గయుద్ధంలో, గదాయుద్ధంలో, ముష్టియుద్ధంలో క్రమం తప్పని సాధనా అతని శరీరాన్ని ఆరోగ్య విగ్రహంలా ఉంచాయి. భయం లేదు... నిధి నిధిని అదే నిధుల్ని మూటకట్టి తెస్తాడు. నిధి స్థానంలో తను ఉండి ఉంటే, మహారాజు కోరితే నవనిధి సాధనకు వెళ్ళకుండా ఉండేవాడు కాదు! అర్థించే వ్యక్తి బలవంతుడైనా, బలహీనుడైనా సహాయం చేయడం మానవ ధర్మం అయినప్పుడు అది వీరుడి విధి! తన కొడుకు వీరుడు. విధి నిర్వహణకు వెళ్తున్నాడు. 'విజయోస్తు!' అని దీవించడం తన విధి! కర్దముడు సగర్వంగా గుండె నిండుగా ఊపిరి పీల్చుకున్నాడు.

***

పూజా గృహంలో విగ్రహాల ముందు దీపాలు

**పూజాగృహంలో పూజ ముగిసింది. కర్పూర నీరాజనం సమర్పించాడు కర్దముడు. నిధి కళ్ళకద్దుకున్నాడు. మొన ఉత్తరంవైపు ఉండేలా పెట్టబడి ఉన్న ఖడ్గానికి కూడా ప్రత్యేకంగా నీరాజనం సమర్పించాడు. ఇక నిధి బయల్దేరడమే తరువాయి. ఇంతలో తలుపు చప్పుడైంది. వాకిట నిలుచున్న వ్యక్తిని చూసి ఆశ్చర్యచకితుడయ్యాడు నిధి. వచ్చింది ఎవరు?**

వెలుగుతున్నాయి. నేతివాసన కమ్మగా వ్యాపిస్తోంది. పూజ ముగించిన కర్దముడు పీట మీద నుండి లేచాడు. గంట వాయిస్తూ కర్పూర నీరాజనం సమర్పించాడు. అరుంధతీ, నవనీతా, నిధీ నీరాజనాన్ని కళ్ళకద్దుకున్నారు. నిధి చూపులు విగ్రహాల మీద నుండి, వాటిముందు, మొన ఉత్తరంవైపు ఉండేలా పెట్టబడి ఉన్న ఖడ్గం మీదికి మళ్ళాయి. పసుపు, కుంకుమ, అక్షతలు, పువ్వులు ఖడ్గం మీద అలంకరించి ఉన్నాయి. కత్తిమొనకు నిమ్మకాయ గుచ్చబడి ఉంది. కర్దముడు పళ్ళెంలో కర్పూరం ఉంచి, మళ్ళీ వెలిగించాడు. ఖడ్గానికి నీరాజనం ప్రత్యేకంగా సమర్పించాడు. పళ్ళేన్ని ఖడ్గం ముందు ఉంచాడు. అందరూ కళ్ళకద్దుకున్నారు.

కర్దముడు నిధి వైపు చూశాడు. "నిధీ, నీకు తెలుసు. ఇది మన తాతముత్తాతల నాటి ఖడ్గం. తరతరాల నుండీ పరంపరగా వస్తున్న రక్షణ సంపద ఇది. తీసుకో. శ్రేష్ఠమైన ఆయుధం. అచ్చివచ్చిన ఆయుధం. దీనిని దుర్వినియోగం చేయకు. ఆత్మరక్షణకు ఉపయోగించు!"

అక్షతలనూ, పుష్పాలనూ నెమ్మదిగా కిందికి రాలుస్తూ, నిధి కత్తిని అందుకున్నాడు. రెండు చేతుల్లో పట్టుకుని కళ్ళకు అద్దుకున్నాడు. నుదుర్ని కత్తిమీద ఆన్చాడు. ఆయుధ దేవత అయిన దేవిని స్మరించాడు. తండ్రివైపు చూశాడు.

"నేను ఎవ్వరిమీదకూ దండయాత్రకు వెళ్ళడం లేదు నాన్నా! ఈ ఖడ్గం ఆత్మరక్షణకే అంకితం!"

"శుభం! విజయోస్తు!" తన పాదాలంటి నమస్కరిస్తున్న నిధిని దీవిస్తూ అన్నాడు కర్దముడు.

"అమ్మా!" అంటూ నిధి తల్లి పాదాలకు నమస్కరించాడు.

"క్షేమంగా వెళ్ళి, క్షేమంగా, లాభంతో రా తండ్రీ!" అరుంధతి ఆశీర్వదిస్తూ అంది.

నవనీత నిధి దగ్గరగా జరిగి, అతని చేతిలోని కత్తికి నమస్కరించింది.

"నిన్ను రక్షిస్తూ ఉండమని కత్తికి మొక్కుకున్నాను అన్నాయ్" అంది నవ్వుతూ.

"అమ్మానాన్నల ఆశీస్సులూ, నీ మొక్కులూ తోడు! ఇంక నాకు భయమేంటి?" నిధి నవ్వుతూ అన్నాడు.

అరుంధతి గోడలో ఉన్న అరలోంచి చిన్న బాకును దాని ఒరతో బాటు ఇవతలికి తీసింది. నిధి వైపు తిరిగింది. "ఇది నా ఆత్మరక్షణ కోసం మా అమ్మ నాకు పెళ్ళికానుకగా ఇచ్చింది. బాకును జాగ్రత్తగా ఉంచుకో. ప్రతీ చిన్న అవసరానికి అంతపెద్ద కత్తి ఉపయోగించలేవుగా!"

అమ్మ అందించిన బాకును తీసుకుని, దట్టీలో దోపుకున్నాడు నిధి. అమ్మ చెప్పింది నిజమే. చిన్న చాకులాంటి ఆయుధం అవసరమే తనకు. ప్రయాణ సమయంలో కాయల్నీ, పళ్ళనీ కోయడానికి ఉపయోగపడుతుంది.

"ఆ బాకుని భద్రంగా తిరిగి తేవాలి. దాన్ని మా అమ్మ తన కూతురికి ఇచ్చినట్టు, నేను నా కూతురికివ్వాలి!" అరుంధతి అంది.

నిధి చిరునవ్వుతో తలాడించాడు.

"ఇంక నీ కొడుక్కి అన్నం పెట్టు. నాలుగు ముద్దలు తిని బయల్దేరుతాడు. సూర్యోదయం అవుతున్నట్టుంది" కర్దముడు అన్నాడు.

***

ఇంటిముందు తలుపు చప్పుడైంది. పూజా గృహంలోంచీ కర్దముడూ, అరుంధతీ, నిధీ, నవనీతా ఇవతలికి వచ్చారు.

"ఎవరో చూడమ్మా!" అంది అరుంధతి.

"నవనీత గుమ్మం వైపు పరుగెత్తింది. కాలి అందెలు ఆమె నడకలోని లయను ప్రతిధ్వనిస్తున్నట్టు సవ్వడి చేస్తున్నాయి. నవనీత తలుపు తెరచి, గుమ్మంలో నిలుచున్న వ్యక్తిని ప్రశ్నార్థకంగా చూసింది. ఎప్పుడో, ఎక్కడో చూసిన ముఖం. అయినా, ఎవరో పోల్చుకోలేకపోతోందామె.

"కర్దముడు గారున్నారమ్మా?"

"ఉన్నారు..."

"ఆస్థాన జ్యోతిష్కుడు ముక్కంటి వచ్చాడని చెప్పు తల్లీ!"

నవనీత గిరుక్కున వెనక్కి తిరిగింది. "నాన్నా!" అని అరుస్తూ లోపలికి పరుగెత్తింది. పిలుపు విని ఎదురుగా వస్తున్న తండ్రికి ఎవరొచ్చారో చెప్పింది. కర్దముడు వేగంగా వీధి గుమ్మం వైపు వెళ్ళాడు.



"దయచేయండి! దయచేయండి!" ముక్కంటిని ఆహ్వానించాడు కర్దముడు, నమస్కారం చేస్తూ.

ముక్కంటి గడపదాటి లోనికి అడుగుపెట్టాడు, ప్రతి నమస్కారం చేస్తూ.

"పెందరాళే నా గృహాన్ని పావనం చేశారు. కూర్చోండి."

ముక్కంటి చిన్నగా నవ్వాడు. "పాదం మోపి గృహాలను పావనం చేసేంత శక్తి ఈ సామాన్యుడికి లేదు. మిమ్మల్నీ, మీ ధర్మపత్నిగారినీ, మీ సంతానాన్నీ చూసిపోదామని వచ్చాను.."

"చాలాసంతోషం!" కర్దముడు అన్నాడు. "నిధీ... చెల్లాయీ, అమ్మా, నువ్వూ ఇలా రండి!" అంటూ ఇంటి లోపలికి కేకవేసి, ముక్కంటి వైపు చూశాడు. "అబ్బాయి కాస్సేపట్లో బయలుదేర బోతున్నాడు.."

"అది ఊహించే, ఇలా వచ్చాను" ముక్కంటి కూర్చుంటూ అన్నాడు. ఇవాళ దశమి. తిథి వార నక్షత్రాలు ప్రయాణానికి, ప్రత్యేకించి మన నిధి వెళ్తున్న కార్యార్థం చేసే ప్రయాణానికి ప్రశస్తగా ఉన్నాయి. మీరు ఈ ముహూర్తాన్నే ఎన్నిక చేస్తారని తెలుసు".

"సమయానికి దయచేశారు. 'విజయోస్తు' అని అబ్బాయిని దీవించండి!"

"నా రాకకు అది కూడా కారణమనుకోండి మిత్రమా!"

"నిధీ, నవనీతా, అరుంధతీ వచ్చారు. నిధి ఆయన్ని చూడగానే చిరునవ్వుతో నమస్కరించాడు.

"అరుంధతీ, వీరు ఆర్య ముక్కంటిగారు. ఆస్థాన జ్యోతిష్కులు. నమస్కరించు! నవనీతా నువ్వు కూడా!" కర్దముడు అన్నాడు.

"దీర్ఘసుమంగళీభవ! కలకాలం చల్లగా ఉండు తల్లీ!" ముక్కంటి తనకు నమస్కరించిన అరుంధతినీ, నవనీతనూ దీవించాడు. ఏదో చెప్పబోతున్నట్టు కర్దముడినీ, నిధినీ కలియ జూశాడు.

## ఇంకెంత కాలమో తెలియదట!

పాత తరం హీరోయిన్లలాగా కొత్త హీరోయిన్లు ఎవరూ సంవత్సరాల తరబడి సినిమాలు చేయడంలేదు. పదుల సంఖ్యలో సినిమాలు చేసి ఐదారు సంవత్సరాలకే తెరమరుగు అవుతున్నారు. వారికి భిన్నంగా రకూల్ ప్రీత్ సింగ్ ఇప్పటికీ చేతినిండా సినిమాలతో మరో రెండు మూడు సంవత్సరాల వరకూ బిజీగానే ఉంది. దీనికి కారణం కూడా చెప్పింది రకూల్. ఇక్కడ ఎక్కువ కాలం కొనసాగాలంటే ప్రేక్షకుల ఆదరణ తప్పనిసరి అన్నది అందరికీ తెలిసిందే! తనకి ఆ ఆదరణ పుష్కలంగా ఉన్నందువలనే సినిమాలు చేయగలుగుతోందట! ఈ ఆదరణ ఎంత కాలం ఉంటుందో తెలియదంటోంది.

"నిజానికి, మీ కుటుంబంలో అందరినీ కలుసుకోవాలనే వచ్చాను. ముక్కంటి ప్రారంభించాడు. "మహారాజుగారి ఆజ్ఞ..."

"రాజాజ్ఞా!" కర్దముడు ఆశ్చర్యంగా అన్నాడు.

"రాత్రి పొద్దుపోయాక మహారాజుగారు నన్ను పిలిపించారు. ఆ సమావేశంలో ఉండాల్సిన వాళ్ళంతా ఉన్నారు. మీ అందరికీ ఒక సందేశం అందచేయమన్నారు."

అందరూ ప్రశ్నార్థకంగా చూస్తున్నారు.

"ప్రస్తుతం మన నిధి ప్రయాణ లక్ష్యం మనందరికీ తెలుసు. అది అతి రహస్యం. ప్రస్తుతం ఆ రహస్యం కేవలం తొమ్మండుగురికే తెలుసు. మహారాజు, మహామంత్రి, రాజగురువు, సేనాని, ఈ ఆస్థాన జ్యోతిష్కుడూ కలిపి అయిదుగురు, మీ కుటుంబ సభ్యులు నలుగురు వెరసి తొమ్మండుగురు. అంతే!" ముక్కంటి ఆగి 'అంతేగా?' అన్నట్టు చూశాడు.

కర్దముడు అవునన్నట్టు తలాడిస్తున్నాడు. 'ఇంకా ఒకరున్నారు. వెరసి పది, నాకు తెలిసినంతవరకూ. రాకుమారితో పాటు ఇంకా ఎవరికైనా తెలుసేమో నాకు తెలీదు' నిధి తనలో అనుకుని, లోపల్లోపలే నవ్వుకున్నాడు. 'అతిరహస్యం బహిరంగ రహస్యం' అని అనుభవజ్ఞులు ఊరికే అన్నారా!!

"నిధుల ఉనికి గురించీ, వాటి సంపాదన ప్రయత్నం గురించీ, నిధి ప్రయాణం గురించీ మరొకరికి తెలియడానికి వీలులేదంటూ ఆజ్ఞాపించారు మహారాజుగారు. మీరు మీ కుమారుడి సంసిద్ధతను మనవి చేసుకున్న శుభసమయంలో ఆనందోత్సాహాల ఉధృతిలో జాగ్రత్త చెప్పడం ప్రభువులు మరిచిపోయారు. మరొకరికి తెలిస్తే పరిణామాలు తీవ్రతరంగా ఉంటాయని సౌమ్యంగానే సెలవిచ్చారు మహారాజుగారు.." అంటూ ముక్కంటి అరుంధతి వైపు చూశాడు.

"అమ్మా... మన నిధి క్షేమం కోసం, నవనిధుల లాభంకోసం మనందరం ఈ విషయంలో కఠిన మౌనం పాటించాలి. ముఖ్యంగా మీ మహిళలు ఇరుగుపొరుగు అమ్మలక్కలతో..."

"ఆ జాగ్రత్త మాలో మేం ఎప్పుడో అనుకున్నాం ఆర్యా! కర్దముడు నవ్వుతూ అన్నాడు. నవనిధుల క్షేమం లేదా లాభం ప్రభువులకు ఎంత ముఖ్యమో, మా వంశాంకురం నిధి క్షేమం మాకు వెయ్యింతలు ఎక్కువగా ముఖ్యం. విషయం బైటికి పొక్కితే, దోపిడీ దొంగలు, దురాశా పరులు, శత్రు రాజ్యాల సేవకులు మా వాణ్ణి క్షేమంగా తిరిగి రానిస్తారా?"

"ముచ్చటైన ముందుచూపు" ముక్కంటి ఉత్సాహంగా అన్నాడు.

"రాచకార్యం ఎప్పుడూ రహస్యమే!" కర్దముడు నవ్వాడు.

"కర్దముడు విషయం తెలిసిన విజ్ఞుడు అని నాకు తెలుసు!" ముక్కంటి అన్నాడు. "రాజుగారి శాసనం కదా! స్వయంగా నన్నే తెలియజేయమన్నారు. రహస్యంగా ఉంచమని హెచ్చరించమన్నారు. నా

## అయ్యలు-మియ్యలు-తకతెయ్యలు



అయ్యలు, మియ్యలు, తకతెయ్యలు అనే ఒక నానుడి పాలమూరుజిల్లాలో పూర్వం ఉండేదట. అయ్యలు అంటే కవులు, పండితులు, శాస్త్రజ్ఞులు, ఆధ్యాత్మిక ప్రబోధకులు మొదలైనవారు. వీరికి సంఘంలో గౌరవస్థానం ఉండేది. విశేషంగా గౌరవింపబడేవారు. కొందరు మహావిద్వాంసుల పాదధూళిని, సామాన్యప్రజలేగాక, రాజవంశీకులు కూడా భద్రపరచుకుని నొసట ధరిస్తూ ఉండేవారట!.

మియ్యలు అనగా ముస్లిం ప్రభువులు. వీరు గౌరవనీయులు.

తకతెయ్యలు అనగా నృత్య సంగీతాది శాస్త్రాలను క్షుణ్ణంగా అభ్యసించిన గణికలు. వీరికి కూడా సంఘంలో గౌరవస్థానం ఉండేది అని 'అర్థశతాబ్ద ఆంధ్రనాట్యం' గ్రంథంలో నటరాజ రామకృష్ణ పేర్కొన్నారు.

సేకరణ: ఎన్.తారకరామారావు

బాధ్యత నిర్వర్తించాను. మీరందరూ అతి జాగ్రత్తగా ప్రవరిస్తున్నట్టు మహారాజుగారికి మనవి చేస్తాను!"

పైకిలేస్తున్న ముక్కంటిని చూస్తూ, కర్దముడు కూడా లేచాడు. ముక్కంటి అందర్నీ కలియజూశాడు. కర్దముడి వైపు చిరునవ్వు నవ్వి, చూపులు తల్లీకూతుళ్ళ మీదికి మళ్ళించాడు.

"వెళ్ళొస్తాను తల్లీ! నేను చెప్పింది గుర్తుంచుకోండమ్మా!"

అరుంధతీ, నవనీతా తలలు ఊపారు.

"వెళ్ళొస్తాను, నమస్కారం!" కర్దముడితో అని, ముక్కంటి గుమ్మంవైపు నడిచాడు. తలుపు దగ్గర ఏదో ఆలోచన తట్టినట్టు ఆగి తిరిగి, నిధి వైపు తదేకంగా చూశాడు. "నాయనా నిధీ, గుర్తుంచుకో! రహస్యం నీకు రక్షణ కవచం!"

నిధి చిరునవ్వుతో చూశాడు. ముక్కంటి గడప దాటి వెళ్ళిపోయాడు. నవనీత మువ్వల సవ్వడిలో అడుగులు వేస్తూ వెళ్ళి, తలుపు మూసి గొళ్ళెం పెట్టింది.

"ఆయన మాటల్లో, ఆయన తెచ్చిన 'సందేశం'లో 'నోరు తెరిచేరు జాగర్త!' అనే బెదిరింపు వినిపించింది!" నవనీత ముగ్గుర్నీ ఉద్దేశిస్తూ అంది.

"మరొకరికి తెలిస్తే పరిణామాలు తీవ్రతరంగా ఉంటాయని మహారాజుగారు 'సౌమ్యంగానే హెచ్చరించినట్టు ముక్కంటిగారు మూడు ముక్కల్లో చెప్పారు కదా నవనీ!" నిధి నవ్వుతూ అన్నాడు.

"ఆయన మాత్రం ఏం చేస్తారూ!" కర్దముడు అన్నాడు. "మహారాజు మాటల్లో గుచ్చుకునే ముళ్ళని సేవకులు పువ్వులుగా మార్చి అందిస్తారు!"

"అదే నిజమనిపిస్తోంది!" అరుంధతి అంది.

"నవనిధుల్ని కనిపెట్టాలి, స్వాధీనం చేసుకోవాలి. అంతవరకు బాగానే ఉంది. నవనిధులు కదా? ఎన్ని ఏనుగులు మోయాల్సిన బరువుంటాయో... ఎలా నాన్నా?"

"రాజ్యం కోసం, ప్రజల కోసం సాహసం చేసి, సాధిస్తానన్నావుగా? మూటగట్టి మోసుకురా! నాన్నను అడుగుతావేం?" నవనీత దెప్పుతున్నట్టు అంది.

"ఊరికే అడిగాం... ఆ మాత్రం ఉపాయం ఆలోచించలేమా? పర్వతం అడ్డొచ్చినప్పుడు ఎక్కుతాం, సముద్రం అడ్డొచ్చినప్పుడు దాటుతాం... తెలుసా?" నిధి నవ్వుతూ అన్నాడు.

"రారా నాయనా! అదెప్పుడూ ఇంతే! నిన్ను చూసినప్పుడల్లా అలా ఉలికి పడుతూనే ఉంటుంది. ఎవడు కట్టుకుంటాడో.. కట్టుకుని ఎలా వేగుతాడో!"

"నవనీని వేపుకుతినే మొనగాణ్ణి వెదికి పట్టుకొస్తానమ్మా! మొగుణ్ణి వెతికి పెడతానని మాటిచ్చాగా ఎప్పుడో! చూస్తా! చూస్తా!" నిధి అన్నాడు. "నా గురించి అడిగేవాళ్ళకి చెల్లికి మొగుణ్ణి వెదికే పనిమీద వెళ్ళాడు అని చెప్పండి".

"నేనూ మాటిచ్చాగా! నువ్వు నాకు మొగుణ్ణి తెస్తే నేను నీకు పెళ్ళాన్ని తెస్తానని? రక్కిపారేసే రాకాసిని తెస్తాలే!" నవనీత నవ్వింది.

"సరే! అన్నం తింటూ ఆడుకోండి ఆ పరాచికాలు!" కర్దముడు హెచ్చరించాడు.

"రా నాయనా! నీకిష్టమైనవన్నీ వండాను. మళ్ళీ ఎన్నాళ్ళకి కడుపారా కావాల్సిన పదార్థాలు తింటావో!" అంటూ అరుంధతి భోజనశాల వైపు దారితీస్తూ అంది.

నిధి నవనీత భుజం చుట్టూ చేతిని వేసి, దగ్గరగా లాక్కుని నడవసాగాడు. కర్దముడు ఇద్దర్నీ తృప్తిగా, గర్వంగా చూస్తూ వాళ్ళని అనుసరించాడు.

**(ఇంకా వుంది)**



# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
# థైరాయిడ్ సమస్యలకు సరైన వైద్యం

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్



సరైన ఆహార నియమాలు మరియు వ్యాయామాలు పాటించినప్పటికీ బరువు పెరగడం, జుట్టు విపరీతంగా రాలిపోవడం, చర్మం పొడిబారినట్లుగా ఉండటం మరియు అధిక మానసిక కల్లోలానికి గురికావడం, స్త్రీలు – ఋతుచక్ర సమస్యలు వంటివి ఎదుర్కొంటున్నట్లైతే నిర్లక్ష్యం చేయకూడదు. అవి థైరాయిడ్ సమస్యల వలన కలిగి ఉండవచ్చు. ఈ మధ్యకాలంలో చాలా మంది ఈ థైరాయిడ్ సమస్యల బారిన పడటం జరుగుతోంది. థైరాయిడ్ గ్రంథి ఉత్పత్తి చేసే థైరాయిడ్ హార్మోన్‌ల ప్రభావం శరీరంలో ప్రతి ఒక్క కణం పై ఉంటుంది. ఏ స్వల్ప కారణం మూలంగానైనా అవి అసమతుల్యతకు గురి అయినట్లైతే – తీవ్రమైన ఆరోగ్య సమస్యలకు దారితీసే ప్రమాదం ఉంటుంది. కాబట్టి ఈ వ్యాధి పట్ల అవగాహన పెంచుకొని, దీనిని సత్వరమే గుర్తించి సరైన చికిత్స పొందినట్లయితే దీని నుండి పూర్తిగా బయట పడటమే కాకుండా అది కలుగజేసే దుష్ప్రభావాల నుండి మనల్ని మనం కాపాడుకునే అవకాశం ఉంటుంది. అయితే ఇతర వైద్య విధానాలలో థైరాయిడ్ సమస్యలకు కేవలం హార్మోన్‌ల సప్లిమెంట్ అందించడమే తప్ప పూర్తి చికిత్స అందుబాటులో లేదు. కేవలం హోమియోకేర్ చికిత్సా విధానం ద్వారా మాత్రమే ఈ వ్యాధులను పూర్తిగా నయం చేయవచ్చు.



మానవ శరీరంలోని అతి ముఖ్యమైన గ్రంథులలో థైరాయిడ్ గ్రంథి ఒకటి. ఇది మెడ ముందు భాగంలో, కంఠానికి దగ్గరగా సీతాకోకచిలుక ఆకారంలో శ్వాసనాళానికి ఇరుప్రక్కలా ఉంటుంది. శరీరంలోని హైపోథలామస్ నుండి విడుదలయ్యే TRH (థైరోట్రాపిన్ రిలీజింగ్ హార్మోన్) సంకేతంతో పిట్యుటరీ గ్రంథి శరీరంలోని హార్మోన్ స్థాయిలను గుర్తించి TSH (థైరాయిడ్ స్టిమ్యులేటింగ్ హార్మోన్)ను విడుదల చేస్తుంది. ఈ హార్మోన్ థైరాయిడ్ గ్రంథిని ఉత్తేజ పరచడం ద్వారా అది T3, T4 అనబడే థైరాయిడ్ హార్మోన్‌లను ఉత్పత్తి చేసి రక్తప్రవాహంలోకి పంపుతుంది. తద్వారా ఆ హార్మోన్‌లు శరీరంలోని ప్రతి కణానికి చేరుకుని అన్ని జీవక్రియలైన – గుండె, నాడీ, జీర్ణవ్యవస్థ, మానసిక మరియు శారీరక ఎదుగుదల, బేసల్ మెటబాలిక్ రేట్ మరియు సంతాన ఉత్పత్తి వంటి వాటిపై ప్రభావం చూపుతాయి.

ఇలా నిరంతరం శరీరంలో థైరాయిడ్ హార్మోన్‌లను తగిన స్థాయిలో ఉంచే హైపోథలామస్, పిట్యుటరీ, థైరాయిడ్ హార్మోన్‌ల వ్యవస్థ విఫలమైనప్పుడు హార్మోన్‌ల అసమతుల్యత ఏర్పడి అవి ఎక్కువ లేదా తక్కువగా ఉత్పత్తి కావడం ఒక ఖచ్చితమైన సమస్యగా పరిణమించి హైపర్ లేదా హైపో థైరాయిడిజం మరియు గాయిటర్ వంటి దీర్ఘకాలిక ఆరోగ్య సమస్యలకు దారి తీస్తుంది.

**(1) హైపోథైరాయిడిజం:** శరీరంలో థైరాయిడ్ హార్మోన్‌లు తక్కువ మోతాదులో ఉత్పత్తి కావడంతో తలెత్తే ఈ సమస్యను హైపోథైరాయిడిజం అని అంటారు. ఇది చిన్నపిల్లలలో, స్త్రీలలో ఎక్కువగా కనిపిస్తుంది. **లక్షణాలు: పిల్లలలో:** బుద్ధిమాంద్యం, ఎదుగుదల లోపం, జ్ఞాపకశక్తి లేకపోవడం, మలబద్ధకం, చురుకుదనం కోల్పోవడం, వయస్సుకు మించి లావుగా ఉండటం మొ॥వి. **యుక్త వయస్కులలో:** బరువు పెరగడం, BMR తగ్గిపోవడం, రజస్వల ఆలస్యమవడం, ఋతుచక్ర సమస్యలు, నెలసరి రాకపోవడం, నెలసరిలో అధిక లేదా అల్ప రక్తస్రావం అవడం, సంతానలేమి, చర్మం పొడిబారడం, చలికి తట్టుకోలేకపోవడం, మలబద్ధకం, అలసట, నిద్రలేమి, ఏకాగ్రత లోపించడం, కీళ్ళనొప్పి, కండరాలనొప్పి వంటి లక్షణాలు ఏర్పడతాయి.

**(2) హైపర్‌థైరాయిడిజం:** థైరాయిడ్ హార్మోన్‌లు ఎక్కువ మోతాదులో ఉత్పత్తి కావడాన్ని హైపర్‌థైరాయిడిజం అంటారు. **లక్షణాలు:** ఆహారం సరైన మోతాదులో తీసుకున్నా కూడా శరీర బరువు తగ్గడం, నెలసరి త్వరగా రావడం, ఋతుచక్రములో అధిక రక్తస్రావం కావడం, సంతానలేమి లోపాలు, ఎక్కువ చెమటలు పట్టడం, చేతులు వణకడం, వేడిని తట్టుకోలేకపోవడం, గుండెదడ, విరేచనాలు, వెంట్రుకలు రాలిపోవడం, అర్టికేరియా వంటి చర్మ సమస్యలు మొదలగు లక్షణాలు ఏర్పడటం జరుగుతుంది.

**(3) గాయిటర్:** థైరాయిడ్ గ్రంథి వాపునకు గురి కావడాన్ని 'గాయిటర్' అని అంటారు. కొన్ని సందర్భాలలో థైరాయిడ్ గ్రంథి సాధారణ పరిమాణం కంటే రెండింతలు ఎక్కువగా పెరిగి, స్వరపేటికపై ఒత్తిడి కలిగించడం వలన స్వరంలో మార్పు వస్తుంది. గాయిటర్‌లో థైరాయిడ్ హార్మోన్‌లు (T3, T4) సాధారణ స్థితిలో ఉన్నప్పటికీ గాయిటర్ లేనట్లుగా నిర్ధారించలేము.

**కారణాలు:** గాయిటర్ లోపం ఉత్పన్నమవటానికి గల ముఖ్య కారణం "అయోడిన్" అనే మూలకం యొక్క లోపం. **లక్షణాలు:** గొంతు క్రింద వాపు వచ్చి మింగడానికి కష్టంగా ఉండటం, స్వరంలో మార్పులు, కనుగుడ్లు బయటకు పొడుచుకు వచ్చినట్లుగా ఉండటం వంటి లక్షణాలు ఏర్పడతాయి.

**థైరాయిడ్ సమస్యలకు గల కారణాలు:** సరైన జీవన శైలిని మరియు ఆహార నియమాలను పాటించకపోవడం, అధిక మానసిక ఒత్తిడికి లోనవడం, శారీరక శ్రమ తక్కువగా ఉండటం, వ్యాయామాలు చేయకపోవడం, పౌష్టికాహార లోపం, అయోడిన్ లోపం, థైరాయిడ్ గ్రంథిని కొద్దిగా తొలగించడం మరియు పిట్యుటరీ గ్రంథిలో వచ్చే వ్యాధుల వలన, వంశపారంపర్యత వంటి అంశాల వలన ఈ థైరాయిడ్ సమస్యలు ఉత్పన్నమవుతుంటాయి.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** థైరాయిడ్ ప్రొఫైల్ - T3, T4, TSH, యాంటీ థైరాయిడ్ యాంటీబాడీస్, USG ఆఫ్ థైరాయిడ్ గ్లాండ్ మరియు గొంతు యొక్క సి.టి. స్కాన్ వంటి పరీక్షల ద్వారా థైరాయిడ్ సంబంధిత వ్యాధులను నిర్ధారించవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో మాత్రమే అందించబడే కాన్స్టిట్యూషనల్ చికిత్సా విధానంతో, థైరాయిడ్ సమస్యలను సంపూర్ణంగా నయం చేయవచ్చు. రోగి యొక్క మానసిక మరియు శారీరక లక్షణాలను పరిగణనలోకి తీసుకుని, చికిత్స అందించడం ద్వారా ఇది సాధ్యపడుతుంది. అంతే కాకుండా జీవితకాలం మందులు వాడే అవసరం లేకుండా, మళ్ళీ ఈ వ్యాధి తిరిగి రాకుండా నయం చేయడం జరుగుతుంది.

# విజయ విలాసం-2

## స్టెప్స్ టు సక్సెస్ 10

-ఎం. వెంకటేశ్వరరావు, సెల్: 90307 07037

# విఫలము కూడా విజయము కాదా?!

**"ఎదుటివారి విజయాలనుండి నేర్చుకునే పాఠాలకంటే వైఫల్యాలనుండి తెలుసుకునే సత్యాలే విలువైనవి".**

**అసలు వైఫల్యం లేని విజయానికి విలువ ఉంటుందా? వ్యక్తిత్వవికాస కథలు వింటేనే విజయం వస్తుందా? పరీక్షల్లో ఫెయిలైన కొడుకుని తల్లీదండ్రీ భుజంతట్టి, "ఇప్పుడు ఫెయిలైనా ఫరవాలేదురా! ఈసారి ఇంకా బాగా చదివి మంచిమార్కులు తెచ్చుకుందువులే" అని ప్రోత్సహించడం విజయం కాదా?**

"ఓడిపోయినా ఫరవాలేదోయ్" అంటూ ఓ తండ్రి కొడుక్కి ఇచ్చే భరోసా అంశంతో కాల్పనిక వికాస సాహిత్యం రాసి, దానిని చదివిన వాళ్ళలో "విజయ కాంక్ష" రగిలించడం... ఆ రచయిత సాధించిన విజయం కాదా?

"కుడి ఎడమైతే పొరబాటు లేదోయ్... ఓడి పోలేదోయ్" అని మన సినీ గీత రచయిత లెప్పుడో రాశారు.

"వై ఫెంటాస్టిక్ ఫెయిల్యూర్", "వై ఐ ఫెయిల్డ్" "హౌ టు ఫెయిల్ ఎట్ ఆల్మోస్ట్ ఎవ్రీథింగ్ అండ్ స్టిల్ విన్ బిగ్" వంటి పుస్తకాల్లో ఓటమి విలువ తెలిపి ఓటమి గురించి సాహిత్యాన్ని అందించడం విజయం కాదా!

విజయం సాధించాలంటే నైపుణ్యం ఉండాలి. అదీ స్వీయానుభవ నైపుణ్యం రావాలంటే, తొలి అడుగులోనే విజయం సాధించడం నూటికి ఒక్కరికో, ఇద్దరికో దక్కుతుంది. వైఫల్యం పొందిన వాళ్ళంతా వెనక్కి తిరిగిచూసుకుని, అనుభవాలసారంతో కారణాలు విశ్లేషించుకుని, కిందపడినా పైకెగసే కెరటంలా పైకి లేచేవాళ్ళకీ, పడటంలోనూ, తిరిగి లేవటంలోనూ నైపుణ్యం సంపాదించుకుంటారు. మన వాళ్ళ సినిమా సక్సెస్ అయితే విజయయాత్రలు నిర్వహిస్తుం టారు. ఒక కంపెనీ ఆర్థికంగా విజయం సాధిస్తే 'విజయ సదస్సులు' నిర్వహిస్తుంది.

### ఓటమి సదస్సులు

రోజులు మారాయి. నేడు కార్పొరేట్‌రంగ సదస్సుల్లో ఎక్కువశాతం వైఫల్యంపై జరుగుతున్న సదస్సులే. ఓటమికిగల కారణాల విశ్లేషణ, నివారణ చర్యలే ఈ సదస్సుల్లో ప్రధాన ఇతివృత్తమవుతున్నాయి. ఆ మధ్య ముంబయ్ నగరంలో "వృత్తి జీవితంలో నేనుచేసిన ఘోర తప్పిదం" అనే అంశంపై యువ వైద్యులకోసం సదస్సు నిర్వహించారు. సీనియర్ డాక్టర్లు తమ అభిజాత్యం విడిచి వృత్తిజీవితంలో తాము చేసిన తప్పిదాల్లో, రోగులకు గడువు పూర్తైన ఇంజక్షన్లు ఇవ్వటం, అవసరంలేని రోగికి ఆపరేషన్ చెయ్యడం, రోగిపొట్టలో స్కాల్‌పెల్ ఉంచి కుట్టెయ్యడం, సరైన సమయంలో స్పందించకపోవటంవల్ల రోగి మరణించడం వంటి ఎన్నో తప్పుల్ని యువడాక్టర్ల ముందు నిస్సంకోచంగా ఒప్పుకున్నారు. అంతేకాకుండా ఆ పొరబాటుకు కారణాలు, అప్పటి పరిస్థితులు వివరించి, వాటిని ఎలా అధిగమించాలో కూడా చెప్పటం వలన యువ వైద్యులకు ఆ సదస్సు ప్రేరణ కల్గించింది.




"ఏ సంస్థ అయినా, మనిషైనా వైఫల్యాలను నిజాయితీగా అంగీకరించడం కంటే మించిన 'విజయ రహస్యాలు' ఉంటాయా?"

### యజమాని పాత్ర

"ఒక్క అపజయంతోనే నీ విజయం చతికిల బడదన్న వాస్తవం గుర్తించి, ఆ ఓటమిని ముందు యజమాని తన సొంతం చేసుకుని, కింది సిబ్బందితో "ఇది నా వైఫల్యమే" అని చెబితే, "ఇందులో మా వైఫల్యమూ ఉంది. ఇది మీ ఒక్కరిది కాదు, మనందరి వైఫల్యం" అని చెయ్యీచెయ్యీ కలిపి "మీవెంట మేం ఉన్నాం" అని భరోసా ఇచ్చే బంధుగణం అండతో తప్పిదాలు పునరావృతం కాకుండా విజయబావుటాలు ఎగరేసిన విజయగాథలు మనం వింటూనే ఉంటాం.

అందుకే కార్పొరేట్ సంస్థలు వైఫల్యాలు విశ్లేషించే సదస్సులతో సిబ్బందిలో భయం పారద్రోలి వారి ప్రయత్నాలకు ఊతమిస్తుంటాయి.

### యువతలో మార్పు

"ఓటమి నాది కాదు. విజయమైనా, ఓటమైనా రెండూ నాకు సమానమే, జయాపజయాలు నాణానికి ఇరుపక్కలా ఉండే బొమ్మా బొరుసుల్లాంటివి. నేను చేపట్టిన ప్రాజెక్ట్ లేదా వ్యాపారంలో నేను ఓడిపోయానంటే మరోసారి ప్రయత్నించి ఓటమిని ఓడించేవరకూ పోరాడుతూనే ఉంటాను" అంటోంది నేటి యువత.

ఉద్యోగానికిపెట్టే దరఖాస్తులో అనుభవం అన్న చోట తమ అపజయాల్ని కూడా నిర్భయంగా యువత పేర్కొంటున్నారంటే, తమ ఓటమిని నిజాయితీగా అంగీకరించి, విజయంకోసం ప్రయత్నిస్తున్నట్టే గదా.

### ఐ ఫైల్డ్ స్టోరీ

డిజిటల్ వీడియోలు తీసిచ్చే "స్టేజ్‌పోడ్" సంస్థ స్థాపించిన నిఖిలేష్ తన కంపెనీ వెబ్‌సైట్లో "ఐ

ఫైల్డ్" అని పెద్దక్షరాల్లో పెట్టాడు. తొలి ప్రయత్నం లోనే వందమంది కస్టమర్లను పొంది, మితిమీరిన నమ్మకంతో, కంపెనీ కార్యకలాపాల్ని అశ్రద్ధ చేశాడు. నెలరోజుల్లోనే పతనం ప్రారంభమైంది. చివరికి అద్దె కట్టే వసతిలేక తప్పనిసరి పరిస్థితుల్లో షట్టరు దించే శాడు. అయినా నిఖిలేష్ చింతించలేదు. "ఒక వైఫ ల్యంతో పాఠం నేర్చుకున్నా. ఇంకోపాఠం నేర్చుకోవ డానికి మళ్ళీ ఓడిపోవడానికిక్కూడా సిద్ధమే. ఎప్ప టికైనా విజయం సాధిస్తాననే నమ్మకం నాకుంది. నా నమ్మకమే నాకు బలం" అంటాడు నిఖిలేష్.

ఓటమికి కృతజ్ఞత చెప్పడం, వైఫల్యాన్ని సంతో షంగా అంగీకరించడం...లాంటివన్నీ ధైర్యంగా మళ్ళీ ముందడుగు వెయ్యడానికి తక్షణశక్తినిచ్చే 'టానిక్' అన్పిస్తుంది కదా!

### చరిత్రలో

చరిత్రలో రక్తాక్షరాలతో లిఖించబడ్డ మహోన్నత వ్యక్తుల వైఫల్యాలు పరిశీలిస్తే, వాటి ముందు మన వైఫల్యాలు ఏ పాటివో అవగతమవుతుంది.

- పేదరికానికి ప్రతినిధి కార్ల్‌మార్క్స్ జీవితం. ఆయన కూతురు చనిపోతే దహనానికి డబ్బు ల్లేక ఒక రోజంతా శవాన్ని పక్కగదిలోనే ఉంచాడు. అనేక పర్యాయాలు పస్తులున్నాడు. అయినా నేటికీ ఆయన చిరస్మరణీయుడు.

  "ఒక పూటైనా కాల్చుకు తింటానికి రొట్టె దొరక నప్పుడు కూడా మూడు పూటలా నా పేగులు నన్ను కాల్చుకు తింటున్నాయి" అన్నాడాయన.
- సోక్రటీస్ ఆగర్భదారిద్ర్యం అనుభవించాడు. అతనికి ఒకేఒక కోటు ఉండేది. దాని కింద షర్టు కూడా ఉండేది కాదు. బూట్లుండేవి కాదు. అయినా ఏ బాధాలేనట్టే మంచుపైన నడుస్తుండే వాడు. తను నమ్మిన విశ్వాసాలకోసం ప్రాణాన్ని పణంగా పెట్టి, నేటికీ సజీవుడుగా మిగిలిన మహనీయుడు సోక్రటీస్.
- దక్షిణాఫ్రికా స్వాతంత్ర్య సమరయోధుడు నెల్సన్ మండేలా కాళ్ళు పూర్తిగా చాపుకునేందుకు కూడా వీలులేని ఇరుకుగదిలో 27 ఏళ్ళు ఒంటరిగా దుర్భర జైలుజీవితం గడిపాడు. అంతటి కఠిన శిక్ష కూడా అతనిలోని స్వాతంత్ర్య కాంక్షను అణచి వెయ్యలేకపోయింది.

"కష్టాలు, వైఫల్యాలు నిరంతరం నిలబడి ఉంటే, వాటి గురించే ఆలోచించి, కుదేలైపోతే, పైన ఉదహరించిన వారంతా ప్రపంచవ్యాప్తంగా, కాలా తీతంగా నేటికీ చరిత్రలో శాశ్వత విజయం నమోదు చేసుకునే వాళ్ళు కాదు.

### సులభం కాదు

"ఓటమి నుండి పాఠాలు నేర్చుకోవడం అంత సులభంకాదు. అదికూడా గెలుపంత కష్టమైనదే. అపజయం కలిగితే, ఆ కారణమేమిటో, ఆ మర్మం ఏమిటో వెంటనే బోధపడదు. వైఫల్యాన్ని కూలం కషంగా విశ్లేషించుకోవాలి. లోపం ఎక్కడుందో గుర్తించాలి. ఆ వైఫల్యంలో మన వాటా ఎంత? అని విశ్లేషించుకోవాలి. నిజాయితీగా మన తప్పిదం అంగీకరించాలి.

## హేట్సాఫ్ కె.ఎఫ్.సి శాండర్స్



*65 ఏళ్ళ వరకూ వైఫల్యాలే! ఆత్మహత్యా ప్రయత్నంలోనూ వైఫల్యమే.*

కానీ ఒకేఒక్క ఐడియా కల్నల్ హర్‌లాండ్ శాండర్స్ జీవితాన్ని మెరుపులా మలుపు తిప్పింది.

ఐదేళ్ళ వయసులోనే శాండర్స్ తండ్రిని కోల్పో యాడు. పదహారేళ్ళ వయసుకే చదువు ముగిసి పోయింది. పదిహేడేళ్ళకే నాలుగుఉద్యోగాలు చేసి పోగొట్టుకున్నాడు. 18వ ఏట పెళ్ళి, 19ఏళ్ళకే తండ్రి పదవి పొందాడు. నాలుగేళ్ళు రైల్వే కండక్టర్‌గా పని చేసి తిరస్కరింపబడ్డాడు. తర్వాత ఆర్మీలో చేరాడు. నువ్విక్కడ పనికిరావంటూ అక్కణ్ణుంచీ వెళ్ళ గొట్టారు. ఇన్సూరెన్సు ఏజెంట్‌గాచేరి ఓటమి చవి చూశాడు. భార్య అతనితో విసిగిపోయింది. అతని 20వ ఏటనే అతడిని వదిలేసి కూతుర్ని తీసుకుని పుట్టింటికి వెళ్ళిపోయింది. పూటగడవక చిన్న బేకరీ షాపులో పాత్రలు కడుగుతూ జీవించాడు శాండర్స్.

ఒంటరి జీవితంతో విసుగుచెంది కనీసం కూతురుతో కలిసి ఉండాలని ఆమెను కిడ్నాప్ చేసి తన దగ్గరికి తెచ్చుకోవాలనుకున్నాడు. ఆ యత్నం లోనూ విఫలమయ్యాడు.

చివరికి భార్యను ఒప్పించి ఇంటికి తెచ్చుకు న్నాడు. అప్పటికే వార్ధక్యం వచ్చింది. 65 ఏళ్ళ వయసులో రిటైరయ్యాడు. ప్రభుత్వం 105 డాలర్ల చెక్కు పంపింది. జీవితంలో ఏమీ సాధించలేక పోయాననే నిరాశతో ఆత్మహత్య ప్రయత్నం చేశాడు. అక్కడా ఓడిపోయాడు.

ఓ రోజు విజేతల జీవితగాథల పుస్తకం చదువు తుంటే, మెరుపులాంటి ఓ ఆలోచన వచ్చింది శాండర్స్‌కి. ఎవరూ చెయ్యని పని చెయ్యాలను కుని తన దగ్గరున్న 105 డాలర్లకి, సన్నిహితుల దగ్గర మరో 27 డాలర్లు అప్పుచేసి "చికెన్ ఫ్రైడ్," రోడ్ సైడ్ రెస్టారెంట్ కెంటుకీలో అమ్మటం ప్రారం భించాడు. దశ తిరిగింది. అదే తర్వాత కాలంలో "కెంటుకీ ఫ్రైడ్ చికెన్"గా 1952లో అవతరించింది. 88ఏళ్ళ వయసులో శాండర్స్ అమెరికాలోని ధని కుల్లో ఒకడుగా అవతరించాడు. 123 దేశాల్లో కె.ఎఫ్.సిని విస్తరింపచేసిన శాండర్స్, విజయానికి వయసుతో పనేలేదని నిరూపించాడు.

కాలం గడిచేకొద్దీ గాయం మానినట్టు వైఫల్య తీవ్రత తగ్గిపోతుంది. తీవ్రత తగ్గాక సమీక్ష మొదలు పెట్టండి. లోపాల్ని అధిగమించే తాజా ప్రణాళికతో ప్రయత్నానికి శ్రీకారం చుట్టండి.

"ఫెయిల్యూర్ టు మిలియనీర్" పుస్తక రచయిత శివదాస్ రాఘవ ఓ వ్యాపారవేత్త. తన వ్యాపార జీవితంలో ఎదురైన వరుస వైఫల్యాలను ఆ పుస్త కంలో ప్రస్తావించాడు.




"రాత్రికి రాత్రే ఎవరూ విజయం సాధించలేరు. సాధించగలమని ఎవరైనా అంటే ఆ రాత్రి చాలా సుదీర్ఘమైనదై ఉండాలి. నా విషయంలో సంవత్స రాల చీకటి రాత్రి అది" అంటాడు శివదాస్.

### ఓటమి కారణాలు ఇలా ఉండొచ్చు

- మనకంటే గొప్ప ఆలోచన మరెవరికో రావడం
- చేపట్టిన పనిపై సరైన అవగాహన లేకపోవడం
- పక్కా ప్రణాళిక లేకపోవడం
- మార్కెట్ వాతావరణం అనుకూలంగా లేక పోవడం.
- సరైన టీమ్ ఏర్పాటుచేసుకునే సామర్థ్యం లోపిం చడం.
- ఏకాగ్రత లోపించడం, చేసే పనిమీద 'నమ్మకం' లేకపోవటం.
- అన్నింటినీ మించి 'ఓటమి' అంటే భయం.
- ధైర్యం ఒక్కరోజుతో వచ్చిందికాదు. ఎన్నో వైఫ ల్యాల అనంతరం ఎంత పైపైకైనా ఎగర గల నన్న ఆత్మవిశ్వాసం.
- కర్ణుడిచావుకి వేలకారణాలన్నట్టు, ఓటమి ఎదు రైనప్పుడు కారణాలు తల్చుకుంటూ కాలహ రణం చెయ్యటమే పెద్ద ఓటమి.

"తొలి ప్రయత్నంలోనే విజయం సాధిస్తే ఓ కప్పు చేతికిచ్చి, మెళ్ళో ఓ మెడల్ వేస్తారు. అదే వైఫల్యం ఎదురైతే అది జీవిత సత్యాన్ని బోధిస్తుంది. అవి ఆషామాషీగా ఉండవు.

జీవితాన్ని మలుపు తిప్పడానికి 'మెరుపు లాంటి ఒక్క ఆలోచన చాలు.'

- కుండపోత వర్షం కురుస్తుంటే, పక్షులన్నీ గూటికి చేరితే, గ్రద్ద మాత్రం లెక్కచెయ్యకుండా వర్షం కురిసే మేఘాలకంటే పైకి ఎగిరిపోతుంది. అంతటిశక్తి, పైకి ఎగరగల ధైర్యం గ్రద్దకు ఒక్క రోజులో వచ్చింది కాదు. ఎన్నో వైఫల్యాల అనంతరం ఎంతో పైపైకి ఎగరగలనన్న 'ఆత్మ విశ్వాసం'తో లభించిన శక్తి అది.

నవ్య

# CRIME విషపుష్పం

**కడప టౌన్.**

**ఆగస్టు 25.**

**వన్‌టౌన్ పోలీస్‌స్టేషన్‌లో రాత్రి మూడు గంటలవేళ అదేపనిగా ఫోన్ మోగుతోంది. డ్యూటీలో ఉన్న ఎస్.ఐ. చంద్రశేఖర్ ఫోన్ అందుకున్నాడు. అవతల్నించి చెప్పిందివిని అలర్టయ్యాడు. తెలుగు గంగ కాలనీలోని రెండిళ్ళల్లో దోపిడీ దొంగలు బీభత్సం సృష్టించారు. వెంటనే మిగతా పోలీస్‌స్టేషన్‌లకు కూడా ఆ సమాచారం అందించాడు. ఇద్దరు కానిస్టేబుల్స్‌ను తీసుకుని జీపులో బయలుదేరాడు ఎస్.ఐ.**

అప్పుడప్పుడే తెలవారుతోంది. జనసంచారం మొదలైంది. దోపిడీ జరిగిన తెలుగుగంగ కాలనీ ప్రదేశానికి చేరుకున్నాడు ఎస్.ఐ. దోపిడీ ప్రదేశంలో దృశ్యాలు బీభత్సంగా ఉన్నాయి. ఒక ఇంట్లో సామాన్లన్నీ చిందరవందరగా పడున్నాయి. హాలుమధ్యలో సజీవదహనమైన ఓ పురుషుడిశవం పడి ఉంది. పక్కన గదిలోంచి ఓ స్త్రీ కేకలు వినిపిస్తున్నాయి. గది బయట గడియ వేసుంది.

పోలీసులు వెళ్ళి తలుపు గడియ తియ్యగానే ఓ నడివయస్సు స్త్రీ, నాలుగేళ్ళపాప ఏడుస్తూ బయటికి వచ్చారు. హాల్లోని శవాన్ని చూస్తూనే "ఎంత పని జరిగింది రవీందర్..." అంటూ కెవ్వున అరిచి మూర్ఛపోయింది ఆ స్త్రీ. ఆమె రవీందర్ భార్య పుష్పవల్లి. ఆమెను వెంటనే ఆసుపత్రిలో చేర్పించాడు ఎస్.ఐ. దోపిడీ జరిగిన రెండో ఇల్లు రమణారెడ్డిది. అక్కడ సగం కాలిపోయిన స్త్రీ శవం ఉంది. ఆమె రమణారెడ్డి భార్య సుమతి.

దోపిడీ జరిగినప్పుడు రమణారెడ్డి ఊళ్ళో లేడు. శవపంచనామా చేస్తుండగా అక్కడికి ఒక ఆటో వచ్చింది. రమణారెడ్డి ఆటోలోంచి దిగాడు. అక్కడి వాతావరణం అతడిని కలవరపరిచింది. భార్య సజీవదహనమైన సంగతివిని షాక్ తిన్నాడు. భార్య శవం మీదపడి ఘొల్లుమని ఏడవసాగాడు.

ఎస్.ఐ అతణ్ణి సముదాయించాడు. "నిన్న రాత్రి మీరు ఎక్కడికెళ్ళారు?" అడిగాడు ఎస్.ఐ. చంద్రశేఖర్.

"ఓ అర్జంటు పనిమీద రాత్రి రాజంపేట వెళ్ళాను సార్. నేనుంటే ఈ ఘోరం జరిగేదికాదు."

"కారులో వెళ్ళారా....?"

"బస్సులో వెళ్ళాను" అంటూ టికెట్లు చూపించాడు. ఆ టికెట్లు స్వాధీనం చేసుకున్నాడు ఎస్.ఐ. చంద్రశేఖర్. మృతదేహాలను శవపరీక్షలకోసం ప్రభుత్వ ఆసుపత్రికి తరలించి దర్యాప్తు ప్రారంభించాడు.

ఎంత శోధించినా దొంగలకు సంబంధించిన క్లూస్ దొరక్కపోవడం విచిత్రంగా తోచింది చంద్రశేఖర్‌కి. ఈ రెండిళ్ళవారూ శ్రీమంతులు కాదు, సామాన్య కుటుంబాలు. మరి దోపిడీ దొంగలు ఆ రెండిళ్ళనే ఎందుకు టార్గెట్ చేసినట్టు? ఆలోచిస్తుండగా, బనగానిపల్లె నుండి ఒక వృద్ధుడు అతణ్ణి కలవడానికొచ్చాడు. తన పేరు ఓబుల్‌రెడ్డి అనీ, మృతుడు రవీందర్ తండ్రిననీ చెప్పాడు. కొడుకు మరణవార్త ఇప్పుడే తెలిసి వచ్చానన్నాడు.

"మీకు ఎవరి మీదైనా అనుమానం ఉందా..?" సూటిగా అడిగాడు ఎస్.ఐ.

అది విని గొల్లుమన్నాడు ఓబుల్‌రెడ్డి. "నా కొడుకు చాలా మంచోడయ్యా, చాలా అమాయకుడు. కానీ...." అంటూ దు:ఖంతో మొహం చేతుల్లో కప్పుకున్నాడు.

నీళ్ళు తెప్పించి వృద్ధుడికి ఇచ్చాడు చంద్రశేఖర్. నీళ్ళుతాగి సేదదీరాక తుండుతో మొహం తుడుచుకుని నెమ్మదిగా తనకు తెలిసింది చెప్పాడా వృద్ధుడు. తండ్రి ఫిర్యాదు మేరకు కేసు బుక్ చేశారు.

***

నాలుగురోజులు గడిచినా జంటహత్యల కేసులో పురోగతిలేదు. ఎలాంటి క్లూ దొరకలేదు. అంతలో పోస్ట్‌మార్టం రిపోర్టు వచ్చింది. ఆ రిపోర్టును ఎస్.ఐ. చంద్రశేఖర్ క్షుణ్ణంగా చదివాడు. అది చదవగానే ఆసక్తికరమైన విషయాలు వెలుగులోకి వచ్చాయి.

> **కుబుసంలాంటి తెల్లటిచీరలో బెడ్రూమ్ పక్కన నిలబడి ఆహ్వానించిందామె. ఆమె అందాలు అతడిని రా రమ్మని కవ్వించాయి. ఆమెను గట్టిగా వాటేసుకున్నాడతను. గాలికి అల్లల్లాడే తీగకు ఆధారం దొరికినట్టు అతన్ని గాఢంగా అల్లుకుపోయిందామె. వివశంగా అతడిని మీదకులాక్కుని బెడ్‌పైన ఒరిగిపోయిందామె. ఆ రాత్రి అందాలవిందారగించాడతను. ఇక ఆ తర్వాత ఒకర్ని విడిచి ఒకరు ఉండలేకపోయేవారు. కానీ....**

చనిపోయేముందు హతులిద్దరూ అధిక మోతాదులో నిద్రమాత్రలు వేసుకున్నారు. పైగా మెడకు తాడువేసి లాగడం వల్లే ఇద్దరూ చనిపోయారు! దోపిడీ దొంగలే ఈ దారుణానికి పాల్పడ్డారని భావించారుగానీ, ఈ రిపోర్టు చూస్తే దీనివెనుక అంతకు మించినదేదో ఉందనిపించింది చంద్రశేఖర్‌కి. 'ఇదంతా ప్రీప్లాన్డ్ మర్డర్!' మనసులో అనుకున్నాడు.

రమణారెడ్డి ఇచ్చిన ఆర్.టి.సి బస్సు టికెట్ల పరిశీలన కూడా పూర్తయింది. ఆ వివరాలు కూడా తెలిశాయి. రవీందర్ తండ్రి ఓబుల్‌రెడ్డి మాటలు గుర్తొచ్చాయి ఎస్.ఐ.కి. కోడలు పుష్పవల్లి ప్రవర్తన అనుమానాస్పదంగా ఉందన్నాడాయన. అప్పటికప్పుడు ఓ పథకం రూపొందించాడు ఎస్.ఐ. చంద్రశేఖర్. దోపిడీ జరిగిన ఇళ్ళకు ఫోన్‌చేసి దొంగలు దొరికారని చెప్పాడు. తర్వాత ఆ రెండు ఇళ్ళపై నిఘా వేశారు పోలీసులు.

***

తలుపు తోసుకుంటూ లోపలికి వచ్చిందా స్త్రీ. అక్కడ ఉన్న పురుషుణ్ణి చూస్తూనే ముసుగు తొలగించింది. "ఇప్పుడే పోలీసులు ఫోన్ చేశారు" అంది.

"నాక్కూడా చేశారు. దొంగలు దొరికారట"

"అంటే ఇక మనకేం భయం లేనట్టే! మనమీద ఎవరికీ అనుమానం లేనట్టేగా" అంది సంతోషంగా.

"ఔను" అంటూ ఆమెను దగ్గరికి లాక్కుని గట్టిగా కౌగిలించుకున్నాడు.

"మనం కలుసుకుని వారం రోజులైపోయింది, నిన్ను చూడకుండా ఉండలేను బాబు..." అంటూ అతని పెదాలకు తన పెదాలను అందించి అతని కౌగిలిలో కరిగిపోసాగింది. వారి ప్రేమకేళి మొదటి అంకంలో ఉండగానే తలుపులు తోసుకుంటూ పోలీసులు ప్రత్యక్షమయ్యారు. ఎదురుగా ఎస్.ఐ. చంద్రశేఖర్.

పోలీసులను చూసి తెల్లబోయారు రమణారెడ్డి, పుష్పవల్లి. ఇద్దరినీ అరెస్ట్ చేశారు. ఎలాంటి వారికైనా గుండె జలదరించే ఓ గుడ్డి ప్రేమకథ పోలీసు విచారణలో వెలుగు చూసింది.

***

రెండేళ్ళ క్రితం తెలుగుగంగ కాలనీలో కొత్తగా ఇళ్ళు వెలుస్తున్నాయి. రవీందర్ తన స్థలంలో ఇల్లు కట్టుకుంటున్నాడు. అతను మెడికల్ రిప్రజెంటేటివ్ కనుక తరచూ క్యాంపులకు వెళ్ళేవాడు. అప్పుడే పొరుగునున్న రమణారెడ్డితో స్నేహం ఏర్పడింది. ఊరి చివరన ప్రదేశం కావడంవల్ల అవసరానికి రమణారెడ్డి సహాయం అనివార్యమైంది రవీందర్‌కు. ఇక రాత్రిపూట ఇద్దరూ కలిసి పార్టీలు చేసుకునేవారు. ఆ పరిచయ సమయంలోనే రవీందర్ బలహీనత కనిపెట్టాడు రమణారెడ్డి. దాంతో బాటు మంచి పొంకంగా ఉన్న రవీందర్ భార్య పుష్పవల్లిపై కన్నేశాడు. భర్త తరచూ క్యాంపులకెళ్ళడంతో పుష్పవల్లి కూడా ఒంటరిగా ఉండేది.

రవీందర్, రమణారెడ్డి ఇద్దరూ బయట బారుల్లో



కూర్చుని తాగేవారు. ఒకరోజు బాగా వర్షం పడుతోంది. దాంతో, "బయటికి ఏం వెళ్తాం, మా ఇంట్లో కూర్చుందాం రా...." అని రమణారెడ్డిని ఆహ్వానించాడు రవీందర్. రవీందర్ భార్య పుష్పవల్లి అభ్యంతరం చెప్పలేదు రండీ అంటూ పరోక్షంగా రమణారెడ్డిని ఇంట్లోకి ఆహ్వానించింది. ఆ రోజు రవీందర్‌కు మోతాదుకు మించి మందు పోశాడు రమణారెడ్డి. రవీందర్‌కు కిక్కు తలకెక్కింది. బయట వర్షం తగ్గలేదు. "ఇక నేను బయలు దేరుతా" అని లేచాడు రమణారెడ్డి. "హేయ్..... ఈ వర్షంలో ఎక్కడికెళ్తావ్ మిత్రమా" అంటూ రమణారెడ్డిని ఆపాడు. అతడి చేతిని తన తలమీద పెట్టుకుని, "నువ్వెళ్తే నా మీద ఒట్టే. పుష్పా రెడ్డిగారికి పడక ఏర్పాటుచెయ్యి ... అని పురమాయించాడు. అతని గ్లాసులో మరింత మద్యం వంపాడు రెడ్డి. కూర్చున్న చోటే ఫైకంగా తల వాల్చేశాడు రవీందర్. సన్నని గాజుల శబ్దంతో "ఇటు రండి" అన్న పిలుపు వినిపించింది. రమణారెడ్డి తల తిప్పి చూశాడు. పాము కుబుసం లాంటి తెల్లటిచీరలో బెడ్రూమ్ పక్కన నిలబడిన పుష్పవల్లి అందాలు కొట్టొచ్చినట్టు కనిపిస్తున్నాయి. చేతులకు ఎర్రని గాజులు, పెదాలకు అంతకన్నా ఎర్రని లిప్ స్టిక్. అడుగు ముందుకేసి బెడ్రూమ్ చేరుకున్నాడు. మల్లెపువ్వు లాంటి తెల్లని ఇస్త్రీ చేసిన బెడ్‌షీట్, దిండు గలీబులు, పక్కమీద మల్లె పువ్వులు, ఇదంతా కలయో వైష్ణవ మాయో అన్నట్టుంది రమణారెడ్డికి. పుష్పవల్లి చికెన్ సిక్స్‌టీ ఫైవ్, వేడి వేడి పరాటాల ప్లేట్‌తో ప్రవేశించింది "మీరు భోం చేయలేదు, ముందు భోజనం చేయండి" అని ప్లేట్ అందించింది.

"నాకు ఒంటరిగా భోజనం చెయ్యడం అలవాటు లేదు" అన్నాడు ఆమెవైపు ఆశగా చూస్తూ.

"ఇంటికి వచ్చిన అతిథిని గౌరవించడం మా ఆచారం, రండి ఇద్దరం కలిసి భోంచేద్దాం" అంటూ చొరవగా అతని చెయ్యి పట్టి లాగింది. రమణారెడ్డికి వెయ్యి ఓల్టుల కరెంట్ షాక్ కొట్టినట్టైంది. చేతిని అలాగే గట్టిగా నొక్కాడు. పుష్ప చిన్నగా నవ్వింది. తినటం ముగించి చొరవగా ఆమె పైటతో చెయ్యి తుడుచుకున్నాడు. అభ్యంతరం చెప్పలేదామె. గబుక్కున తనవైపు లాక్కున్నాడు. గాలికి అల్లల్లాడుతున్న తీగకు ఆధారం దొరికినట్టైంది పుష్పకు. లతలా రమణారెడ్డిని గాఢంగా హత్తుకుపోయింది. అప్పుడే విచ్చుకున్న పుష్పంలా వికసించాయి పుష్ప పెదాలు. వివశంతో రెడ్డిని తనమీదకు లాక్కుని బెడ్ పైకి ఒరిగిపోయింది. కుబుసం వీడిననాగులా మెరిసిపోతూ బుసలు కొడుతోంది పుష్ప. జెర్రిపోతులా ఆమెను బిగ్గరగా పెనవేసుకున్నాడు రెడ్డి. బెడ్ మీద మల్లెపూలు నలిగిపోయాయి. పుష్ప కొసరి కొసరి అందాలవిందు చేసింది రమణారెడ్డికి. పుష్ప మకరందాలను తనివితీరా జుర్రుకున్నాడతను. పరువాల విందు ఆరగించి మత్తులో సోలిపోయారు ఆ ఇద్దరూ. మత్తులో జోగుతున్న రవీందర్‌కు బెడ్ రూమ్‌లో జరుగుతున్నదేమీ పట్టలేదు.

***

అది మొదలు వీలు చిక్కినప్పుడల్లా ఆ ఇద్దరు కలుసుకునేవారు. అది ఆ నోటా ఈ నోటా రవీందర్ చెవిన పడింది. అలాగే రమణారెడ్డి భార్య సుమతికి కూడా తెలిసి ఓసారి పుష్పతో గొడవ పడింది కూడా. ఇక లాభం లేదనుకొని రవీందర్ పుష్పతో త్వరలోనే ఇక్కడి నుండి మకాం మార్చేస్తానని హెచ్చరించాడు. అది వినగానే, తన అక్రమ సంబంధానికి భర్త గండికొడుతున్నాడనీ, అతడికి నిజం తెలిసిపోయిందనీ భయపడిపోయింది పుష్ప. ఆ రాత్రే పుష్ప, రమణారెడ్డి కలిసి రవీందర్‌ను, సుమతిని హతమార్చడానికి ప్లాన్ వేశారు. ఆ ప్లాన్ ప్రకారం ఆ రాత్రి రవీందర్‌కు పాలల్లో నిద్ర మాత్రలు కలిపి ఇచ్చింది. అర్థరాత్రి తర్వాత రమణారెడ్డి రాగానే ఓ తాడుతో గొంతుకు ఉరివేసి రవీందర్‌ను చంపేశారు. అలాగే రమణారెడ్డి ఇంట్లో సుమతికి మత్తుమందు కలిపిన పాలిచ్చి ఆమె గాఢనిద్రలో ఉండగా తాడుతో ఉరివేసి చంపేశారు.

లోకం దృష్టి మళ్ళించడానికి పుష్పవల్లిని, కూతురిని ఓ గదిలో బంధించి సామాన్లు చిందరవందరగా పడేసి నట్టింట్లో రవీందర్ శవాన్ని తగలబెట్టాడు రమణారెడ్డి. తన ఇంట్లో కూడా దోపిడీ బీభత్సం సీన్ సృష్టించి బస్సెక్కి రాజంపేట వెళ్ళిపోయాడు రమణారెడ్డి. ఏమీ తెలియనట్టు ఉదయం తిరిగొచ్చి పోలీసులకు టిక్కెట్లు చూపించాడు. రమణారెడ్డి రాజంపేట వెళ్ళాడుగానీ, వెంటనే తిరిగి అదే బస్సు ఎక్కి రిటనైపోయాడు. టికెట్ల విచారణలో అదే విషయం బయటపడింది.

ఎస్.ఐ. చంద్రశేఖర్ ప్లాన్ గుర్తించలేక పోలీసులకు అడ్డంగా దొరికిపోయారు ఇద్దరూ.

పాపం ఎల్లకాలం దాగదు. శారీరక వ్యామోహంతో రెండు నిండు ప్రాణాలు బలి తీసుకున్న మూర్ఖులు రమణారెడ్డి, పుష్పవల్లి.

**- యం.ఉదయభాను**



9

# లాకర్ నెం. 369



-ప్రభాకర్ జైని సెల్: +91 90308 83785

**నేను మరునాడు మళ్ళీ జోనల్ మేనేజర్ దగ్గరకు వెళ్ళాను. నాకు అపాయింట్‌మెంట్ ఇవ్వడానికి ఎందుకు సంకోచిస్తున్నాడో అర్థం కావడం లేదు. ఇదంతా చూస్తుంటే, నా కళ్ళుగప్పి నా సెక్షన్‌లో ఏదైనా కుట్రకు ప్లాన్ చేస్తున్నారేమోనని, నన్ను ఇరికించే ప్రయత్నం చేస్తున్నారేమోనని నాకు అనుమానమొచ్చింది.**

**నేను వెంటనే బయటకొచ్చి, బ్యాంకుకు దూరంగా ఉన్న నెట్ సెంటర్లోకి వెళ్ళి నా దగ్గరున్న అన్ని డాక్యుమెంట్లు స్కాన్ చేసి గూగుల్ డ్రైవ్‌లో భద్రపరుచుకున్నాను. సవివరంగా, ఒక రిపోర్టు రాసి హెడ్డాఫీసుకు, విజిలెన్స్ సెల్‌కు, సి.బి.ఐకి పంపించాను. అటునుంచి అటే బంజారాహిల్స్ పోలీస్ స్టేషన్‌కు వెళ్ళి నేను అంతకుముందు కలిసిన డియస్పీ ఆఫీసులో కంప్లయింట్ లాడ్జ్ చేశాను.**

ఆ తరువాత రెండు గంటలు పిచ్చి పిచ్చిగా తిరిగి, రెండు గంటల తర్వాత బ్రాంచ్‌కి వెళ్ళేసరికి, అక్కడ పిడుగు పడినంత హడావుడిగా ఉంది.

నేను హెడ్డాఫీసుకు పంపిన కంప్లయింట్ మీద ఆఘమేఘాల మీద ఆర్డర్స్ వచ్చాయట. బ్రాంచ్ 'క్లియరింగ్' సెక్షన్ రికార్డులన్నీ సీజ్ చేస్తున్నారు. నన్ను చూడగానే, జోనల్ మేనేజర్ అగ్గి మీద గుగ్గిల మయ్యాడు.

"యూ....! నాకు ముందే చెప్పొచ్చు కదా? హెడ్డాఫీసుకు ఎందుకు రాశావ్?" అని అరిచాడు.

నేను మూడురోజుల నుంచి, అతని దర్శన భాగ్యంకోసం ఎదురుచూసి, విసిగి వేసారిన విషయం గుర్తు చేశాను.

ఆయన రాగిణిని పిలిచి అపాయింట్‌మెంట్ ఎందుకు ఇవ్వలేదని ఆమె మీద అరిచాడు. కానీ, అదంతా డ్రామా అని నాకు తెలుసు. నా ముందే రాగిణి మూడు సార్లు ఆయన ఛాంబర్‌లోకి వెళ్ళి గుర్తు చేసింది. ఈ చీప్ టెక్నిక్స్‌ను అర్థం చేసుకోలేనంత మూర్ఖుణ్ణి కాదు.

"సార్! ఇది క్రైం. రోజు రోజుకి ఆలస్యమవుతుంటే దీని తీవ్రత పెరిగి నన్ను కూడా ఈ కూపంలోకి లాగేస్తుందేమోననే భయంతోనే మీ దగ్గరకు వచ్చాను. బ్యాంకు నిధులు దొంగలు కొల్లగొడుతున్నారు సార్! మీరు వెంటనే యాక్షన్ తీసుకోవాలి సార్!" అన్నాను బాధగా.

పాపం, ఆయనకేం తెలియకుండానే, ఆయన ప్రమేయం లేకుండానే ఇదంతా జరుగుతోందని నేను అనుకుంటున్నానని ఆయన అనుకునేలా అమాయకంగా చెప్పాను.

ఇంతలో సి.బి.ఐ. పోలీసులు వచ్చారు. వాళ్ళు వచ్చిన పది నిమిషాలకు లోకల్ పోలీసులు వచ్చారు.

వెంటనే దిద్దుబాటు చర్యలు ప్రారంభించారు. 'క్లియరింగ్' ఆపేశారు.

ఐదారుగురు ఆఫీసర్లు, క్యాషియర్లు, సబ్ స్టాఫ్ మెంబర్లను అరెస్ట్ చేశారు.

ఈ కుట్రను బహిర్గతం చేయడంతో నేను అన్ని యూనియన్ల వారికి బద్ధ శత్రువునైపోయాను. కేసు తీవ్రతను తగ్గించడానికి గాను, నన్ను ప్రసన్నం చేసుకోవడానికి యూనియన్లు ప్రయత్నించాయి. నేను మొత్తం కేసు వివరాలన్నీ హెడ్డాఫీసు విజిలెన్స్ సెల్‌కు ఆల్రెడీ పంపించానని చెప్పడంతో తేలు కుట్టిన దొంగల్లాగా సైలెంట్ అయిపోయారు.

జోనల్ ఆఫీసూ, బంజారాహిల్స్ బ్యాంక్ బ్రాంచూ నివురుగప్పిన నిప్పులా ఉన్నాయి. బ్యాంకు టైమింగ్స్ అయిపోవటంతో అన్ని యూనియన్ల వాళ్ళూ మెల్ల మెల్లగా జోనల్ ఆఫీసుకు చేరుకుంటున్నారు.

నన్ను అందరూ కరకర నమిలేలా చూస్తూ నిలబడ్డారు. నాకు మనసులో భయంగానే ఉంది. అక్కణ్ణుంచి వెళ్ళిపోతే ఏ గొడవా ఉండదు. కానీ, ఇప్పటివరకూ ఎంతో ధైర్యం ప్రదర్శించి పోలీసులకు,

### జరిగిన కథ

ఇంటర్నేషనల్ సెక్యూరిటీ ఏజెన్సీలో పని చేసే ఆ అధికారి, మాకనూరులో జరిగిన బ్యాంకు దోపిడీ కేసును ఛేదిస్తాడు. ఆ సందర్భంగా హైదరాబాద్‌లో ఏర్పాటుచేసిన పార్టీలో రామస్వామిని చూసి స్పృహ తప్పుతాడు. గతం గుర్తు కొస్తుంది. కష్టపడి బ్యాంకులో ఉద్యోగం సంపాదిస్తాడతను. కానీ కౌంటర్ లోపలి దృశ్యం అతణ్ణి కలవరపరుస్తుంది. స్టెనో ఆఫీసర్‌గా బదిలీపై వచ్చిన రాగిణి అతణ్ణి ఆకర్షిస్తుంది. బ్యాంకులో జరిగే అవకతవకలను బయటపెడుతుంటాడతను. క్లియరింగ్ సెక్షన్‌లో జరిగే అవినీతిని డీయస్పీకి వివరిస్తాడు.

ఆ తర్వాత...



సి.బి.ఐ.కి ఫిర్యాదు చేసి ఇప్పుడు వెన్ను చూపిస్తే పిరికివాడి కింద జమ కడతారు. అందుకే, నేను కూడా అందరి ముందర హాల్లో నిలబడి, అందరు యూనియన్ నాయకులను చూస్తూ, వాళ్ళు వినేలా,

"మొన్న నా మీద జరిపిన అటాక్ వెనుక ఎవరున్నారో వాళ్ళ గురించి నేను పోలీసులకు అంతా చెప్పాను. అసలు దాడి చేసిందెవరో పోలీసులు కనుక్కున్నారు. వాళ్ళిప్పుడు చంచల్‌గూడా జైల్లో ఊచలు లెక్కబెడుతున్నారు. ఆ దాడి వెనుక సూత్రధారులు ఎవరో, సుపారీ ఎవరిచ్చారో కనుక్కునే పనిలో ఉన్నారు పోలీసులు. కాబట్టి, ఇప్పుడు కూడా ఎవరికైనా అటువంటి పిచ్చి పిచ్చి ఆలోచనలు ఉన్నట్టయితే ఒళ్ళు దగ్గర పెట్టుకుని, మూసుకుని ఉండండి. లేకపోతే...." అని తర్జనితో బెదిరిస్తూ తెగేసి చెప్పాను.

ఇన్నాళ్ళకు నాకు తృప్తిగా ఉంది.

బ్యాంకు వేరు. అది ఒక సంస్థ.

బ్యాంకులో పనిచేసే ఉద్యోగులు వేరు. ఉద్యోగులు కేవలం వ్యక్తులు మాత్రమే.

సంస్థలు శాశ్వతం. వ్యక్తులు వస్తూ పోతూ ఉంటారు. వ్యక్తులకు భయపడి అన్నం పెట్టే సంస్థకు ద్రోహం చేయకూడదు. అది నా వల్ల కాదు.

నేను పకడ్బందీగా కేసును తయారుచేసి అష్ట దిగ్బంధనం చేసేసరికి జోనల్ మేనేజరుకు తప్పని సరి పరిస్థితుల్లో క్రమశిక్షణా చర్యలు తీసుకోక తప్ప లేదు. అరెస్టయిన వారిని సస్పెండ్ చేయడం జరిగింది. అప్పట్లో అదొక గొప్ప సంచలనం.

ప్రజలు, కస్టమర్లు, ప్రెస్ దృష్టిలో నేను హీరోనే అయినా, యూనియన్ల నాయకులు మాత్రం నన్ను పురుగును చూసినట్టు చూడసాగారు.

'క్లియరింగ్' సెక్షన్‌లో ఇంకా కొన్ని పాతిపెట్టబడిన అస్థిపంజరాలున్నాయి. వాటి పని పడదామనుకుంటుండగానే, ఓ గమ్మత్తు జరిగింది.

నేను CAIIB పార్ట్ Iతో పాటూ II కూడా ఒకే అటెంప్ట్‌లో పాసవడంతో పాటు; 'క్లియరింగ్' డిపార్టుమెంట్‌లో ఎన్నో ఏళ్ళుగా జరుగుతున్న కుంభకోణాలను వెలికి తీయడంతో, మా బ్యాంకు ఛైర్మన్‌గారు తనకున్న ప్రత్యేక అధికారాలు ఉపయోగించి, నాకు స్కేల్ టూ (II) ఆఫీసరుగా ప్రమోషన్ ఇస్తున్నట్టుగా హెడ్డాఫీసు నుండి ఉత్తర్వులు వచ్చాయి. దీంతో జోనల్ మేనేజరు గొంతులో వెలక్కాయ పడ్డట్టయింది.

అంతే కాదు. నేను ఛైర్మన్‌గారిని కలిసినప్పుడు బ్యాంక్ లోన్ డెలివరీ సిస్టం మీద ఇచ్చిన నోట్ ఆయనకు బాగా నచ్చి నన్ను అడ్వాన్స్ డిపార్ట్‌మెంట్ మేనేజరుగా పోస్టింగ్స్ కూడా ఇచ్చారు.



## కష్టపడుతున్న కుమారి



కుమారి అంటే హెబ్బా పటేల్! 'కుమారి ఎఫ్' తరువాత హెబ్బా పేరును మరచిపోయి అందరూ కుమారిగానే పిలవడం ప్రారంభించారు. ఆ సినిమా హెబ్బాకు అంత పేరు తీసుకొచ్చింది. ఆ సినిమాలో సన్నగా నాజూకుగా ఉన్న హెబ్బా బొద్దుగా మారిందన్న విమర్శలు తెగ వినిపించాయి. వాటికి చెక్ పెట్టడానికి జిమ్‌లో గంటల తరబడి వర్కవుట్లు చేస్తోందట! మునుపటి ఆకారానికి వచ్చిన తరువాత అవకాశాలు క్యూ కడతాయని హెబ్బా గట్టిగా నమ్ముతోంది. అయితే హెబ్బా ఇక్కడ ఓ విషయం మరిచిపోతోందనీ, ఈ గ్యాప్‌లో సాయిపల్లవి, ప్రగ్యా జైస్వాల్ వంటి వాళ్ళు ఆమెను డామినేట్ చేస్తారని సినీ జనాలు అంటున్నారు.

జోనల్ మేనేజర్ పక్కలో బాంబు పడ్డంత పనైంది. అడ్వాన్స్ డిపార్టుమెంట్ జోనల్ మేనేజర్‌కు ప్రియమైన సెక్షన్. దానికి మేనేజర్‌గా నన్ను వేస్తే ఏం కొంపలు మునుగుతాయోనని పిసుక్కుని చచ్చాడు.

హెడ్డాఫీసులో తన పలుకుబడినంతా ఉపయోగించి నా పోస్టింగ్ ఆపాలని ప్రయత్నం చేశాడు. ఛైర్మన్‌గారు 'ఎందుకు? హీ ఈజ్ ఏ డైనమిక్ ఆఫీసర్. హీ విల్ బీ హెల్ప్‌ఫుల్ టూ యూ' అని గద్దించేసరికి నోరు మూసుకున్నాడని తర్వాత తెలిసింది.

ఇంక తప్పనిసరై, ఆ రోజు సాయంత్రం బ్యాంకు పనివేళలు ముగిసే సమయానికి, జోనల్ మేనేజర్ రామస్వామి నన్ను తన ఛాంబర్‌లోకి పిలిచాడు.

లోపలికి వెళ్ళబోతూ రాగిణి వైపు 'సంగతి ఏమిటి?' అన్నట్టుగా చూశాను.

రాగిణి మౌనంగా ఉండిపోయింది.

అక్కడ చాలా మంది ఆఫీసర్లుండడంతో నేను పరిస్థితిని అర్థం చేసుకున్నాను. మా మధ్య ఉన్న సాన్నిహిత్యం ఎవరికీ తెలియకూడదని రాగిణి చాలా జాగ్రత్తలు తీసుకుంటుంది. నా మీద అటాక్ జరిగినప్పటి నుండయితే ఆఫీసులో మాట్లాడడమే మానేసింది. లంచ్ కూడా నాతో కలిసి చేయడం లేదు. దానికి తోడు, మొన్న నా విషయంలో ZM అందరిముందు ఆమె మీద అరిచినప్పటి నుండి మరీ దూరంగా ఉంటోంది. నేను కూడా వీలైనంత వరకు బ్యాంకులో మాట్లాడడం లేదు.

ఇంటికి వెళ్ళిన తరువాత మాత్రం ఇద్దరం గంటల తరబడి ముచ్చట్లు చెప్పుకుంటాం. తను ముసుగు ధరించి వస్తే నేను హెల్మెట్ పెట్టుకుంటాను. ఇద్దరం అలా బైక్ మీద షికార్లు కొడుతూ వీకెండ్స్ గడుపుతాము.

బ్యాంకులో మాత్రం అంటీ ముట్టనట్టుగా మెయింటెయిన్ చేస్తున్నాం.

అందుకే, రాగిణి మౌనాన్ని అర్థం చేసుకుని లోపలికి వెళ్ళాను.

నన్ను చూడగానే, నవ్వుతూ ఫోన్లో మాట్లాడుతున్న రామస్వామి ముఖం మాడిపోయింది. అర్థంతరంగా ఫోన్ కట్ చేసి, "ఊc! నీకు ప్రమోషన్ ఇప్పించాను. అడ్వాన్సెస్‌కు మేనేజర్‌గా పోస్ట్ చేస్తున్నాను. ఇక..." ఆయన చెప్పబోతున్న మాటలను మధ్యలోనే ఆపి,

"అవును సార్! ఇందాక ఛైర్మన్‌గారు నాకు పర్సనల్‌గా ఫోన్చేసి కంగ్రాట్యులేట్ చేశారు. మీరు నన్ను అడ్వాన్స్ సెక్షన్‌లో వేయవద్దని రిక్వెస్ట్ చేశారని కూడా చెప్పారు." అన్నాను నవ్వుతూ.

ఛైర్మన్ పేరు చెప్పేసరికి ముఖం గంటు పెట్టుకున్నాడు.

"సరే, సరే, ఇకనైనా బుద్ధిగా పనిచేయ్. డోంట్ పోక్ యువర్ బ్లడీ నోస్ ఇన్ టూ అన్‌నెసెసరీ సబ్జెక్ట్స్!" అనడంతో నేను స్తబ్దుణ్ణై పోయాను. ప్రమోషన్ వచ్చినందుకు కనీసం, కర్టెసీగా కూడా, అభినందించలేదు. నన్ను కూర్చోమనలేదు. పైగా నేనేదో ఘోర తప్పిదం చేసినట్టు నన్ను హెచ్చరించడంతో నాకు కోపం నసాళానికి ఎక్కింది.

నేను చేసిన పని వల్ల కొన్నేళ్ళుగా జరుగుతున్న ఫ్రాడ్ బయటపడింది. లక్షల రూపాయల సొమ్ము రికవరీ అయింది. దొంగల పాలపడకుండా కాపాడబడింది. అదెవడిక్కావాలి? ఎందుకంటే, హెడ్డాఫీసులో వ్యక్తిగతంగా జోనల్ మేనేజర్ పరువు పోయింది. హెడ్డాఫీసు చివాట్లు పెట్టింది. ఇదంతా మనసులో పెట్టుకునే నన్ను అవమానపరుస్తున్నాడని నాకర్థమైంది. అందుకే, కోపంగా,

"ఏం మాట్లాడుతున్నారు సార్! అంటే ఇంత వరకు నేను బుద్ధితక్కువ పనులు చేశాననా మీ ఉద్దేశం?" అన్నాను.

నాకు బ్యాంకులో స్కేల్ టూ ఆఫీసర్‌గా ప్రమోషన్ వచ్చిందని క్షణకాలం పాటు సంతోషించినా, నాకు బ్యాంక్ ఉద్యోగం అంటేనే విరక్తి పుట్టింది. సిస్టమ్ మొత్తం అవినీతిమయం, కరప్ట్ అయిపోయినప్పుడు, నేనొక్కడినే ఎంత మేరకు పోరాడగలను? అందుకే ఈ ఉద్యోగం వదిలేయాలని నిర్ణయించుకున్నాను. నా ప్రయత్నాలు నేను చేస్తూనే ఉన్నాను. అందుకే, కొంచెం స్వరం పెంచి, కొంచెం పరిధి దాటి గట్టిగా మాట్లాడాను.

నా మాటలతో అవాక్కయిన జోనల్ మేనేజర్,

"నీ తెలివితేటలు నా దగ్గర ప్రదర్శించకు! నౌ యూ కెన్ గో!" అన్నాడు విసుక్కుంటూ.

"నో!" అని గట్టిగా బల్లమీద చరుస్తూ అరిచాను.

"నో, నేను ఇక్కడి నుండి కదలను! ఐ డోంట్ లీవ్ దిస్ రూం! మీరు అన్నదానికి క్లారిఫికేషన్ ఇవ్వండి. నేను ఏ అనవసర విషయాల్లో తలదూర్చానో చెప్పేవరకు నేను ఇక్కడి నుండి కదలను!" అన్నాను మొండిగా.

జోనల్ మేనేజర్ కంగారుపడి, కొంచెం సర్దుకుని,

"అరే, గో మ్యాన్!" అన్నాడు ఏడుపు ముఖంతో.

"నో! ఐ డోంట్ గో మ్యాన్! మీరంతా పందికొక్కుల్లా బ్యాంకును దోచుకుంటుంటే నేను దాన్ని బయటకు లాగితే, అది బుద్ధిలేని పనా? అది నేను నా బ్లడీ నోస్‌ను పోక్ చేసినట్లా? వాట్ ది బ్లడీ హెల్ యూ మీన్ బై యువర్ వర్డ్స్? టెల్ మీ! అదర్‌వైజ్, ఐ విల్ రిపోర్ట్ దిస్ మ్యాటర్ టూ హెడ్డాఫీస్ అండ్ ఛైర్మన్ పర్సనల్లీ!" అని బిగ్గరగా అరిచాను, నా ముక్కుపుటాలు అదిరిపోతుండగా.

**అతనికి స్కేల్ టూ ఆఫీసర్‌గా ప్రమోషన్ వచ్చింది. దాంతో జోనల్ మేనేజర్ గొంతులో వెలక్కాయ పడ్డట్టు అయింది. అందునా అతణ్ణి అడ్వాన్స్ డిపార్ట్‌మెంట్ మేనేజర్‌గా నియమించారు. ఆ డిపార్ట్‌మెంట్ అంటే జోనల్ మేనేజరుకు ఎంతో ప్రియం. తన పలుకుబడి అంతా ఉపయోగించి అతని పోస్టింగ్ ఆపాలని ప్రయత్నించాడు. తన ప్రయత్నంలో జోనల్ మేనేజర్ సక్సెస్ అయ్యాడా?**

నా అరుపులకి ఆఫీసర్లు, స్టాఫ్ వచ్చి జోనల్ మేనేజర్ రూము ముందర గుమికూడారు. కొందరైతే, ఛాంబర్ లోపలికి తొంగి చూడసాగారు. వాళ్ళందరినీ చూసి,

"ఓకే, లీవిట్ బాబా! ప్లీజ్ డూ వాటెవర్ యూ వాంట్ టూ డూ!" అన్నాడు.

"నో మిస్టర్ జోనల్ మేనేజర్! నేను నీ చెంచాల్లాంటి ఆఫీసరును కాను. ఐ కేరే పిన్ అబౌట్ దిస్ జాబ్! ఈ ఉద్యోగం కోసం నీకు చెంచాగిరీ చెయ్యను. నువ్వు రంకెలు వేస్తే భయపడడానికి నేను నీలాగా దొంగ సొమ్ము మేయడం లేదు. నువ్వూ నీ చెంచా బ్యాచ్ కలిసి బ్యాంకును కొల్లగొడుతున్నారు. ఇంకోసారి నోరు జారితే మొత్తం ప్రెస్సుకు ఇస్తా! నా దగ్గర అన్ని డాక్యుమెంటరీ సాక్ష్యాలున్నాయి. ముందు జైలుకు వెళ్ళేది నువ్వే!" అన్నాను ఆవేశంగా బల్ల

గుద్దుతూ.

జోనల్ మేనేజర్ నా మాటలకు షాక్ తిన్నాడు. అతని సామ్రాజ్యమంతా కూలిపోతున్నట్టుగా విభ్రాంతికి గురయ్యాడు. దాంతో తీవ్రంగా రొప్పసాగాడు. కళ్ళు ఉబ్బిపోయి ఆవేశంతో ఊగిపోసాగాడు.

ఇంతలో, అనూహ్యంగా, రాగిణి నా దగ్గరకొచ్చి,

"ప్లీజ్! కూల్ కూల్! ఆయనకు హై బీపీ ఉంది. అరిస్తే, ఆవేశపడితే డేంజర్! ఏదైనా అయితే మీరే కారణమంటారు. ప్లీజ్ రండి! బయటకు వెళ్దాం." అని చెప్పి నా చెయ్యి పట్టుకుని బలవంతంగా అక్కడి నుంచి బయటకు లాక్కొచ్చింది.

నేను నిర్ఘాంతపోయాను. రాగిణి అంతమందిలో అటువంటి చర్యకు పాల్పడుతుందని నేను ఊహించలేదు. రాగిణి అంతవరకూ పాటించిన జాగ్రత్తలన్నీ గాలికొదిలేసి మా మధ్య ఏదో ఉందన్న విషయం అందరికీ తెలిసేలా నా చెయ్యి పట్టుకుని రావడమంటే... చాలా గొప్ప సాహసమన్న మాటే.

రాగిణి చెయ్యి తాకగానే నేను నా సెన్సెస్‌లోకి వచ్చేశాను.

అందరూ మమ్మల్ని వింతగా చూస్తుండగా మేమిద్దరం బయటకు నడిచాం.

కొంత దూరం నడిచిన తర్వాత నేను నెమ్మదించాను. నా నడక వేగం అందుకోలేక వెనుకపడిపోయిన రాగిణి నా వద్దకు వచ్చేవరకు ఆగి ఆమె చెయ్యి అందుకున్నాను.

తను నవ్వింది. నేను మురిసిపోయాను. వేగంగా నడిచేసరికి ఆమె ఆయాసపడుతోంది. అందుకే ఎదురుగా కన్పించిన 'హావ్ మోర్' ఐస్‌క్రీం పార్లర్‌లోకి దారి తీశాను. లోపల అంతా చీకటి చీకటిగా గమ్మత్తుగా ఉంది. కళ్ళు చికిలించుకుని చూస్తేనే గానీ పక్కసీట్లలో ఉన్నవాళ్ళు కనపడడం లేదు.

'జోనల్ మేనేజర్‌ను తనివితీరా దులిపేశాను.

## లాకర్ నెం.369
### కూపన్ నెం.5 విజేత
**ఎమ్.సునీత**
మల్కాజ్‌గిరి

రాగిణి ధైర్యంగా నా చేయి పట్టుకుంది.' ఈ రెండు కారణాల వల్ల నేనైతే మహానందంగా ఉన్నాను.

ఐస్‌క్రీం తింటూ, రాగిణి వైపు నవ్వుతూ చూసి,

"ఏం మేడం? మీ బాసును బాగానే కాపాడుకున్నారు!" అన్నాను.

"ఇన్‌ఫాక్ట్, నేను మా బాసును కాదు, నిన్ను కాపాడుకున్నాను." అంది నా చేతిని తన చేతిలోకి తీసుకుని.

నేను ప్రశ్నార్థకంగా చూశాను.

"అవును. అతను ఓల్డ్‌మ్యాన్. హై బీపీ ఉన్న మనిషి. ఈ గొడవలో ఆయనకు ఏమైనా అయితే అది మీ రెప్యుటేషన్‌కే దెబ్బ. మీరు చేసిన మంచి పనులన్నీ ఈ ఒక్క దెబ్బతో కొట్టుకుపోతాయి. అప్పుడు అందరూ మిమ్మల్నే టార్గెట్ చేస్తారు. అతనికేమైనా అయితే, మిగతా విషయాలన్నీ వదిలేసి మిమ్మల్ని దీనికి బాధ్యుణ్ణి చేసి జీవితాంతం హంట్ చేస్తారు. ఇది ఇవ్వాళ ప్రొద్దుటి నుంచీ, మీకు స్కేల్ టూగా ప్రమోషన్ ఇస్తున్నారన్న న్యూస్ తెలిసినప్పటి నుంచీ జరుగుతున్న కుట్రలో భాగమే. నాకన్నీ తెలుసు. కానీ, ఏం చేయలేని నిస్సహాయురాలిని. అందుకే, నిన్ను అక్కణ్ణుంచి తీసుకొచ్చేశాను." అంటూ కన్నీరు కారుస్తూ, మరుక్షణంలో, నా ముందు సీటులో నుంచి లేచి నా పక్కకు వచ్చి కూర్చుంది.

నాకా క్షణంలో ఏమైందో ఏమో, ఇంత వరకు తనను ముట్టుకోవడానికి కూడా సాహసించని నేను, ఆమెను నా దగ్గరకు లాక్కున్నాను. 'నా పట్ల తనకున్న కన్సర్న్‌కు' నేనూ ఎమోషనల్ అయ్యాను.

ఆమెకు మరింత దగ్గరగా జరిగాను. ఆమె శరీరంలోని కుడిభాగమంతా నాకు తాకుతోంది. భుజాలు భుజాలు రాసుకుంటున్నాయి. పడుచు గుండెల్లో తథిగిణతోం సంగీతం ప్రారంభమయింది. ఆమె మెల్లిగా టేబుల్ క్రిందనున్న నా చేయిని ప్రేమగా తన చేతుల్లోకి తీసుకుని తన కుడి వక్షానికి ఆనించి,

"చూడు, ఇంకా నా గుండెలు ఎలా కొట్టుకుంటున్నాయో?" అంది.

నాకు షాక్ కొట్టినట్టయ్యింది.

మరుక్షణంలో రాగిణికి తను తన ఆరాటంలో చేసిన పని తాలూకు తప్పిదం గుర్తొచ్చిందన్నట్టుగా, చప్పున చేయి తీసేసింది.

కానీ, ఆ ఒక్క క్షణంలో నేను విద్యుద్ఘాతానికి గురైన పక్షిలా విలవిలలాడిపోయాను. నాకేం జరి

**ఈవారం లాకర్ నెం. 369 చదివారు కదా!**
**మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్‌లో స్పష్టంగా రాసి**
**కూపన్‌ని కత్తిరించి మాకు పంపండి. లక్కీడిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!**

## లాకర్ నెం. 369-7 (9-8-2017)

మా ప్రశ్న: రాగిణితో కలిసి అతను ఏ ఐస్‌క్రీం పార్లర్‌కి వెళ్ళాడు?

మీ జవాబు-----------------------------------------------------------------------------------------

చిరునామా-----------------------------------------------------------------------------------------

---------------------------------------------------------------------------------------------------

----------------------------------------------పిన్-------------------------ఫోన్‌నెం-------------------------------

ఈ కూపన్‌ను 8 ఆగస్టు 2017 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.

మా చిరునామా: నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33



*నిబంధనలు వర్తిస్తాయి

గిందో ముందు అర్థం కాలేదు. అర్థమై ఆనందించే సమయానికి రాగిణి సర్దుకుంది.

అయినా సరే, ఆ క్షణకాలం అనుభూతి నన్ను మైమరచిపోయేలా చేసింది.

ఎంతో బిడియంగా, పద్ధతిగా ప్రవర్తించే రాగిణి అలా చేయడం నన్ను విస్మయంలో ముంచేసింది.

నేనైతే సర్వం మరిచిపోయాను. ఒక వ్యామోహ లోకంలో విహరించసాగాను. బ్యాంకూ, జోనల్ మేనేజరుతో గొడవా అన్నీ డ్రైనేజీలో కొట్టుకుపోయి నంత నిశ్చింతగా ఆ సంగమాన్ని ఆస్వాదించ సాగాను. అప్పటికే ఆమె ఒంటి సుగంధం నాకు పులుముకుంది. కామంతో నా కళ్ళు మంకెన పూలలా మారాయి.

ఒకవైపు మనసులో వింతగా ఇంకా చెప్పాలంటే హాయిగా ఉంది. జీవితంలో మొట్టమొదటి సారిగా ఓ స్త్రీ నన్ను ప్రేమతో తాకుతూ కూర్చుంది. తనే మంటుందో వినే దశలో కూడా లేను నేను. చివరగా

"....నీకేమైనా అయితే నేను తట్టుకోలేను." అంటూ కళ్ళు తుడుచుకుంటుంటే తన వైపు చూశాను.

రాల గుండా నా శరీరంలోకి అడ్రినలిన్‌ను పంప్ చేసినట్టుగా అనిపించింది. నా కేంద్ర నాడీ మండలం స్తంభించింది. నా సర్వావయవాలు మదనుడి బారిన పడి కాలిపోతున్న ఫీలింగ్ కలిగింది. నరాలు జివ్వున పొంగాయి.

ప్రియురాలి మొదటి ముద్దు నన్ను అంతగా ప్రభావితం చేస్తుందనుకోలేదు.

సినిమాల గురించి చెబుతున్నప్పుడు 'లగాన్'కు ముందు 'లగాన్' తరువాత అనో లేదా 'బాహు బలి'కి ముందు 'బాహుబలి' తర్వాత అనో బాలీ వుడ్, టాలీవుడ్‌లను వర్గిస్తుంటారు.

అలా, నా జీవితం కూడా ఆ 'ముద్దు'కు ముందు ఆ 'ముద్దు తర్వాతలా మారిపోయింది.

ఇరుకుగా ఉన్న ఆ సీట్లలో కూర్చున్న ఒక వ్యక్తి, తన పక్కన కూర్చున్న మరో వ్యక్తిని ముద్దుపెట్టుకో వాలంటే అమాంతం ఆ పక్క వ్యక్తి మీద వాలి పెదాలు, పెదాలు కలిసే విధంగా శరీర భంగిమను అడ్జస్ట్ చేసుకుంటేనే గానీ ముద్దు పెట్టుకోవడం కుదరదు. ఆ శరీర భంగిమలో రాగిణి మొత్తం




నేను బాగా విచలితుణ్ణయ్యాను.

'నా కొరకు చెమ్మగిల్లు నయనమ్మొకటి...' ఉందన్న భావన నన్ను సమ్మోహితుణ్ణి చేసింది.

"ఛ, ఛ! డోంట్ గెట్ ఎమోషనల్!" అని ఆమె చెక్కిళ్ళ మీదుగా కారుతున్న కళ్ళ నీళ్ళను తుడి చాను.

అదే క్షణంలో తను నా వైపు తిరిగి నన్ను గట్టిగా కౌగలించుకుని అధరాల మీద గాఢంగా చుంబించింది. నేను నివ్వెరపోయాను.

సాధారణంగా, ఏ రోగి గుండె అయినా ఆగిపోయి నప్పుడు గానీ, ఊపిరి పీల్చుకోలేక సతమతమవు తున్నప్పుడు గానీ, తీవ్రమైన అలెర్జీ ఉన్నప్పుడు తక్షణ ఔషధంగా అడ్రినలిన్(ఎపినెఫ్రిన్) అనే ఇంజెక్షన్ ఇస్తారు. ఆ మందు, నాగస్వరం విని జర జరమని నాట్యమాడే నాగుపాములాగా, శరీర మంతా పాకి, ఆ వ్యాధిని ఒక ఆట ఆడించి, తక్ష ణమే స్వస్థతను చేకూరుస్తుంది.

రాగిణి నన్ను ముద్దు పెట్టుకోవడంతో నా అధ

శరీరం నా మీద వాలిపోయింది. అంతే, దాంతో నాలో నివురుగప్పిన నిప్పులా ఉన్న పడుచు రక్తం బుస్సు బుస్సున పరుగెడుతుంటే, మనసులో కోరికలు పురి విప్పుకుంటుంటే, నేను రాగిణిని బాహువుల్లో బంధించాను.

'ఓహ్! అదొక స్వర్గం, అదొక స్వప్నం, అదొక మధురానుభూతి...'

నిలువెత్తు పూలచెండును కౌగిలించుకున్న ప్పుడు కలిగే పులకింతలు నాలో కలిగాయి. ఇంద్ర ధనుస్సు వర్ణాలున్న పూలవనంలో వలపు రెక్కలు కట్టుకుని విహరిస్తున్నట్టుగా అనిపించింది. ఒక మృదు సుమధుర సంగీత విభావరిలో ఓలలాడు తున్నట్టుగా తన్మయత్వంతో ఊగిపోయాను.

అది ఒక బహిరంగ ప్రదేశమని గానీ, అందరూ మమ్మల్ని గమనిస్తారేమోననే స్పృహ గానీ నాకైతే లేదు.

కొద్ది క్షణాల్లోనే స్త్రీ సహజమైన కాషన్‌తో రాగిణి నా కౌగిలి నుండి విడిపోయి సర్దుకుని కూర్చుంది.

ఆ సమయం, అనంత కాల కొలమానంలో కొన్ని క్షణాలే కావచ్చు. కానీ, నా జీవితాంతం నేను గుర్తుంచుకునే మధుర స్మృతులు.

రాగిణి నన్ను వదలగానే, నేను 'ధభిల్లుమని' నిజ జీవితంలోకి వచ్చి పడ్డాను. చీకటిగానే ఉన్నా, చుట్టూరా ఉన్న యువ జంటలు ఆవేశపడుతున్న మమ్మల్ని చూసి ముసిముసిగా నవ్వుకున్నారు. అట్లాంటి అనుభవం వాళ్ళు ఆల్రెడీ పొందిన వాళ్ళో లేదా పొందాలని ఆశిస్తున్న వాళ్ళో కావడంతో, వాళ్ళేమీ పెద్దగా ఆశ్చర్యపడలేదు.

కానీ, ఒక సంప్రదాయ, తమిళ బ్రాహ్మణ నేప థ్యంలో పెరిగిన రాగిణి మాత్రం సిగ్గు పడిపోయింది. తన మోహావేశానికి తనను తానే నిందించుకుంది.

పరుగు పరుగున పార్లర్ నుండి బయటకు పరుగెత్తింది. నేను ఆమెను అనుసరించాను.

ఆ క్షణం నుండి మా ఇద్దరి మధ్యన ఉన్న బంధం ఏమిటో స్పష్టమైంది. పార్లరుకు దూరంగా నిలబడిన రాగిణిని చేరుకుని ఆమె కళ్ళల్లోకి చూసే సరికి సిగ్గుపడిపోయింది. ఆమె ముఖం సిగ్గుతో పాటు ఒక అనిర్వచనీయమైన అనురాగ వైభవంతో ప్రకాశిస్తోంది. నేను నవ్వుతూ,

"దేవిగారు ఎందుకో అపార ప్రేమరసం కురి పించారు. ఈ దీనుడి జీవితంలో మొట్టమొదటి ముద్దు, ముద్దుగా ప్రసాదించారు. ధన్యుణ్ణి." అన్నాను.

"నా బొందిలో ప్రాణం ఉన్నంత వరకు ఈ ఘడియను మరిచిపోను. ఇప్పుడు ప్రపంచమంతా సప్తవర్ణాల హరివిల్లులతో కూర్చిన వలపు తేరు లాగా అనిపిస్తోంది. మనిద్దరం రతీ మన్మథులమై అందులో శృంగార విహారం చేసినట్టనిపిస్తోంది..." అంటున్న నన్ను మధ్యలోనే ఆపి,

"చాలు బాబూ! ఇప్పటికే సిగ్గుతో చచ్చిపోతు న్నాను." అంది రాగిణి.

"ఏం? ఎందుకు?" అన్నాను.

"కాదా మరి? అంత మందిలో... ఛీ.... ఛీ.... పాడు" అంది.

"ఓహో! అలాగా? అయితే ఏకాంతంలో అయితే ఓకేనా?" అన్నాను.

"నౌ స్టాపిట్ మ్యాన్! నేను బ్యాంకుకు వెళ్ళి నా బ్యాగు తెచ్చుకుంటాను. నువ్వెళ్ళు, ఫో! ఎవరైనా చూస్తే కొంప మునుగుతుంది." అంది కంగారుగా.

రాగిణి మళ్ళీ తన ఒరిజినల్ భద్రతా వలయం లోకి దూరిపోయింది. ఆ మాటలు అంటూనే వడి వడిగా బ్యాంకు వైపు నడిచింది.

కానీ, అప్పటికే కొంప మునిగింది. జోనల్ మేనే జర్ చెంచా ఒకడు మమ్మల్నే పాలో అయ్యాడు. నేను అతన్ని చూడగానే, స్కూటరు స్టార్ట్ చేసుకుని పారిపోయాడు.

నేను ఆ విషయం పెద్దగా పట్టించుకోలేదు. బ్యాంకులో జరిగిన ఘర్షణ తాలూకు కోపం రాగిణి ప్రదర్శించిన ప్రేమ ఉధృతిలో కొట్టుకుపోయింది. మధురోహల్లో తేలిపోతూ రూముకు చేరుకున్నాను.

*(ఇంకా వుంది)*






# దేవుడు బాగా ప్రియం

**కూకట్‌పల్లిలో ఓ బిజీ సెంటర్. ఆ షాపు ముందు నుంచి వెళ్తుంటే మొగలిపువ్వు వాసన గుప్పుమని తగిలింది. అప్రయత్నంగా తలెత్తి చూస్తే 'సాయి పూజా సామాగ్రి' అని కనిపించింది. షాపు కళకళలాడుతోంది. దాన్ని చూసిన వెంటనే శ్రావణమాసం వచ్చేసిందని అర్థమైంది.**

నా నడక వేగం తగ్గటం చూసి నా మిత్రురాలు 'పద.. వచ్చేటప్పుడు వెళ్దాం, ఆలస్యమైతే గుడి మూసేస్తారు' అని నా చేయి పట్టుకొని లాక్కెళ్లిపోయింది. గుడి నుంచి వస్తుంటే షాపు దగ్గర గంధం వాసన. బహుశా మొగలిపువ్వు అగరొత్తులు పూర్తిగా కాలిపోయి ఉంటాయి. అదే మాట అంటే నా మిత్రురాలు నాకేసి చిరాకుగా చూసింది. 'పూజా సామాను షాపుకు అగరొత్తులో, ఆవు నెయ్యో కొనటానికి వెళ్తారు. వాసన చూసి డ్రగ్స్‌ను పసిగట్టే పోలీసు కుక్కలా.. గంధం వాసన చూసి షాపుకు ఎందుకు వెళ్తున్నావే..' అని మిత్రురాలు మొత్తుకుంటున్నా వినకుండా షాపులో అడుగుపెట్టా.

## రకరకాల బ్రాండ్లు

షాపు అద్దంలో నుంచి చూస్తుంటే హోమాలు చేయటానికి ఇన్‌స్టెంట్ హోమగుండాలు పేర్చి ఉన్నాయి. లోపలికి అడుగుపెట్టిన వెంటనే ఎదురుగా పెద్ద వెంకటేశ్వరస్వామి ఫ్రేమ్. చుట్టూ రకరకాల రంగురంగుల లైట్లు. వెనక నుంచి 'ఓం నమోః వెంకటేశ్వరాయ' అని ఓ గొంతు అలసిపోకుండా గోవిందనామాలు జపిస్తోంది. వెళ్లిన వెంటనే కనిపించేలా ఇత్తడి దీపపు కుందులు, అగరుబత్తి స్టాండులు రకరకాల సైజుల్లో జాగ్రత్తగా పేర్చి ఉన్నాయి. తలతిప్పి చూస్తే గోడలకు నల్లటి తాళ్లకు కట్టిన దిష్టిబొమ్మలు వేళ్లాడదీసి ఉన్నాయి. అగరొత్తులు, ఆవునెయ్యి పొట్లాలు, ఒత్తులు, గంధం, పసుపు, కుంకుమ, విభూది పొట్లాలు, సాంబ్రాణి, హోమ సామాగ్రి ఇలా రకరకాల వస్తువులు మొత్తం షాపంతా అమర్చి ఉన్నాయి. వాటిని చూస్తుంటే ఆకారమే లేని భగవంతుడిని ఇన్ని రకాల వస్తువులతో పూజిస్తారా అనిపించింది.

## బిజినెస్ చాలా ఎక్కువ

కౌంటర్ ముందుకు వెళ్లి 'సాంబ్రాణి స్టిక్స్' ఉన్నాయా? అని అడిగా. కౌంటర్ వెనకున్న వ్యక్తి నాలుగు బ్రాండ్ల సాంబ్రాణి స్టిక్స్‌ను బయటకు తీశాడు. ఇన్ని రకాలున్నాయా? అని ఆశ్చర్యపోతుంటే 'తామర ఒత్తులు వచ్చాయమ్మా..నేతిలో నానబెట్టినవి..' అన్నాడు. నా మొహంలో అయోమయం కనిపించినట్లుంది.. కౌంటర్‌లో కూర్చున్న ఓనర్ లేచి వచ్చాడు. 'ఈ ఒత్తులతో రోజూ దీపం పెడితే మంచిది. చీడపీడలన్నీ తొలగిపోతాయి. ఈ మధ్య జీటీవీలో చెప్పారు.. చూడలేదా..?' అంటుంటే దేవుడికీ రోజూ చూసే టీవీకీ అంత దగ్గర సంబంధం ఉందా అనిపించింది. ఆ ఓనర్ నేను ఆలోచనలో పడటం గమనించినట్లున్నాడు. 'ఒకప్పుడు గుళ్లో పూజారి చెబితే అందరూ వినేవారమ్మా! ఇప్పుడు ఆ స్థానం టీవీది. తామర ఒత్తులు వెలిగించమంటే వెలిగిస్తారు. గన్నేరువేరుతో చేసిన విగ్రహాలు పెట్టుకొమ్మంటే పెట్టుకుంటారు. ఒక విధంగా మాకూ మంచిదే. మాకు వాళ్లే మార్కెటింగ్ చేసి పెడుతున్నారు..' అన్నాడు. 'టీవీలో చెప్పింది విని.. ఇక్కడకు వచ్చి కొంటారా?' అన్నా. షాపు ఓనరు అన్నీ తెలిసిన జ్ఞానిలా ఓ చిరునవ్వు నవ్వాడు. 'హైదరాబాద్‌లో పూజా సామాగ్రి బిజినెస్ చాలా ఎక్కువమ్మా! ఏడాదికి అన్ని షాపులు కలిపి ఓ వంద కోట్ల బిజినెస్ చేస్తాయి. రకరకాల వస్తువులు వచ్చేశాయి. ఇంతకు ముందు నాకు చిక్కడపల్లిలో ఒక చిన్న షాపు ఉండేది. పసుపు, కుంకుమ, గంధం, కర్పూరం, సాంబ్రాణి ఇలా కొన్నే అమ్మేవాళ్లం. ఇప్పుడు చూడండి... నా షాపులోనే 90 రకాలు అమ్ముతున్నాం' అన్నాడు. ఒక వైపు నేను ఓనర్‌తో మాట్లాడుతున్నా. నా స్నేహితురాలు షాపంతా వెతికేస్తోంది. 'శ్రావణమాసం కదా.. బిజినెస్ బాగా జరుగుతుందనుకుంటా..' అని ఆగిపోయిన సంభాషణను మళ్లీ పొడిగించా. 'అవునమ్మా! శ్రావణ మాసం వస్తే పండుగలు.. పేరంటాలు.. బిజినెస్ బానే జరుగుతుంది..' అన్నాడు. మా సంభాషణను వింటున్న నా స్నేహితురాలు 'జీఎస్టీ ప్రభావం ఎలా ఉంది?' అంది. 'నీ మొహం.. వీటి మీద జీఎస్టీ ఏంటే..' అని గొంతు తగ్గించి నా స్నేహితురాలిని కసురుకునేలోపే ఓనర్ నర్మగర్భంగా ఓ నవ్వు నవ్వాడు. 'జీఎస్టీ వల్ల కంపెనీలు బాగుపడతాయమ్మా.. మాకు ఎక్కువ లాభం లేదు..' అన్నాడు. పూజా సామాన్ల మీద కూడా జీఎస్టీ ఉంటుందని నాకు అప్పుడే తెలిసింది.

## పెరిగే వ్యాపారమే...

నాకు కావాల్సిన సాంబ్రాణి స్టిక్స్, అగరొత్తులు ప్యాక్ చేయించుకొని డబ్బులు ఇచ్చేసి బయటకు వస్తూ, ఓనర్ దగ్గరకు వెళ్లి 'చిక్కడపల్లి నుంచి కూకట్‌పల్లికి ఎందుకు మారిపోయారు?' అని అడిగా. షాపు ఓనర్ నాకేసి సాలోచనగా చూశాడు. 'చిక్కడపల్లిలో ఓ చిన్న ఆంజనేయస్వామి గుడి ఉండేది. దాని పక్కనే మా వ్యాపారం. ఆ గుడి కూలిపోయింది. భక్తులు తగ్గిపోయారు. దేవుడు లేకపోతే పూజేముంటుందమ్మా! దాంతో కూకట్‌పల్లికి వచ్చేశాం. ఈ గుడి కొత్తగా కట్టారు. వ్యాపారం బావుంది. అయినా టీవీ ఉంది కదమ్మా! మాకేం సమస్య లేదు. కొత్త బాబాలు, ప్రవచనకర్తలు వస్తూ ఉంటారు. కొత్త కొత్త ఉత్పత్తుల గురించి చెబుతూ ఉంటారు. వాటిని జనాలు కొంటూ ఉంటారు. ఇది పెరిగే వ్యాపారమే కానీ తగ్గేది కాదు..' అన్నాడు. ఇంటికి వచ్చిన తర్వాత గూగుల్‌లో పూజా సామాన్ల మార్కెట్ విలువ ఎంత? అని టైప్ చేసి చూశా. ఐదు వేల కోట్ల రూపాయలు! మన దేశంలో దేవుడు బాగా కాస్ట్లీ అనే విషయం అప్పుడు నాకు జ్ఞానోదయం అయింది.

–సీత

email: fbackfm@gmail.com






**మహాభారతం** (మొదటిభాగం)
వ్యాసుడి మూలానికి విధేయంగా సరళవ్యావహారికంలో
**రచన:** ఉప్పులూరి కామేశ్వరరావు
**ధర:** 450 రూ. **పేజీలు:** 342

**మహాభారతం** (రెండవ భాగం)
**రచన:** ఉప్పులూరి కామేశ్వరరావు
**ధర:** 450 రూపాయలు
**పేజీలు:** 308
ప్రతులకు శ్రీజయలక్ష్మీ పబ్లికేషన్స్,
**ఫోన్:** 040–23050986.

చెవినిల్లుకట్టుకుని పోరినా మంచి అంత తొందరగా ఎవరికీ ఒంటబట్టదు. అందుకే మంచిని పదే పదే చెప్పాల్సివస్తుంది. విస్తారమైన జనబాహుళ్యంతో నిండిన సమాజం, వ్యక్తిగత క్రమశిక్షణతో సక్రమంగా అభివృద్ధిబాటలో నడిచిపోవాలంటే అక్కడి మట్టిలో నిక్షిప్తమైన పురాతన చరిత్రను, వర్తమానానికి మార్గదర్శకత్వం చేసే అందులోని నిగూఢతను ఎప్పటికప్పుడు తెలియజెప్పాల్సిందే. అలా తెలియజెప్పేందుకు ఈ కాలానికితగ్గ భాషలో మరోసారి వెలువడినదే ఈ 'మహాభారతం' పుస్తకం. పేరెన్నికగన్న పండితులు, మంచి రచయిత ఉప్పులూరి కామేశ్వరరావుగారి రచన ఇది. 18 పర్వాల ఈ మహాభారత కథను రెండు భాగాలుగా వెలువరించారు టి.ఎల్.పి పబ్లిషర్స్ లక్ష్మీ ప్రసాద్.

బ్రహ్మశ్రీ పుల్లెల శ్రీరామచంద్రుడుగారి ఆశీర్వాదబలంతో, వ్యాసభారతం సంస్కృత మూలాధ్యయనం చేసిన కామేశ్వరరావుగారి రెండేళ్ళ కృషి ఫలితమీ రచన. అతి సాధారణ పదాలలో చేసిన ఈ రచనలో అవసరం అనుకున్నచోట అక్కడక్కడ పద్య తాత్పర్య సహితంగా వివరించారు.

సర్పయాగం చేసిన జనమేజయ చక్రవర్తికి వైశంపాయనమహర్షి చెప్పిన అద్భుత కథ మహాభారతం. ఆ గాథను ఆలకించిన ఋషి కుమారుడు లోమహర్షణుడు నైమిశారణ్యం వెళ్ళి అక్కడి ఋషులకు మహాభారతగాథ చెప్పడం ప్రారంభిస్తాడు. ఇక్కడి నుండి మొదలవుతుంది భారత గాథ.

రచయిత చెప్పినట్టు ఇది మనిషి కథ. మనిషి కోసం చెప్పిన కథ. మనిషి ఎలా ఉండాలో, ఎలా ఉండకూడదో చెప్పే కథ. ఆలోచనాశక్తి, కార్య నిర్వహణా చాతుర్యం, నైపుణ్యం, మంచిచెడుల మధ్య తేడా తెలుసుకోవడం, కష్టాలకు బెదిరిపోకుండా నిలబడటం....వంటి లక్షణాలను బలోపేతం చేస్తుంది మహాభారతకథ. కాకపోతే ఆ చదివిన కథను మనలో నిక్షిప్తం చేసుకోవాలంతే. ప్రపంచంలో తొలి మనస్తత్వ శాస్త్రవేత్తగా, వ్యక్తిత్వ వికాస నిపుణుడుగా ఆవిష్కృతమైన శ్రీకృష్ణుడితో సహా భారతకథలోని ప్రతిపాత్రలోని పరమార్థాన్నీ మనస్సుకు హత్తుకునేలా ఈ రెండు భాగాల్లోనూ పాఠకులు చదువుకోవచ్చు.

---

**చలసాని ప్రసాద్ లేఖలు**
సన్నిధానం నరసింహశర్మకు రాసినవి
**సంపాదకుడు:** మలసాని శ్రీనివాస్
**ధర:** 80 రూ. **పేజీలు:** 92
**ప్రతులకు:** ఎస్.ఎన్.శర్మ, జి–4 మానసనెస్ట్, కాకతీయ హిల్స్, ప్రగతినగర్, హైదరాబాద్–90, సెల్: 92920 55531



ప్రజా ఉద్యమజీవి చలసాని ప్రసాదరావు. కష్టజీవి పక్షం వహించిన కవి, ఆధునిక తెలుగు సాహిత్యాన్ని లోతుగా పరిశీలించిన రచయిత, విమర్శకుడు మాత్రమే కాదు, విప్లవ సాహిత్య బాటసారి. రాజమహేంద్రవరం గౌతమీ గ్రంథాలయాధికారి సన్నిధానం నరసింహశర్మకు చలసాని రాసిన లేఖాసాహిత్యమిది.

## స్వీకారాలు

**ఆంధ్రరాష్ట్రంలో వామపక్ష ఉద్యమ చరిత్ర 1934–1956**
డాక్టర్ కందుకూరి రమేష్
**ధర:** 160 రూపాయలు, **పేజీలు:** 228
**ప్రతులకు:** సృజన, సెల్: 8897594000, ప్రముఖ పుస్తక దుకాణాలు

**ఒకానొక భ్రమ భవిష్యత్తు**
మతంపై మనోవిశ్లేషణాత్మక పరిశీలన
సిగ్మండ్ ఫ్రాయడ్
**అనువాదం:** ఆనందేశి నాగరాజు
**ధర:** 40 రూపాయలు, **పేజీలు:** 64
**ప్రతులకు:** నవచేతన, ప్రజాశక్తి, నవ తెలంగాణ బుక్‌హౌస్‌లు

**భిన్నకాలం**
డాక్టర్ దామెర రాములు
**ధర:** 100 రూపాయలు, **పేజీలు:** 160
**ప్రతులకు:** దామెర శోభారాణి, నిర్మలానర్సింగ్‌హోమ్, నిర్మల్–106
పాలపిట్టబుక్స్, మలక్‌పేట, హైదరాబాద్–36
**ఫోన్:** 040–27678430

–లలితాత్రిపురసుందరి

---

WOW!

## ఎండ్ టు ఎండ్ సర్వీస్

పట్టణాలు, నగరాల్లో దాదాపు ఎక్కువభాగం అద్దె ఇళ్ళలోనే ఉంటున్నారు. పిల్లలకు స్కూళ్ళు దగ్గరగా ఉండాలని, పెద్దలకు ఆఫీసులు దగ్గరగా కావాలని..ఇలా అనేక ప్రియారిటీలను ఏర్పరచుకుంటారు నగరవాసులు. వాటికి తగ్గట్టుగానే ఇళ్ళు వెతుక్కుంటుంటారు. అద్దె కాస్త ఎక్కువైనా సరే తప్పదు కదా అనుకుంటూ అలాంటి ప్రాంతాలకే పరిమితమవుతారు. అలాంటప్పుడు అద్దె ఇళ్ళు దొరకడమే సమస్యగా మారుతుంది. ఇల్లు దొరికినా సామాను షిఫ్టు చేయడం...అదో పెద్ద ప్రహసనంలా మారింది. ఇలా ఇల్లు వెతుక్కోవటం, సామాను షిఫ్టు చేసుకోవటం దాదాపు నెలరోజుల పని. దానికోసం పనులన్నీ మానుకుని తిరగాలి. లేదంటే బ్రోకర్ల మీద ఆధారపడాలి. ఇక అలాంటి కష్టాలేమీ వద్దు, మేమే మీకు అద్దె ఇల్లు వెతికిపెడతాం, సామాను షిఫ్టు చేస్తాం అని చెబుతోంది ఫాస్ట్‌హుడ్ స్టార్టప్.

అతుర్ అగర్వాల్, పీయూష్ గుప్తా ఢిల్లీలో అద్దె




ఇళ్ళ కోసం తిరిగి తిరిగి అలసిపోయారు. ఎన్నో రియల్ ఎస్టేట్ పోర్టల్స్ వెతికారు. బ్రోకర్ల వెంటపడ్డారు. అయినా తమకు అనుకూలమైన, నచ్చిన ఇల్లు దొరకలేదు. ఇక ఇలా అయితే లాభం లేదని తామే రంగంలోకి దిగారు. పనులు మానుకొని, బ్రోకర్లకు ఫోన్ల మీద ఫోన్లు చేసి విసిగెత్తినవారికి, అద్దె ఇల్లు కోసం తిరిగితిరిగి అలసిపోయిన వారికి... ఇల్లు మారడం అనే ప్రహసనాన్ని ఈజీ చేయాలనే ఉద్దేశంతోనే ఫ్లాట్‌హుడ్ అనే స్టార్టప్‌తో అడుగు ముందుకు వేశారు. ఫ్లాట్‌హుడ్ ఒక రియల్ ఎస్టేట్ ప్లాట్‌ఫాం. అద్దె ఇల్లు చూసిపెట్టడం ఫ్లాట్‌హుడ్‌కి ఒక్క రోజులో పని. సామాన్లతో షిఫ్టవడం మహా అయితే పదిరోజుల్లో పూర్తవుతుంది. బ్యాచిలర్, కపుల్, ఫ్రెండ్లీ హౌజెస్ ఇలా కస్టమర్లకు ఎలాంటి ఇల్లు కావాలన్నా వెతికిపెడతారు. ఫర్నీచర్, గృహోపకరణాలు కావాలన్నా సమకూర్చుతారు. ప్రతీసారీ ప్రతీ పనికీ విడివిడిగా చార్జీలు ఉండవు. అంతా వన్ టైం చార్జీలే. ఒక ప్యాకేజీలా మాట్లాడుకుని ఎండ్ టు ఎండ్ సర్వీస్ అందిస్తారు.

అయితే ఫ్లాట్‌హుడ్ రెంటల్ సర్వీస్‌తో పాటు ఇతర సర్వీసులను కూడా అందిస్తోంది. ఇటు ఓనర్లకు, అటు టెనెంట్లకు ఎలాంటి ఇబ్బంది లేకుండా డీల్స్ సెట్ చేస్తోంది. కస్టమర్లు కోరితే ఫ్లాట్‌మేట్స్, రూమ్‌మేట్స్‌ని అరేంజ్ చేసి పెడుతుంది. సమస్యల్లా సర్వీస్ ఫీజు పే చేయడమే అంటారు ఫ్లాట్‌హుడ్ ఫౌండర్ అతుర్. సర్వీస్ ఫీజు అనేసరికి డబ్బుల్లేకుండా పని అవదా అన్నట్టుగా మాట్లాడుతున్నారట. ప్రస్తుతం ఢిల్లీ, గుర్గావ్‌లో ఫ్లాట్‌హుడ్ తన సేవలను అందిస్తోంది. త్వరలో వేరే ప్రాంతాల మీద కూడా ఫోకస్ చేయబోతున్నారు.

–లక్ష్మీశ్రీ నర్మద

# వెన్ను నొప్పి

ఈ వెన్నునొప్పికికారణమైన వెన్నుముక మనశరీరంలో చాలావిశిష్టంగా, సంక్లిష్టంగా ఉంటుంది. వెన్ను భాగంలో లింగమెంట్లు, కండరాలు, ఫేసెట్‌జాయింట్‌లు అనుసంధానమై శరీరానికీ స్థిరరానిస్తూ మన దైనందిక జీవితంలో శారీరకంగా ఎదురయ్యే ఎన్నో ఒత్తిడిలను తట్టుకొని నరాలమీద ఏవిధమైన ఒత్తిడి పడకుండా కాపాడుకోవడం ఈ వెన్నుముక ప్రధాన లక్షణం. పైన పేర్కొన్న వీటిలో ఏదో ఒకదాని మీద ఒత్తిడిపెరగడం, దెబ్బలుతగలడం, అతిగా బరువులు ఎత్తడం, దించడం, ఊభకాయం, ఇన్‌ఫెక్షన్లు, క్యాల్షియం విటమిన్ బి12, డి3లోపాలు ఎముకలు సాంద్రతతగ్గడం వెన్నునొప్పికి గలకారణాలు, మన దైనందిక జీవితంలో ప్రతీక్షణం మెడ, నడుము ఏపనిచేయాలన్నా వీటీఅవసరమే. అందుకే ప్రతి 10 మందిలో 6 నుండి 8 మంది ఈ సమస్యతో బాధ పడుతుంటారు. ఈ వెన్నునొప్పి ద్వారా తమ వృత్తి సంబంధ ఉద్యోగాలను మార్చుకొనుట, సర్జరి కీ, మందులకు, ఫిజియో థెరపికి 70 నుంచి 100 మిలియన్ డాలర్లవరకు ఖర్చుపెడుతున్నారని అంచనా. వెన్నుముకలో 33 ఎముకలు ఉంటాయి. అందులో 7 ఎముకలు మెడభాగంలో, 12 ఎముకలుపైన వీపుభాగం లో, 5ఎముకలు క్రింది వీపు భాగంలో మిగిలిన 9 ఎముకలు క్రింద భాగంలో ఉంటాయి. మెడభాగం లో వచ్చే సమస్యను సర్వైకల్ స్పాండిలైటీస్ అంటారు. **సర్వైకల్ స్పాండిలోసిస్:** ఇది మెడలోని సి1, సి2, సి3, సి4, సి5, సి6, సి7 వెన్నుపూసల అనుసంధానమైన సర్వైకల్ ప్రాంతం అంటారు. ఈ మెడ ప్రాంతం లోని వెన్నుపూస కీళ్ళలో మధ్యలోని ఖాళీ భాగం తగ్గిపోవడం డిస్కుబల్జ్‌కావడం, వెన్నుపూస మధ్యలో రాపిడి ఎక్కువవడం, ఆస్టియోఫైట్స్ చేరడం వలన మెడభాగం నుండి నొప్పి చేతికిమరియు చేతి వేళ్ళవరకు నొప్పితో పాటు తిమ్మిర్లు, చేయి మొద్దు బారడం, మెడ పట్టివేయడం, తలతిరగడం, ఒక్కో సారి వాంతి వచ్చి నట్లుండడం చూస్తు వుంటాము. ఈ సర్వైకల్‌స్పాండిలోసిస్ ఈ ఆధునిక యుగంలో నగరజీవితం గడిపేవారిలో ప్రతి 10మందిలో 5మంది వరకు బాధపడుతూ ఉంటారు. హోమియోపతి చికిత్సావిధానం వీరికి ఓవరంలాంటిది. ముఖ్యంగా ఆసిడ్ ఫాస్ అనేమందు ఏరకమైన సర్వైకల్ స్పాండిలోసిస్‌కైనా పని చేస్తుంది. కొనియం అనే మందు తలవెనుకభాగంలో డల్‌పేన్‌తో మెడబిగుతుతో, తల తిరగడం, తలభారంగా ఉండడం కొనియంలోని ప్రధానలక్షణం. కాల్మియాలాటీ ఫోలియా అనే మందు మెడభాగం నుండి భుజం, చేయి, చేతి వేళ్ళ వరకు నొప్పి ప్రాకుతు ంటుంది. విపరీతంగా ఉండే తిమ్మిర్లు వస్తుంటాయి. కల్కేరియాఫాస్ అనే మందు క్యాల్షియం తక్కువకావడం, విటమిన్ డి3, బి12సమస్యలు మరియు ఆస్టియోఫైట్స్ ఉండి మెడ భారంగా ఉంటుంది. వయసుతో పాటు వచ్చే వెన్నుపూస మార్పులకు అద్భుతంగా పనిచేస్తుంది. ఇంకా బ్రయోనియా, స్పైజిలియా, రస్టాక్స్, జెల్సినియం మందులు డాక్టర్ పర్యవేక్షణలో వాడాలి. **జాగ్రత్తలు:** ఈ మెడ, నడుమునొప్పిసమస్యలు తమ ఉద్యోగ విధులకు ఆటంకం కలిగిస్తుంటాయి. ఈ వెన్నునొప్పితో పని చేసే ఉద్యోగస్తులు 40%వరకు విరామం తీసుకుంటారు. ఒక సర్వే ప్రకారం పూర్తిగా విశ్రాంతి తీసుకున్నా ఈ కండరాలు బిగుసు కొని పోయి ఇంకా నొప్పితీవ్రత పెరిగే ఆస్కారం ఉన్నాయి. బెడ్‌రెస్ట్ తీసుకునే ముందు డాక్టర్ సలహా పాటించి తీసుకోవాలి. ఈ నొప్పినివారణ మాత్రలు ఎక్కువ వాడటం వలన కడుపులో మంట, ఆకలి మందగించడం, వికారంతో పాటు కొన్ని, సైడ్‌ఎఫెక్ట్స్ ఉంటాయి. హోమియోపతిమందులు ఏ విధమైన సైడ్‌ఎఫెక్ట్స్ లేకుండా వ్యాధి మూలకారణాన్ని తొలగి స్తాయి. ప్రతీరోజు నడుము, మెడ సంబంధమైన వ్యాయామాలు,




**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**


డాక్టర్, ఫిజియో థెరపిస్ట్ సలహాతో చేయడం. చాలాసేపు నిల్చోవటం, కూర్చోవటం మానటం, శరీరఎత్తుకు తగ్గబరువును మెయింటెన్ చేయడం, చాలాజాగ్రత్తగా అత్యవసర మైతేనే బరువు లను ఎత్తడం, దించడం. సరైనభంగిమలో కూర్చోవడం ద్వారా వెన్నునొప్పి బారిన పడకుండా కాపాడు కోవచ్చు.

**హోమియోచికిత్స:** జీవితాంతం వేధించే ఈ నొప్పులు ఎన్నాళ్ళు, ఎన్నేళ్ళు అని నిరాశచెందేవారికీ హోమియోపతిలో అద్భుతమైన చికిత్స ఉంది. ఈ వెన్నునొప్పికి కారణమైన డిస్కుబల్జ్, డిస్కకంప్రెషన్, నరాలమీద ఒత్తిడి గురిచేసి తీవ్రమైననొప్పి వస్తువుంటుంది. ఈ సమయంలో హోమియో మందులు వ్యాధి మూలకారణమైన డిస్కుబల్జ్ నరాల ఒత్తిడిలను తగ్గించడానికీ చాలా రకాలైన మందులు న్నాయి. హోమియోపతిలో వెన్నునొప్పికి సింఫైటమ్, అస్క్యులస్‌హిప్, రస్టాక్స్, హైపరికం, ఆర్నిక, బెల్లిస్, బ్రయోనియాఆల్బ్, కాల్కేరియా ఫోర్, సిమిసిఫ్యూగ మొదలగు మందులున్నాయి. ఇది అనుభవజ్ఞులైన డాక్టర్ పర్యవేక్షణలో వాడాలి.



# సంతానలేమికి పరిష్కారాలు

**భార్యాభర్తల్లో ఇద్దరూ సంవత్సరం పాటు ఎలాంటి నిరోధక మందులూ వాడనప్పటికీ సంతానం కలగకపోతే దాన్ని 'సంతానలేమి'గా నిర్ధారించవచ్చు. కొన్నిసందర్భాల్లో కారణం ఏంటన్నది తెలుసుకోవడం సాధ్య కాదు. దాదాపు 10-20% మంది ఇలాంటి సమస్యతో బాధపడుతున్నారు. అయితే ఇక ముందు సంతానలేమితో బాధపడాల్సిన అవసరం లేదనీ, 'ఫర్టి9'లో పముఖ ఫర్టిలిటీ స్పెషలిస్టు డాక్టర్ సి.జ్యోతి.**

కారణాలు తెలియని సంతానలేమిని వైద్యపరిభాషలో అన్ ఎక్స్ ప్లెయిన్డ్ ఇన్‌ఫెర్టిలిటీ అంటారు. దంపతులిద్దరిలోనూ ఎటువంటిలోపం లేనప్పటికీ సంతానం కలగదు. స్త్రీలలో అండాలు క్రమంతప్ప కుండా తయారవుతూ ఉంటాయి. ఎండోమెంట్రియాసిస్ లాంటి సమస్యలేమి ఉండవు. ఫెలోపియన్‌ట్యూబులు ఆరోగ్యంగా తెరుచుకుని ఉంటాయి. పురుషుల్లోవీర్యకణాలఉత్పత్తి సాధార ణంగానే ఉంటుంది. అండోత్పత్తి సమయంలో కూడా శృంగారంలో పాల్గొంటూ ఉంటారు. పోస్ట్ కాయిటల్ పరీక్ష నార్మల్ అని వస్తుంది కానీ సంతానం మాత్రం కలగదు. **కారణాలు: వీర్యకణాల లోపం:** వీర్యకణాలు ఉండాల్సిన దానికన్నా ఎక్కువగా ఉన్నా, తక్కువగా ఉన్నా సమస్యే. అంతేకాకుండా, వీర్యకణాలు అండంలోకి చొచ్చుకునిపోలేకపోవడం మరో కారణం. **ట్యూబల్ బ్లాక్:** అండోత్పత్తి సమయంలో ఫింబ్రియాలు అండాన్ని తోసుకునే ప్రక్రియలో కొన్నిసమస్యలు ఉండొచ్చు లేదాట్యూబల్‌సీలియా సరిగాపనిచేయకపోవచ్చు. **అండోత్పత్తి లోపం:** నాణ్యతలేని, అబ్‌నార్మల్‌గాఉన్న అండాలు ఎక్కువ సంఖ్యలో ఉత్పత్తి కావడం. అండాలకు సంబంధించిన మరో కారణం ల్యుటినైజ్‌డ్ అన్‌రప్చర్డ్ ఫాలికల్‌సిండ్రోమ్, క్రోమోజోమ్‌లనిర్మాణం లోపాలుంటాయి. అండం ఆరోగ్యంగాఉన్నప్పటికీ అండంవిడుదలై కార్పస్ ల్యుటియమ్ ఏర్పడే ముందు అండం అందులో ఇరుక్కు పోతుంది. మైకోప్లాస్మా,కామిడియాలాంటి ఇన్ఫెక్షన్లు కూడా అన్‌ఎక్స్‌ప్లెయిన్డ్ ఇన్‌ఫెర్టిలిటీకి కారణాలు. **వ్యాధి నిరోధక శక్తి ప్రభావం:** వీర్యకణాలు లేకపోయినా, అవి చనిపోయినా అండం విడుదల కావడానికి వీర్యంపైన వ్యాధినిరోధక వ్యవస్థ వ్యతిరేక ప్రభావం చూపుతుంది. అంటే వీర్యకణాలు స్తంభింపచేయడానికి ఒకదానికొకటి అతుక్కుపోవడానికి దోహదంచేస్తుంది. మహిళల్లోఅయితే అండాలపైనకోటింగ్ ఏర్పడుతుంది.దాంతో వీర్యకణాలు వచ్చినప్పటికీఅతుక్కోవు. అండాశయంనుండి విడుదలైన తరువాత దశను ల్యూటియల్‌దశ అంటారు. ఈ దశలో కొన్ని సమస్యలు కారణం కావచ్చు. అందులో కార్పస్‌ల్యుటియల్ ప్రొజెస్టిరాన్ అనే హార్మోన్‌లను విడుదలచేస్తుంది. ఈ హార్మోన్‌ఎండో మెట్రియమ్ ఫలదీకరణంచెందిన అండాన్ని తీసుకోవడానికి సహాయపడు తుంది. కొన్నిసార్లు ఎండో మెట్రియం లోనే సమస్యఉండవచ్చు. **గర్భాశయ కారణాల వల్ల సంతానలేమి:** కొందరు స్త్రీలలో ఎండోమెట్రియంలో లోపం ఉంటుంది. పిండంగర్భాశయ గోడలకు అతుక్కో వడాన్ని కనుక్కోవడం చాలా కష్టం. కొన్ని పరీక్షలద్వారా నిర్ధారించాలి. గర్భాశయానికి సమపాళ్లలో రక్తం అందక పోవడం. ఈస్ట్రోజన్ రిసెప్టార్లు సరిగా లేకపోవడం వల్ల ఇలా జరుగుతుంది. **పరిష్కారం:** ఫోలికల్ నాణ్యత పెంచుతుంది. ప్రొజెస్టిరాన్ కూడా చికిత్సగా ఉపయోగపడుతుంది. దీన్ని ఇంజెక్షన్లుగా ఇవ్వవచ్చు. అసిస్టెడ్ రిప్రొడక్టివ్ టెక్నాలజీద్వారా మంచి ఫలితాలు పొందవచ్చు. ట్యూబులోపాలు, వీర్యకణాలు చొచ్చుకు పోలేక పోవడానికి ఐ.వి.ఎఫ్‌లో మంచి పరిష్కారం దొరుకుతుంది. **ఐ.యు.ఐ:** భర్త నుండి సేకరించిన వీర్యన్ని పరీక్షించిదానిలోనుంచి ఆరోగ్యంగాచురుగ్గా ఉన్నకణాలను వేరుచేసి వాటిని ఒక సన్ననిగొట్టంద్వారా స్త్రీగర్భాశయం లోకిప్రవేశపెడతారు. ఇలా ఒకనెలలో చేస్తే 15% సంతానం కలిగే అవకాశాలు ఉంటాయి. ఇలా ఆరు చక్రాల పాటు ఈ చికిత్స చేసినా ఫలితంలేకుంటే... ఐ.వి.ఎఫ్ ద్వారా ప్రయత్నించ వచ్చు. **ఇక్సీ:** స్త్రీ నుండి సేకరించిన అండాల్లోకి పురుషుని శుక్రకణాన్ని ఒక ప్రత్యేకమైన మైక్రో మానిప్యులేటర్‌సహాయం తో ప్రవేశపెట్టి ఫలదీకరణంచెందిస్తారు. వాటినితిరిగి గర్భా శయంలో పెడతారు. ఈ పద్ధతిద్వారా 40% విజయావకా శాలుంటాయి. శుక్రకణాల సంఖ్య తక్కువగా ఉన్న వారికి ఎక్కువ ఉపయోగం. **ఐ.వి.ఎఫ్:** దీన్నే టెస్ట్‌ట్యూబ్ విధానం అంటారు. ముందుగా స్త్రీనుంచి పక్వమైన అండాలను బయటకు తీసి, పురుషుడి శుక్ర కణాలలో బయటే ఫలదీకరణం చెందిస్తారు. ఇలా ఏర్పడిన తొలిదశ పిండాల్లో 2-3 తిరిగి స్త్రీగర్భాశయంలో ప్రవేశ పెడతారు. దీనిద్వారా 30- 35% విజయావకాశా లున్నాయి. ఫలదీకరించిన పిండాలలో గర్భాశయంలోకి ప్రవేశపెట్టగా మిగిలిన వాటిని అతి శీతల పరిస్థితుల్లో ఉంచి తరువాత ఉపయోగిస్తారు. అవసరాన్ని బట్టి అండాలను గానీ, శుక్రకణాలను గానీ దాతల నుంచి స్వీకరించివాడతారు. అందుకే సంతానం కలగటంలేదని ఏళ్ళ తరబడి బాధపడే వాళ్ళకు సరైన మార్గం, పరిష్కారం **ఫర్టీ 9 హాస్పిటల్**.


**- డా॥ సి.జ్యోతి** ఫెర్టిలిటీ స్పెషలిస్ట్
ఫర్టీ 9 హాస్పిటల్ & పరిశోధనకేంద్రం

# అన్వేషణ 3

-సలీం

నాకేం చేయాలో పాలుపోలేదు. మా ఊళ్ళో గుడిసెలన్నీ ఒక వైపునే ఉంటాయి. అక్కడ తక్కువ కులం వాళ్ళు ఉంటారని అమ్మ చెప్పింది. ఈ ఊళ్ళో కూడా అలానే ఉంటాయనుకున్నా. వెతకటం పెద్దకష్టం కాదనుకున్నా.

"సరే. ఇక్కడికి దగ్గర్లో గుడిసెలు ఎక్కడ ఉంటాయి?" అని అడిగాను.

"ఇలా సక్కగా పోయి కుడివైపుకు తిరిగితే కొన్ని గుడిసెలు కన్పిస్తాయి. ఎక్కువగా మేద రోళ్ళుంటారు. అక్కడికి తీసుకెళ్ళనా? రిక్షా ఎక్కుతావా?" అన్నాడు.

"వద్దు" అన్నాను నడవడానికే నిశ్చయించుకుని. అమ్మ కనిపించేవరకు డబ్బులు జాగ్రత్తగా ఖర్చు పెట్టాలనుకున్నాను.

మళ్ళీ ఆకలేస్తోంది. ఈ పాటికి అమ్మ కన్పిస్తుందనీ, కడుపు నిండా అన్నం తిన్పిస్తుందని కదా ఆశపడ్డాను. ఇప్పుడు భయమేస్తోంది. అసలు అమ్మ కన్పిస్తుందా? అమ్మ ఏ ప్రాంతంలో ఉందో తెలుసుకోకుండా రావడం పొరపాటైంది. పెదనాన్న కూడా చెప్పలేదు.

మెల్లగా నడవసాగాను. కాళ్ళు పీకుతున్నాయి. రోడ్డు మలుపులో కుడివైపుకి తిరగ్గానే ఫర్లాంగు దూరంలో గుడిసెలు కన్పించి, ప్రాణం లేచొచ్చింది. అక్కడే ఏదో ఓ గుడిసెలో అమ్మ ఉంటుందన్న పిచ్చి నమ్మకంతో పరిగెత్తాను.

గుడిసెల బయట కొంతమంది బుట్టలు అల్లుతున్నారు. ఒకతని దగ్గరకెళ్ళి నిలబడ్డాను. అతనికి మా నాన్నకు ఉన్నంత వయసే ఉంటుంది.

"ఏం కావాలి? బుట్ట కొంటావా?" అని అడిగాడు.

"వద్దు. నేను అమ్మకోసం వచ్చాను. ఇక్కడే గుడిసెలో ఉంటుంది".

"అమ్మనా? ఎవరు?"

"అమ్మ పేరు వసుధ. ఏ గుడిసెలో ఉందో చెప్పవా?"

అతను కొద్దిసేపు తల అటూఇటూ తిప్పి చూశాడు. "ఈ గుడిసెల్లో నాకు తెలిసి అలాంటి పేరు గల వాళ్ళు ఎవ్వరూ లేరే. నేనిక్కడ పదేళ్ళుగా ఉంటున్నా. ఇక్కడ సుమారు యాభై గుడిసెలు ఉంటాయి. ఏ గుడిసెలో ఎవరుంటారో నాకు బాగా తెలుసు" అన్నాడు.

"మా అమ్మ కొత్తగా వచ్చింది. నెల క్రితం".

"అవునా?" మళ్ళా అతను తల గోక్కున్నాడు.

"ఏం పని చేస్తుంది?" అని అడిగాడు.

"అన్ని పనులూ చేస్తుంది. కసువూడుస్తుంది. అంట్లు తోముతుంది. వంట చేస్తుంది".

"అవి కాదు. ఏదైనా ఉద్యోగమా?"

"లేదు"

"ఒక్కతే ఉంటుందా?"

"లేదు. కారు నడిపే డ్రైవర్‌తో కలిసి ఉంటుంది."

"అతని పేరు?"

"తెలియదు"

"ఆమెకతను ఏమవుతాడు?"

ఏం చెప్పాలో అర్థం కాలేదు.

నా నుంచి సమాధానం రాకపోయేటప్పటికి మళ్ళా అతనే అన్నాడు. "నాకు తెలిసి ఈ ఏరియాలో కారు నడిపే డ్రైవర్లెవరూ లేరు".

"వేరే చోట గుడిసెలెక్కడుంటాయో చెప్పు. వెతకాలి" అన్నాను.

అతను చెప్పిన అడ్రస్‌ని వెతుక్కుంటూ వెళ్ళాను. అలా చీకటిపడే వరకూ వెతుకుతూనే ఉన్నాను. ఎవర్నడిగినా వసుధ అనే ఆవిడెవరూ తమకు తెలియదనే చెప్పున్నారు. ఒకట్రెండు గుడిసెల్లో కారు డ్రైవర్లు కాపురమున్నారు. కానీ వాళ్ళు కూడా అమ్మ గురించి తెలియదని చెప్పారు.

మళ్ళా రేపు ఉదయం వెతకాలని నిర్ణయించుకున్నాను. బండిమీద అమ్మే నూడుల్స్ కొనుక్కుని తిని మంచినీళ్ళు తాగాను. రాత్రికి ఎక్కడ పడుకోవాలి అనే సమస్య. నాకు బస్టాండ్ గుర్తొచ్చింది. అందులో కుర్చీలు వేసి ఉన్నాయి. కొంతమంది కింద కండువాలు పరుచుకుని పడుకోవటం గమనించాను.

దారి అడిగి తెలుసుకుంటూ బస్టాండ్ చేరుకుని ఓ కుర్చీలో కూచున్నాను. సరిగ్గా నేను కూచున్న చోటే ఫ్యాన్ తిరుగుతోంది. బాగా నడవటం వల్ల అలసిపోయి ఉన్నానేమో వెంటనే నిద్రపట్టింది.

ఎవరో తట్టి లేపుతుంటే లేచి కూచున్నాను. కళ్ళు నులుముకుని చూస్తే ఎదురుగా పెదనాన్న. అప్పటికి తెల్లగా తెల్లారిపోయింది.

నాకు పెదనాన్నని చూడగానే కొడతాడని భయమేసింది. కానీ పెదనాన్న కొట్టలేదు. నన్ను దగ్గరకు తీసుకుని "ఎందుకురా క్రిష్ణా ఇంట్లో చెప్ప



కుండా పారిపోయి వచ్చావు?" అన్నాడు. పెద నాన్న ఒక్కడే నన్ను క్రిష్ణా అని పిలుస్తాడు.

"అమ్మకోసం" అన్నాను.

"చాలా తప్పు చేశావు. ఇంకెప్పుడూ అమ్మను చూడాలనిగానీ కలుసుకోవాలనిగానీ ప్రయత్నిం చకు. మీ అమ్మ మిమ్మల్ని కాదనుకుని వెళ్ళి పోయాక ఆమె చచ్చిన దాంతోనే సమానం. నీకు అమ్మయినా నాన్నయినా ఇకనుంచి నాన్నే. అర్థ మైందా?" అన్నాడు.

అమ్మను చచ్చినదాంతో సమానం అన్నం దుకు బాధనిపించినా సరేనని తల ఊపాను.

"నువ్విలా ఇల్లొదిలి రావడం వల్ల ఎంత అనర్థం జరిగిందో తెలుసా?" అన్నాడు పెదనాన్న.

ఒంగోలు వెళ్ళే మొదటి బస్ ఎక్కి కూచున్నాం. నిన్న సాయంత్రం ఐదింటికే పెదనాన్న విజయ వాడ చేరుకున్నాడట. నేను కన్పించకపోయేసరికి మొదట మా ఊరంతా వెతికారట. తర్వాత ఒంగోల్లో వెతికారట. పోలీస్ కంప్లయింట్ ఇద్దామని కూడా అనుకున్నారట.

'వాడు తప్పకుండా విజయవాడ వెళ్ళి ఉంటాడు. వాడికి వాళ్ళమ్మంటే చాలా ఇష్టం కదా' అందట పెద్దమ్మ. పెదనాన్నకి కూడా అలానే జరిగి ఉంటుందనిపించి వెతకడానికి విజయ వాడ వచ్చాడట.



"నీకోసం రాత్రంతా వెతుకుతూనే ఉన్నాను. రైల్వేస్టేషన్‌తో పాటు రోడ్లన్నీ వెతికాను. క్షణం కూడా నిద్రపోలేదు. ఇక దొరకవనుకుని ఒంగోలు వెళ్ళాక పోలీస్‌స్టేషన్‌లో నువ్వు తప్పిపోయావని కంప్లయింట్ ఇద్దామనుకుని బస్టాండ్‌కొచ్చాను. నువ్వు కుర్చీలో నిద్రపోతూ కన్పించగానే పోయిన ప్రాణం తిరిగొచ్చిందనుకో" అన్నాడు పెదనాన్న.

నేనేమీ మాట్లాడలేదు. "నువ్వు దొరక్కపోతే ఉత్త చేతుల్తో వచ్చిన నన్ను చూసి మీ నాన్న ప్రాణాలు వదిలేసి ఉండేవాడు" అన్నాడు కొద్ది విరామం తర్వాత.

"నాన్నకు ఏమైంది పెదనాన్నా?" అని అడి గాను.

"నువ్వు మీ అమ్మలానే తనని వదిలేసి వెళ్ళి పోయావనీ, ఇంక తిరిగిరావనీ మీ నాన్న ఎంత దిగులుపడ్డాడో తెలుసా? భార్యతో పాటు కొడు కునీ కోల్పోయిన దౌర్భాగ్యుడినంటూ ఏడ్చాడ్రా. ఆరోగ్యం వెంటవెంటనే బాగా పాడైంది. శ్వాస తీసుకోవడం కష్టమైంది. మేము ఒంగోలు ఆస్ప త్రికి తీసుకెళ్ళే లోపల స్పృహతప్పి పడిపోయాడు. నేను మీ పెద్దమ్మని పిల్లల్ని ఆస్పత్రిలో ఉంచి, నిన్ను వెతుక్కుంటూ వచ్చాను. ఏదో ఆశ... నువ్వు విజయవాడకే వెళ్ళి ఉంటావని... నిన్ను పిల్చుకొస్తే నా తమ్ముణ్ణి బతికించుకోవచ్చన్న ఆశ... ఆ దేవుడు చల్లగా చూశాడు" చేతులెత్తి నమస్కరిస్తూ అన్నాడు పెదనాన్న.

"ఇప్పుడు నాన్నకు బాగానే ఉందా?" అని అడిగాను. నేను నాన్నని కాపాడుకోవాలని కదా అమ్మను వెతుక్కుంటూ వచ్చింది. నావల్ల నాన్న ఆరోగ్యం మరింత పాడైందని విని చాలా బాధ అనిపించింది. నాన్న బతుకుతాడా? నా కార ణంగా నాన్నకేమన్నా అయితే తట్టుకోలేను.

"ఏమోరా... ఇప్పుడెలా ఉందో తెలియదు. నిన్ను వెతికి తీసుకొస్తే వాడి ఆరోగ్యం కుదుట పడుతుందన్న నమ్మకంతో విజయవాడ వచ్చే శానుగా" అన్నాడు.

నాన్నను కాపాడమని నాకు తెల్సిన దేవుళ్ళు

## జరిగిన కథ

*ఒంగోలు దగ్గర చిన్న పల్లెటూరు. వాళ్ళిద్ద రిదీ చూడముచ్చటైన జంట. వారికి ఒక్కడే కొడుకు, రామకృష్ణ. ఆరోజు వసుధ త్వరగా పనులన్నీ ముగించుకుని, కొడుక్కి ఎన్నో జాగ్ర త్తలు చెబుతుంది. పేరంటానికని చెప్పి వెళుతుంది. కానీ తిరిగి రాదు. రామకృష్ణ వాళ్ళ నాన్న, పెద నాన్న ఆమె కోసం వెతుకుతారు. చివరకు ఆమె ఎవరితోనో వెళ్ళిపోయిందని తెలుస్తుంది. తండ్రి దిగులుపడి మంచం పడతాడు. దాంతో రామ కృష్ణ తల్లిని వెతకడం కోసం విజయవాడ వెళ తాడు.* **ఆ తర్వాత....**

అందరికి మొక్కుకున్నా. అమ్మ ఎప్పుడైనా ఏమైనా కోరుకున్నది జరిగితే రామాలయం చుట్టూతా వంద ప్రదక్షిణాలు చేస్తానని మొక్కుకునేది. అది గుర్తొచ్చి నేను కూడా ప్రదక్షిణాలు చేస్తానని మొక్కుకున్నా.

ఒంగోలు చేరుకున్నాక నేరుగా ఆస్పత్రికెళ్ళాం. పెద్దమ్మ వంట చేసుకుని తెస్తానని కీర్తిని తీసుకుని ఇంటికెళ్ళిందట. నాన్న దగ్గర సుందరం ఉన్నాడు.

నాన్న స్పృహలో కొచ్చాడట. టైఫాయిడ్ జ్వరం తిరగబెట్టిందని డాక్టర్లు చెప్పారట.

"నువ్వు కొద్దిసేపు నాన్నని చూసుకుంటావా? నేనూ, సుందరం ఇంటికెళ్ళి స్నానం చేసి బట్టలు మార్చుకుని వస్తాం. వచ్చేప్పుడు నీకూ నాన్నకీ భోజనం తెస్తాం" అన్నాడు పెదనాన్న.

సరేనన్నాను. వాళ్ళు వెళ్ళిపోయాక నాన్న మంచం పక్కనే కూచున్నాను.

నాన్న నిద్రపోతున్నాడు. అతని బలహీన మైన గుండె శ్వాస తీసుకున్నప్పుడల్లా మెల్లగా పైకీ కిందికీ కదుల్తోంది. నాన్న చెంపల్ని ముట్టు కుని సున్నితంగా నిమిరాను. గడ్డం మాసిపోయి ఉంది. చెంపలు గుంటలు పడినట్టు లోతుకుపోయి ఉన్నాయి. 'నాన్నా... నాకోసం బతకవా ప్లీజ్.. నువ్వు తప్ప నాకెవ్వరూ లేరు నాన్నా. నాకు నువ్వూ... నీకు నేనూ' అనుకుంటూ ఏడ్చాను.

ఓ గంట తర్వాత నాన్న కళ్ళు తెరిచి చూశాడు. "వచ్చావా బాబూ... వచ్చేశావా... నన్నొ దిలి ఎక్కడికి పోయావు తండ్రీ" అంటూ కన్నీళ్ళు పెట్టుకున్నాడు.

"నేనొచ్చేశాగా. ఏడ్వకు నాన్నా. రెస్ట్ తీసుకో. కళ్ళు మూసుకుని పడుకో" అన్నాను.

"నన్నొదిలి ఎక్కడికీ పోవుగా".

"వెళ్ళను నాన్నా... నిన్నొదిలి ఎక్కడికీ వెళ్ళను" నాకూ ఏడుపొచ్చింది.

"నా నుంచి పారిపోవాలని ఎందుకనుకున్నా

## నిజమో కాదో




చెట్లూ, చేమలూ
నిశి నిశ్శబ్దాన్ని భరిస్తూ
పారే సెలయేళ్ళు, ఝురులు చేసే
గల గల సవ్వళ్ళు వింటూ,
కొండలు తమ, తమ నెలవులు దాటలేక



నిరంతర స్థాణువులై,
కోనలు సుషుప్తిలో,
ఏ కలలు కంటాయో, ఏమో

తనకున్నవి ఏవీ చాలనట్టు
లేనిదానికై ప్రాకులాడుతూ
మట్టికుండను కనక కలశంగా మార్చాలని
చెట్టుక్రింద చల్లని నిద్రను వదలి
కళ్ళ బరువును పెంచే మంచు యంత్రం ప్రక్కన
పగటి కలలు కని,
కనిపెంచిన వాళ్ళను కాదని,
కట్టుకున్నది కళ్ళలో భ్రమగా మిగిలి,
కన్నబిడ్డలు కోరినవన్నీ ఇచ్చి
ఇవ్వవలసిన విలువలు ఇవ్వలేక-
తనకు తెలియకుండానే
తప్పించుకు వెళ్తున్నానా అనిపిస్తుంది.

—ఎ.ఎస్.ప్రభాకర్
సెల్: *99638 87346*

పురా... అమ్మలా నువ్వు కూడా నన్నొదిలి వెళ్ళిపోతే నేను బతకలేనురా, చచ్చిపోతాను" నాన్న నన్ను తన గుండెలకు హత్తుకుని పెద్దగా ఏడ్చాడు.

"అలా అనకు నాన్నా. నువ్వు బాగుండాలనేగా వెళ్ళాను"

"ఎక్కడికెళ్ళావురా?"

"విజయవాడ వెళ్ళాను"

"ఎందుకు?"

"అమ్మను పిల్చుకొద్దామని వెళ్ళాను నాన్నా. నీ కోసమే. అమ్మ తిరిగొస్తే నీ ఆరోగ్యం బాగు పడుతుందని వెళ్ళాను".

నాన్న నా వైపు దిగులుగా చూశాడు. "అమ్మ కనిపించిందా?"

"లేదు నాన్నా."

"నేను బాధపడతానని అబద్ధం చెప్తున్నావు కదూ. అమ్మ రానంది కదూ. నాకు తెలుసు. నేను చచ్చిపోతున్నానని తెల్సినా అమ్మ రాదు. అంత దయగా ఉండే మీ అమ్మ ఒక్కసారిగా రాయిలా ఎలా మారిపోయిందో తెలియటం లేదురా" అన్నాడు.

"లేదు నాన్నా. నిజంగానే అమ్మ కన్పించలేదు. కనపడి ఉంటే నీకు బాగాలేదని తెలిసి తప్పకుండా వచ్చేది నాన్నా".

నాన్న ఏమనుకున్నాడో ఏమో మళ్ళా ఆ ప్రస్తావన తీసుకురాలేదు.

ఆస్పత్రిలో వారం రోజులున్నాక నాన్నని డిశ్చార్జ్ చేశారు. నాన్న తొందర్లోనే కోలుకున్నాడు. కొద్దిగా తినగలుగుతున్నాడు. కళ్ళల్లో జీవం కన్పించసాగింది.

నేను మళ్ళా స్కూల్‌కు వెళ్ళటం మొదలెట్టాను.

***

ఐదేళ్ళు గడిచిపోయాయి. నేను పదో తరగతిలో చేరాను.

ఆ రోజు స్కూల్లో వాంతి అయింది. ఒళ్ళంతా నొప్పులు. జ్వరం వచ్చేలా ఉంది. మాస్టార్ని అడిగి ఇంటికొచ్చేశాను. నాన్న ఉదయమే పొలానికి వెళ్ళాడు. మధ్యాహ్నం భోజనానికి ఇంటికొస్తాడు. నాన్న వచ్చాక నాకు జ్వరం వచ్చిందని తెలిస్తే ఏమైనా మందు బిళ్ళలు తెచ్చివేస్తాడు. మంచం మీద దుప్పటి కప్పుకుని పడుకున్నాను. కళ్ళు మూసుకుంటే చాలు అమ్మ గుర్తుకొస్తోంది.

అమ్మ ఉన్నప్పుడు ఓసారి జ్వరం వస్తే ఎంత బాగా చూసుకుందో, క్షణం కూడా వదలకుండా నా పక్కనే కూచుంది. ధనియాల కషాయం కాచిచ్చింది. గోరువెచ్చటి నీటిలో టవల్ని తడిపి ఒళ్ళంతా తుడిచింది. తలనొప్పిగా ఉందంటే తలకు అమృతాంజన్ రాసి మెల్లగా మర్దన చేసింది. సాయంత్రం నాన్న రాగానే నన్ను డాక్టర్ దగ్గరకు పంపించింది. మూడు రోజులగ్గానీ జ్వరం తగ్గలేదు. నాకు జ్వరం తగ్గేవరకు అమ్మ సరిగ్గా తిండి తినలేదు. కంటినిండా నిద్ర పోలేదు. నాకు మాత్రం అన్నం మెత్తగా చేసి మిరియాల చారు కలిపి తినిపించేది.

ఇప్పుడు ఇంట్లో ఒంటరిగా ఉన్నాను. నా గురించి పట్టించుకునే వాళ్ళెవ్వరూ లేరు. పెద్దమ్మకు చెప్పాలనుకున్నాను. కానీ నాన్న చెప్పింది గుర్తొచ్చి ఆగిపోయాను. బాగా అవసరమైతే తప్ప మనం వేరొకరి మీద ఆధారపడకూడదని కదా నాన్న చెప్పాడు. చివరికి పెద్దమ్మ పెదనాన్న అయినా సరే మనం వాళ్ళకు ఇబ్బంది కలిగించకూడదని చెప్పాడు. అందుకే తలకు అమృతాంజన్ రుద్దుకుని పడుకున్నాను.

మధ్యాహ్నం ఒంటిగంట దాటినా నాన్న రాలేదు. రెండింటికి వస్తాడేమోననుకున్నా. రెండు దాటినా రాలేదు. నాన్న పక్కనుంటే బావుంటుందనిపించింది. మరికొద్దిసేపు ఎదురు చూశాను. రాలేదు. నాన్న కావాలనిపిస్తోంది. నా కోసమే బతుకుతున్నాననే నాన్న...

"జ్వరం వస్తే నాకు చెప్పొద్దా రామూ. ఇలా లోపలికొచ్చి పడుకుంటే ఎలా తెలుస్తుంది?" అంటూ లోపలికొచ్చింది పెద్దమ్మ.

"కొద్దిగా తలనొప్పిగా ఉంది పెద్దమ్మా. అంతే. జొరమేమీ లేదు. అమృతాంజన్ రాసుకున్నాలే. అదే తగ్గిపోతుంది" అన్నాను.

పెద్దమ్మ నా నుదుటిమీద చేయివేసి చూసింది. "జొరం లేదంటావేమిటి? ఒళ్ళు కాలిపోతుంటేనూ. నాకు కీర్తి చెప్పబట్టి సరిపోయింది. స్కూల్లోనే వాంతి చేసుకున్నావట కదా. లేకపోతే నాకూ తెలిసేది కాదు. మా ఇంటికెళ్దాం పద" అంది. కీర్తీ, నేనూ ఒకేక్లాస్... మధ్యాహ్నం భోజనానికి వచ్చినప్పుడు పెద్దమ్మకి చెప్పి ఉంటుంది.

"వద్దు పెద్దమ్మా. కొద్దిసేపైతే నాన్న వచ్చేస్తాడుగా" అన్నాను.

"నాన్న రాడు. కొన్ని రోజులుగా మీ నాన్న మధ్యాహ్నం పూట భోజనానికి ఇంటికి రావడం లేదు. పొలం వద్దనే తినేస్తున్నాడు" అంది.

"మరి ఉదయం పొలానికెళ్ళేటప్పుడు క్యారేజీ ఏమీ పట్టుకెళ్ళటం లేదుగా" అన్నాను.

పెద్దమ్మ కొద్దిసేపు సమాధానం చెప్పలేదు. ఆ తర్వాత మెల్లగా గొణుగుతున్నట్టు "పనివాళ్ళు ఉంటారుగా. ఎవరో ఒకరు పెట్టరా ఏమిటి?" అంది.

చారు కాచి అన్నం పెట్టింది. సయించలేదు. మరోసారి కక్కుకున్నాను. పెదనాన్నని పంపించి మాత్రలు తెప్పించింది. మాత్ర వేసుకున్నాక దుప్పటి కప్పి వెళ్ళింది.

రాత్రి బాగా పొద్దుపోయాక నాన్న వచ్చాడు. నాకు జ్వరం అని తెలుసుకుని తల్లడిల్లి పోయాడు. "నాకు ఎవరిచేతనైనా కబురెట్టాల్సింది వదినా" అన్నాడు పెద్దమ్మతో.

పెద్దమ్మ ఏమీ సమాధానమివ్వలేదు. అమ్మ చేసినట్టే నాన్న సపర్యలు చేశాడు. కాళ్ళు నొప్పిగా ఉన్నాయంటే చాలాసేపు కాళ్ళు పట్టాడు. తల నొక్కాడు. రాత్రికి జావ కాసిచ్చాడు. పక్కనే పడుకుని నిద్ర

**నిద్రపోతున్నాడతను. శ్వాస తీసుకున్నప్పుడల్లా అతని బలహీనమైన గుండె మెల్లగా పైకీ కిందికీ కదుల్తోంది. గడ్డం మాసిపోయి ఉంది. చెంపలు గుంటలు పడినట్టు లోతుకుపోయి ఉన్నాయి. అతని చెంపల్ని సున్నితంగా నిమిరాడు రామకృష్ణ. 'నాన్నా, నువ్వు తప్ప నాకెవ్వరూ లేరు. నాకోసం బతకవూ...ప్లీజ్' అంటూ ఏడుస్తున్నాడు. అసలేమైంది?**

పోకుండా గంటకోసారి ఒళ్ళు వేడిగా ఉందా తగ్గిందా అని చూస్తూనే ఉన్నాడు.

మూడ్రోజులకు జ్వరం తగ్గింది. నాకు జ్వరం తగ్గేవరకు నాన్న పొలానికి వెళ్ళలేదు. ప్రతి క్షణం నన్ను అంటిపెట్టుకునే ఉన్నాడు. అమ్మను మరిపించేలా నా గురించి శ్రద్ధ తీసుకున్నాడు.

మళ్ళా స్కూల్‌కెళ్తున్నానన్న మాటేగాని నాన్న మధ్యాహ్నాలు ఇంటికెందుకు రావడం లేదన్న ఆలోచన మాత్రం నన్నొదలటం లేదు. ఉదయం సరిగా తినకుండానే వెళ్తాడు. నిజంగానే మధ్యాహ్నాలు ఏమైనా తింటున్నాడా లేదా అనే అనుమానం. పెద్దమ్మ చెప్పినట్టు ఎవరైనా పెడ్తున్నారా? ఎందుకో ఆ విషయంలో నమ్మకం కలగడం లేదు. నాన్న పదెకరాల పొలానికి యజమాని. మా పొలంలో పనిచేసే కూలీల కోసం పంట కోతలప్పుడు, నూర్పిళ్ళప్పుడు ఇంటివద్దనే అన్నం వండించి పొలానికి పట్టుకెళ్ళి వడ్డించే అలవాటు.. అలాంటిది ఆ కూలీలు తెచ్చుకునే క్యారేజీల్లోని అన్నం నాన్న తింటాడా?

మధ్యాహ్నాలు నాన్న ఏమీ తినడం లేదనే అన్పించింది. పెద్దమ్మ వాళ్ళకు అలా చెప్పి ఉంటాడంతే. ఎందుకైనా మంచిది ఓసారి పొలానికెళ్ళి నాన్న తింటున్నాడో లేదో తెలుసుకోవాలనుకున్నాను. అలా రోజుల తరబడి తినకపోతే మళ్ళా జబ్బు పడ్తాడన్న భయం.

అమ్మను నాన్న మర్చిపోయి మనుషుల్లో పడ్డాడని పెద్దమ్మా పెదనాన్నా అనుకోవటం విన్నాను. కానీ అది నిజం కాదు. నాన్న అమ్మని తల్చుకోని రోజు లేదు.

ఎన్నోరాత్రుళ్ళు నాన్న నిద్రలేకుండా గడపటం నాకు తెలుసు. ఇద్దరం పక్కపక్క మంచాల మీద పడుకుంటాం. అర్ధరాత్రి దాటినా నాన్న మంచం మీద అస్థిమితంగా కదులుతూ ఉంటాడు. మధ్యరాత్రిలో అమ్మపేరుని కలవరించడం ఎన్నిసార్లు విన్నానో.... ఒక్కోసారి అధాటుగా లేచి "వసుధా వచ్చావా..." అని చుట్టూ కలియజూసి నిట్టూర్చి మళ్ళా పడుకునే ప్రయత్నం చేస్తాడు.

అమ్మను మర్చిపోలేక ఆ దిగులుతో మధ్యాహ్నాలు తిండి మానేస్తున్నాడేమోనన్న అనుమానం. ఆరోజు ఎలాగైనా సరే పొలానికెళ్ళి చూడాలనుకున్నాను. స్కూల్ నుంచి మధ్యాహ్న భోజనానికి ఇంటికొచ్చాక అన్నం తినేసి మళ్ళా స్కూల్‌కెళ్ళకుండా మా పొలాల వద్దకెళ్ళాను.

మా పొలాలు చూసి చాలా రోజులైంది. చిన్నప్పుడు చాలా సరదాగా ఉండేది. పండిన చేను చూడటం చాలా అందమైన అనుభూతి. నాన్నకు ఇష్టముండేది కాదు. 'మాకు సరైన చదువులు లేక పోబట్టి నేనూ మీ పెదనాన్నా వ్యవసాయం మీద ఆధారపడి బతుకుతున్నాం. మా నాన్న మోతుబరి కాబట్టి ఒక్కొక్కరికి పదెకరాల పొలం సాగు చేసుకోడానికి దక్కింది. రెండు మూడు రకాల పంటలు పండించడంవల్ల ఓ పంట సరిగా పండకపోయినా ఆర్థికంగా ఇబ్బంది లేకుండా జరిగిపోతుంది. కానీ నువ్వు మాత్రం ఇందులోకి రావద్దు. బాగా చదువుకుని నెలకింత జీతం వచ్చే ఉద్యోగం తెచ్చుకో. వ్యవసాయం ఇప్పుడు జూదమైపోయింది. ఎప్పుడు గెలిపిస్తుందో ఎప్పుడు నిలువునా ముంచుతుందో తెలియదు' అనేవాడు.

నాకు ఊహ తెలిసినప్పటి నుంచీ ఇంట్లో తిండికి ఇబ్బంది ఉండేదికాదు. గాదెల్లోనో బస్తాల్లోనో ఏడాది సరిపడా గింజలు నిల్వ ఉండేవి. కానీ ఊళ్ళో సన్నకారు రైతులు పంటలు సరిగ్గా పండక, చేసిన అప్పులు తీర్చేమార్గం లేక అవస్థలు పడుతున్నారని నాన్న తరచూ చెప్పేవాడు. గతేడాది ఇద్దరు రైతులు వాళ్ళ పొలంలోనే పురుగుల మందు తాగి ఆత్మహత్య చేసుకున్నారు. రెండు మూడు ఎకరాలకు మించని భూముల్లో వ్యవసాయం చేసిన వాళ్ళే ఎక్కువగా ఇబ్బందులు పడ్తున్నారేమో అన్పించింది.

మా ఊళ్ళో రైతుల ఆత్మహత్యల తర్వాత నాన్నతో ఈ విషయం గురించి అడిగినప్పుడు నాన్న సమాధానం వేరుగా ఉండింది. పదెకరాల పొలం ఉన్నా, పాతికెకరాల పొలం ఉన్నా అకాల వర్షాల వల్ల,

## మనమీదేనర్రోయ్!

సరసి





## భయపడుతున్న నివేదా థామస్

నివేదా భయపడుతున్నది దయ్యాన్నో భూతాన్నో చూసి కాదు. 'ఫిదా' హీరోయిన్ సాయి పల్లవిని చూసి నివేదా భయపడుతోందట! ఇప్పటి వరకూ టాలీవుడ్‌లో నటన పరంగా దూసుకుపోతున్న హీరోయిన్లను వేళ్ళ మీద లెక్కపెట్టవచ్చు. అలాంటి వారిలో తాజాగా నివేదా థామస్ పేరు ఎక్కువగా వినిపిస్తోంది. ఈ సినిమా విడుదలకు ముందు దర్శకనిర్మాతలు నివేదా ఇంటి ముందు క్యూ కడితే ఇప్పుడు సాయి పల్లవి ఇంటి ముందు క్యూ కడుతున్నారట! తన అవకాశాలు ఎక్కడ జారిపోతాయో అని నివేదా కంగారు పడుతోందని సినీ జనాలు అంటున్నారు.

వర్షాభావాల వల్ల, నాణ్యత లేని క్రిమిసంహారక మందుల వల్ల నష్టాలు తప్పవన్నాడు. మరి మనకెందుకు నష్టాలు రావడం లేదని అడిగితే 'నేనూ మీ పెదనాన్నా మా పదెకరాల్లో ఒకే పంట ఎప్పుడూ వేయలేదు. రెండెకరాల్లో మిర్చి, నాలుగెకరాల్లో జొన్న, రెండెకరాల్లో కంది, మిగతా రెండెకరాల్లో కూరగాయలు పండిస్తాం. దానివల్ల ఒక పంటలో నష్టం వచ్చినా అది మిగతా పంటల వల్ల పూడుకుంటుంది. అయినా మేము పదిహేనేళ్ళకు పైగా వ్యవసాయం చేస్తున్నా లక్షలు వెనకేసిందేమీ లేదు. పస్తులు పడుకోకుండా జరిగిపోతుంది. అంతే. ప్రతి సంవత్సరం కత్తిమీద సాములానే ఉంటుంది. పంట చేతికొచ్చే వరకు చాలా ఒత్తిడి ఉంటుంది. నీకీ కష్టాలు వద్దురా' అన్నాడు.

ఆలోచనల్లోనే మా పొలాల్ని చేరుకున్నాను. పొలాల మధ్య వెదురు బద్దల్తో కట్టిన చిన్న గది. దాన్లోనే నీళ్ళు పెట్టే మోటార్ పంప్ ఉంటుంది. దూరంగా చెట్లకింద నలుగురు మగ కూలీలు ఓ వైపు, మరో ముగ్గురు ఆడకూలీలు ఇంకోవైపు కూచుని అన్నాలు తింటున్నారు. అందరూ అటువైపు తిరిగి ఉండటం వల్ల నన్ను చూళ్ళేదు. నేను గదిని సమీపించి లోపలికి వెళ్ళబోయి నాన్న గొంతు విన్పించి ఆగిపోయాను. నాన్న ఎవరితోనో నవ్వుతూ మాట్లాడుతున్నాడు.

"చేపల పులుసు ఎంత రుచిగా ఉందో లక్ష్మీ... తింటుంటే స్వర్గం బెత్తెడు దూరంలో కన్పిస్తోంది" అది నాన్న గొంతు.

"అందుకేగా ఎప్పటినుంచో అంటున్నా, నన్ను పెళ్ళి చేసుకుంటే రోజూ కమ్మగా వండి పెడతాగా, రోజూ స్వర్గమే. నువ్వే నా గోడు పట్టించుకోవడం లేదు" ఓ ఆడదాని గొంతు.

"నీకు చాలాసార్లు చెప్పాను. పెళ్ళి ఊసు ఎత్తొద్దని. నా జీవితంలో భార్యగా వసుధకి తప్ప మరొకరికి స్థానం లేదు" నాన్న గొంతు.

"నేను భార్యగా పనికిరాను కానీ మిగతా వాటికి మాత్రం కావాలి" అందా స్త్రీ నిష్టూరంగా.

"చాల్లే. నీ అవసరాలన్నీ తీరుస్తున్నాగా. అందుకు సంతోషించు. గొంతెమ్మ కోరికలు కోరకు. ఉన్నది కూడా పోగొట్టుకుంటావు" నాన్న గొంతులో కాఠిన్యం.

దూరంగా అన్నాలు తింటున్న కూలీల్లోంచి ఎవరో లేచి నిలబడ్డారు. నేను వాళ్ళకి కన్పిస్తే తప్పకుండా నాన్నకి చెప్తారు. నాకు తెలియకూడని విషయం తెలిసినందుకు నాన్న బాధపడతాడు. అది నేను తట్టుకోలేను. అందుకే గిరుక్కున వెనక్కి తిరిగి వేగంగా ఇంటివైపుకు పరిగెత్తాను.

నాకు తెలిసిన విషయం ఇంట్లో ఇంకెవ్వరికీ తెలియదనుకున్నాను. కానీ ఒకరోజు పెద్దమ్మ పెదనాన్న మాట్లాడుకుంటుంటే చాటుగా విన్నాను.

"ఇలా చాటుమాటు వ్యవహారాలు నడిపే బదులు మన మాటిని దేన్నో ఒకదాన్ని పెళ్ళి చేసుకుంటే పోయేదిగా. పదిమంది నోళ్ళలో నానడం ఏమైనా బావుందా?" అన్నాడు పెదనాన్న.

"మరిది ఆలోచన నాకర్థమైందయ్యా. మన రామక్రిష్ణకి సవతి తల్లిని తీసుకురావడం అతనికి ఇష్టం లేదు. రామక్రిష్ణంటే అంతిష్టం మీ తమ్ముడికి?"

"అది సరే, పోయిపోయి పొలంలో పన్చేసే ఆమెతో అక్రమ సంబంధం పెట్టుకోవడం దేనికి చెప్పు. మన పరువేంగాను? పదెకరాల ఆసామి చేయాల్సిన పనేనా ఇది?"

"అందుబాటులో ఉన్న ఆడదైతే గుట్టుగా ఉంటుందని ఆలోచించి ఉంటాడు. పెళ్ళికాని పిల్లయితే సమస్య కానీ పెళ్ళై ఇద్దరు పిల్లలున్న వెంకటలక్ష్మితో సంబంధం పెట్టుకోవడం వల్ల వచ్చే సమస్య ఏముంటుంది? ఎలాగూ దాని మొగుడు నాలుగేళ్ళ క్రితమే పాము కరిచి చచ్చిపోయాడుగా. ఇద్దరి అవసరాలు తీరుతుంటాయి" అంటూ నవ్వింది.

"నీ మరిది తప్పు చేస్తుంటే మందలించాల్సింది పోయి వెనకేసుకొస్తావేమిటి? రేపోసారి నేనే ఈ విషయం గురించి వాణ్ణి హెచ్చరిద్దామనుకుంటున్నా".

"వద్దయ్యా. అలా చేయబాక. నా మరిది కాబట్టే అలా అంటున్నా. నా మరిది మేలు కోరేదాన్ని కాబట్టే వాళ్ళని వెనకేసుకొస్తున్నా".

"అక్రమ సంబంధం వల్ల కీడు తప్ప మేలు ఎక్కడైనా జరుగుతుందా?"

"నువ్వు సరిగా గమనించావో లేదో... ఆ వెంకటలక్ష్మితో సంబంధం పెట్టుకున్నాకే నీ తమ్ముడు మనుషుల్లో పడ్డాడు. ఎప్పటిలా ఉత్సాహంగా పొలం పనులు చేసుకుంటున్నాడు. ఆ మహాతల్లి కొట్టిన దెబ్బ చిన్నదేమీ కాదు. చావుదెబ్బ. దాన్నుంచి బతికి బయటపడాలంటే ఎంతటి మగాడికైనా ఓ ఆడది అవసరం. నువ్వేమీ అనకు. తెలిసినా తెలియనట్టే ఉండయ్యా" అంది పెద్దమ్మ.

"అవునే.... నువ్వు చెప్పింది నిజమే. వాడిలో ఈ మధ్య జీవకళ కన్పిస్తోంది. కొద్దిగా కండ పట్టాడు. ఒకప్పటి ఉత్సాహం కన్పిస్తోంది. వాడి పెళ్ళాం చేసిన అవమానాన్ని మర్చిపోగలిగితే చాలు. వాడు మనకు దక్కుతాడు" అన్నాడు పెదనాన్న.

నా మనసు మీద ఆ రోజు మరో లోహముద్ర పడిపోయింది. మనిషిలో జీవకళ నిండాలన్నా, ఓ బాధ నుంచి తట్టుకుని నిలబడాలన్నా మనుషులు శారీరక సంబంధాన్ని ఆధారంగా చేసుకుంటారని.

పల్లెటూర్లలో ఏదీ ఎక్కువకాలం గుట్టుగా ఉండదు. పిల్లలకు కూడా మొగుడూ పెళ్ళాల మధ్య ఏం జరుగుతుందో తొందరగా తెలిసిపోతుంది.

నాకిప్పుడు చాలా విషయాలు తెలుస్తున్నాయి. అమ్మ తన సుఖం తాను చూసుకుని వెళ్ళిపోయిందని చిన్నతనంలో విన్నప్పుడు నాకు అర్థం కాలేదు. ఇప్పుడు స్పష్టంగా తెలిసొచ్చింది, సుఖమంటే శారీరక సంబంధంవల్ల వచ్చే సుఖమని.... నాకూ నాన్నకూ అమ్మను దూరం చేసిన ఆ సుఖమంటే అసహ్యం వేయడం మొదలైంది అప్పుడే.

జీవితమంటే భార్యాభర్త, పిల్లలూ, సంసారం... వీళ్ళ బాగోగులు చూసుకోవడం... వీళ్ళ మధ్య ఉండే ప్రేమలూ అనుబంధాలు కాదా? ఎవరి సుఖాన్ని వాళ్ళు వెతుక్కుంటూ పోవడమేనా జీవితలక్ష్యం? జీవితానికి అర్థం ఆ సుఖాన్ని పొందడంలోనే ఉందా? ఆ సుఖం అంత ముఖ్యమైనదా? చివరికి కన్న కొడుకునీ, తాళికట్టిన భర్తనీ వదిలేసి వెళ్ళేంత బలమైనదా?

అమ్మంటే ప్రాణం అనే నాన్న... అమ్మలేకపోతే బతకలేనని ఏడ్చిన నాన్న... మరో స్త్రీతో సంబంధం ఎలా పెట్టుకోగలిగాడు? ఆ సుఖమేదో లేకుండా బతకలేడా? కష్టాల్ని తట్టుకోవాలంటే మనిషికి కావల్సింది మనోధైర్యం కదా. మరి పెద్దమ్మ అలా ఎందుకంది?

నాన్న మరో స్త్రీతో సంబంధం పెట్టుకున్న విషయం తెలిసినప్పటి నుంచి ఆ సుఖమంటే మరింత అసహ్యం వేయడం మొదలైంది.

**(ఇంకా వుంది)**

# గోదావరి పిలుస్తోంది

## –దాట్ల దేవదానం రాజు

**చిక్కని గోధుమరంగుతో గోదావరి మంచి పోటుమీద ఉంది. కలకనీరుతో కలకలలాడుతున్నది. ద్రవంగా కరిగించిన బంగారం ప్రవహిస్తున్నట్లుంది. గోదావరికేసి భయం భయంగా చూస్తోంది గంగ. కన్నుల్ని అటూఇటూ తిప్పుతూ ఆందోళనగా చూస్తోంది. కళ్ళల్లోంచి నీళ్ళు ఉబుకుతున్నాయి. చీర కొంగుతో తుడుచుకుంటున్నది.**

**గోదావరి సందడిగా ఉంది. పడవల ఇంజనుమోతలు నీటిసవ్వడిలో కలిసిపోయాయి. పడవలు, వేటనావలు, ఇసుకబోట్లు.... కలియ తిరుగుతున్నాయి.**

గంగ కాళ్ళు దగ్గరకు ముడుచుకుని మోకాలుపై గెడ్డం ఆన్చి కూర్చుని దృష్టిమరల్చకుండా తదేకంగా చూస్తోంది. ఒకరోజు కాదు రెండు రోజులు కాదు మూడు మాసాలుగా అదే తంతు. క్రమం తప్పని ఎదురుచూపులు... ఎందుకోసం? ఎవరికోసం?

గంగ పక్కనే చిన్నగంప. పైనగుడ్డలతో మూత. ప్రతిరోజు మోసుకొస్తుంది. గంపలో ఏముందో తెలీదు.

మనసులో సుడులు తిరుగుతున్న ఆలోచనలు. పరిసరాలు పట్టించుకోదు. కాసేపు ధ్యానం చేస్తున్నట్టుగా కళ్ళు మూసుకుంటుంది. జ్ఞాపకాల వరద. ప్రతిరోజు కనీసం రెండుగంటలు అలాగే గడుపుతుంది. ఇంటికెళ్ళే ముందు గోదారికి దండాలుపెట్టి కళ్ళు తుడుచుకుని నిశ్శబ్దంగా వెనుదిరుగుతుంది.

ఒకే సమయం. ఒకే చోటు. దినచర్య మారదు.

రావుడు వచ్చాడు. గంగని రోజూ గమనిస్తున్నాడు. 'వింత మనిషి' అనుకున్నాడు. ఏ విషయంలోనూ మనకెందుకులే అని ఊరుకోడు. గడగడా వాగడం అలవాటు. మోకాలు ఎత్తి లుంగీ కట్టుకుంటాడు. గంగ దగ్గరకు వచ్చాడు. ఆమె పక్కన నిలబడ్డాడు. ఆమెకేసి పరీక్షగా చూశాడు. "ఏమిటమ్మా, పొద్దు పొడిచినట్టు రోజూ ఇదే టైముకి ఒంటరిగా వస్తావ్. గట్టుమీద అలాగే కూర్చుంటావు. మాటిమాటికీ కళ్ళు ఒత్తుకుంటూ ఏడుస్తావు. చేతులెత్తి గోదారి తల్లికి నమస్కారాలు పెడతావు. నీది ఈ ఊరే అయ్యుండాలి. నీ ఎదురుచూపులు దేనికో చెప్పమ్మా చెల్లమ్మా?" వరుస కలిపి అడిగాడు.

గంగ మరింత ముడుచుకుపోయింది. చీర కొంగు ముఖానికి అడ్డు పెట్టుకుంది. సన్నగా గొణుక్కుంది. మాట స్పష్టతలేదు. రావుడు రెట్టించలేదు.

'ఏదో బాధల్లో ఉంది ఆడకూతురు... ఏం కష్టమొచ్చిందో పాపం?...' అనుకున్నాడు. రోజూ చూస్తున్న వాడే. ఈవేళెందుకో వైనం అడక్కుండా ఉండలేకపోయాడు. ఎదురుగా నిలబడ్డాడు. గంగకు నలభై ఏళ్ళకు మించివుండవు. చీర అక్కడక్కడ చిరిగి ఉంది. జుట్టురేగి ఉంది. ముఖం వడిలినట్టుగా ఉంది. కళ్ళు తెరచింది. ఎదురుగా తెలియని మనిషి.. లేవబోయింది. "ఆగమ్మా...ఆగు. ఒక్కదానివే కూచుని ఉన్నావు, ఏమిటమ్మా నీ బాధ, కష్టాలు లేనివాళ్ళెవ్వరూ ఉండరు."

మళ్ళీ రావుడే– "ఆర్చేదీ లేదు తీర్చేదీ లేదు అనుకుంటున్నావా? లేదు తల్లీ, బాధను మరొకరితో పంచుకుంటేనే భారం తగ్గుతుంది. తేలికపడతాం" అన్నాడు. గంగ నుంచి సమాధానం లేదు. "నేనూ బతికిచెడిన వాడినే. నాకున్న ఈతి బాధలేమిటో చెపుతాను విను. నేనుపడిన కష్టాలు ఎవరూ పడి ఉండరు" అన్నాడు. గంగ దిగ్గున లేచింది. గంప నెత్తికెత్తుకుంది. కన్నెత్తి రావుడుకేసి చూడలేదు. అడుగు ముందుకేసింది. విచిత్రంగా చూశాడు రావుడు. రెండడుగులేసి వెనక్కి తిరిగిచూసి అంది, "నా మానాన నేనేదో ఒక గొడవాగొందూ లేకుండా కూచుంటే, నీకెందుకయ్యా నన్ను గడిబిడి చేస్తావు. నన్ను ఊరికే పీడించకు" విసురుగా అని గంగ గబగబా నడుచుకుంటూ వెళ్ళిపోయింది. రావుడు నిట్టూర్చాడు.

"ఏం మనిషిరా బాబూ...గోదావరిమీద ఒట్టు, నిన్ను మళ్ళీ పలకరిస్తే... మరీ బొత్తిగా అంత తిక్క పనికిరాదు. ఒకమాట నోటంటావస్తే సరిపోయిందా... కాసింత నిదానం ఉండాలి" రావుడు గొణుక్కుంటున్నాడు.

ఇంటివైపు కాకుండా పక్కకు మరలింది గంగ. గోదావరివంతెన దిగువకేసి నడిచింది. వంతెన స్తంభం చప్టామీద కూర్చుంది. గంపను భద్రంగా పక్కనే పెట్టుకుంది. ఒడ్డుని ఒరుసుకుంటూ చిన్న చిన్న సుడిగుండాలతో గోదావరి... గంగ కళ్ళు మూసుకుంది.

గంగ ఆలోచనలు గతం చుట్టూ తిరుగుతున్నాయి. ముక్కలైన జ్ఞాపకాల్ని ఒకచోటకు తెచ్చుకునే ప్రయత్నం చేస్తోంది. అతుకుల బొంతలా మరకలు పడ్డ తెల్లటిగుడ్డలా రంగువెలిసిన గోడలా మారిపోయిందా తన బతుకు!

పోతురాజును మనువాడి ఈ ఊరు రాగానే తనను అదృష్టవంతురాలన్నారు. పోతురాజు ఊరికి తలలో నాలుకలాంటివాడు. ఎవరికి కష్టం వచ్చినా ముందుంటాడు. అందరికీ అతనంటే ఎంతో అభిమానం. విసుగులేదు. శ్రమ తెలీకుండా పని చేసేవాడు. అబద్ధాలు ఆడి పబ్బం గడుపుకోడు. ఎప్పుడోగాని చుక్కేయడు. అమ్మా అక్కా బావా అన్నా తమ్ముడు బాబాయి వరుసలతో అందర్నీ పిలిచి ఆకట్టుకుంటాడు. చెయ్యెత్తు మనిషి, కండలు తిరిగిన భుజాలు, పిత్తపరిగెలా హుషారుగా ఉంటాడు. గలగలమని నవ్వుతుంటాడు. చేపలవేటకు వెళితే ఒట్టి చేతులతోరాడు. గంపలు నిండుతాయి. గోదారికి ఎదురీదుతాడు. పోతురాజు పెళ్ళాంగా తనకు ఎనలేని గౌరవం. మురిసిపోయింది తను. ఇంటి దగ్గరున్నంతసేపూ తన చుట్టూ తిరగడం ఒక ముచ్చట. ఊరందరికీ కుళ్ళు.

సాయిత్రమ్మ ఇల్లు తగలడినప్పుడు, సీతమ్మ మనవడు బావిలో పడినప్పుడు, ధర్మారావు పడుకునే గదిలో తాచుపాము బుసలుకొట్టినప్పుడు పోతు



> **అందరిలాంటోడు కాదతను. చెయ్యెత్తు మనిషి, కండలు తిరిగిన భుజాలు, పిత్త పరిగెలా హుషారుగా ఉంటాడు. గలగలమని నవ్వుతుంటాడు. చేపలవేటకెళితే ఒట్టి చేతులతోరాడు. గంపలు నిండుతాయి. గోదారికి ఎదురీదుతాడు. పిలిస్తే పరుగెత్తుకెళ్ళే మనిషి. అందరితలలో నాలుకలా బతుకుతాడు. అవన్నీ గుర్తొచ్చిన గంగ, గోదారిమెట్లమీద కూర్చుని తెగ మురిసిపోయింది. అతడికోసమే ఎదురుచూస్తోంది. అతడెప్పుడొస్తాడో?**

రాజే ముందుకురికాడు. వాళ్ళ ప్రాణాలు రక్షించాడు. అర్ధరాత్రి బిడ్డ అడ్డంతిరిగి సూర్యకాంతం కోడలు ప్రసవవేదన పడుతున్నప్పుడు ఆగమేగాలమీద నర్సమ్మను తీసుకొచ్చి ధైర్యం నింపాడు. అంతెందుకు తనకు తీవ్రంగా జ్వరంతగిలి దుప్పటి కప్పుకుని నీరసంగా వణకుతున్నప్పుడు రాత్రంతా చెంతనే ఉండి సేవలు చేశాడు. పోతురాజు కొండంత అండ తనకూ ఊరోళ్ళకు కూడా.

ఎండపొడ మీద పడడంతో ఉలికిపడింది గంగ. గోదావరికి నమస్కారాలు చేసి గంప తలకెత్తుకుంది. గబగబా అడుగులేసుకుంటూ ఇంటివైపు దారితీసింది.

***

మర్నాడు ఉదయం తను ఎప్పుడూ కూచునే చోటులోనే కూర్చుంది గంగ.

గోదావరి అలలు గట్టుకేసి టపటపా కొట్టుకుంటున్నాయి. చప్పట్లతో రారమ్మని పిలుస్తున్నట్లుగా ఉంది. నీటి సైగలు కొందరికే అర్ధమౌతాయి. వెతుక్కుంటూ వచ్చినట్లు రావుడు మళ్ళీ వచ్చేశాడు. ఊరుకున్నాడా? "నిన్న రాకూడదని గోదారిమీద ఒట్టు పెట్టుకున్నానుగానీ మనసు ఊరుకోవడం లేదు. ఇన్నాళ్ళుగా ఎవరికోసం వత్తున్నావు? అసలు నీక్కావలసిందేమిటి? ఇంతకీ ఆ గంపలో ఏముంది? చెప్పుతల్లీ..." అడిగాడు రావుడు.

రావుడుకేసి తీవ్రంగా చూసింది గంగ. అనవసర విషయాల్లో కలుగచేసుకుంటున్నాడనే భావం ఆ చూపులో ఉంది.

లేచింది. గంప అందుకుని రుసరుసలాడుతూ రావుడివైపు చూడకుండా పరుగెత్తింది. ఈసారి శివం బాత్‌కు కుడిపక్కగా చేపలవేలం జరిగేచోటు దాటుకుంటూ రేవుకోసం కట్టిన మెట్లపై కూచుంది.

నిశ్శబ్దంగా ఉంది. గోదావరి గలగలలు తప్ప మరేమీ వినిపించడం లేదు.

కాసేపటికి పోతురాజు తలపులు మళ్ళీ గంగను చుట్టుముట్టాయి. ఈ గోదారిగట్టు చూస్తేచాలు మావ గుర్తుకు వచ్చేస్తాడు. మావను తలవడాన్ని మించిందేమీ లేదు. ఈవేళైనా రేపైనా తనకోసం వచ్చి తీరతాడు.

పోతురాజుకు తనంటే ఎంతప్రేమ? ఎన్నాళ్ళైందో కలిసి, అతన్ని చూడాలి. అతని సమక్షంలో గడపాలి. అతని తీయని మాటల్లో కరిగిపోవాలి. కళ్ళెదుటకు రాగానే అమాంతం వాటేసుకోవాలి. చుట్టూ ఎవరున్నా సరే.

అంతలోనే నవ్వు వచ్చింది. అంతటి మనిషి కూర తినేటప్పుడు చేప ముళ్ళుంటే భయపడిపోయేవాడు. జాగ్రత్త...జాగ్రత్త అంటూ చిన్నప్పుడు వాళ్ళ అమ్మ భయపెట్టిందట. అది అలాగే ఉండిపోయింది. వేళాకోళం చేసేది. ఉడుక్కునేవాడు. తనకేం భయంలేదని వాదించేవాడు. అసలు సంగతి తెలుసు కదా. జాగ్రత్తగా ముళ్ళు తీసిపెట్టి బత్తాయి





తొన అందించినట్టు నోటికి అందించేది. తినడానికి నోరుతెరచి ఒక్కోసారి వేలు కొరికేసేవాడు. చివుక్కు మనేది. అయినా బావుండేది.

పోతురాజు పేరు నచ్చలేదు. పనికి ఎగనామం పెట్టి తిండి మెక్కేవాడి పేరులా ఉందని గొడవ పెట్టేది గంగ. బండగా మొద్దుపేరులా అదేం పేరని మార్చేయమంది. గోదారిపొంగులా పడిపడి నవ్వే వాడు.

"నా పేరంటే ఏమనుకున్నావే? ఊరి పొలిమేరల్లో ఉండే గ్రామదేవతలు వందమందికీ ఒక్కగా నొక్క ముద్దులతమ్ముని పేరంట. మా అమ్మా అయ్యలు ఎవరి దిష్టీ తగలకూడదనే ఈ పేరు పెట్టారు. మార్చుకుంటే దేవతలు కోప్పడతారే తింగరి బుచ్చీ..." అని బిగ్గరగా నవ్వేసేవాడు.

ఏ పేరైతేనేం, తన మొగుడు బంగారం అని సరిపెట్టుకుంది. మళ్ళా ఆ ఊసు మరెప్పుడూ తీసుకు రాలేదు.

అట్లతద్దికి ఉయ్యాల కట్టాలంటే పోతురాజే గతి. పొన్నమండోళ్ళ దొడ్లో పెద్దవేపచెట్టుకు బలమైన తాడుతో ఉయ్యాల కట్టేవాడు. గోనెసంచిలోకి ఎండుగడ్డి కుక్కి మెత్త తయారుచేసేవాడు. ఎంత సేపు ఊగినా అలుపు ఉండేది కాదు. పండగరోజు ఆడంగులందరికీ ఉయ్యాల దగ్గరే కాలక్షేపం.

ఒకసారి ఒంటికన్ను బుచ్చి ఊగుతూ పడి పోయింది. ఇక చూసుకోండి నా సామిరంగా, కావాలనే పెమ్మాడిజానకి గట్టిగా తోసిందని గొడవపడితే పోతురాజే రాజీ చేశాడు. లేకపోతే కొట్టుకుని చచ్చే వారు. ఆవంకా ఈవంకా పెట్టుకుని, అంతకు ముందు నుంచీ లోలోన కుతకుతలాడుతున్న చిన్న చిన్న కోపతాపాలు బయటపడి దెబ్బలాట మరింత తీవ్రమయ్యేది. ప్రతి అట్లతద్దికి ఈ సంగతి చెప్పుకోవడం అలవాటైంది ఊళ్ళో.

ఇక గోదారి ఈత అంటే పోతురాజు గురించే చెప్పుకుంటారు. అంతవేగంగా ఈదడం ఈ చుట్టుపక్కల ఎవరితరమూ కాదు. చిన్నప్పట్నుంచీ గోదారి నీళ్ళలో గంటలకొద్దీ నానిన శరీరం అది. చేతులూ ఒళ్ళూ ఒరిసిపోయినా తనివి తీరేది కాదట ఈదడానికి. పందాల్లో ఎప్పుడూ మావదే గెలుపంట.

గోదావరి అలలు మెట్లను పెడేల్మని కొడుతున్నాయి. తనని చేతులు సాచి పిలుస్తున్నట్లుగా ఉంది.

ఏటిగట్టుకి కొంచెందూరంలో అలజడి. ఎవరో ఇద్దరిమధ్య వాదనలు, కొట్లాట, అరుపులు, తిట్లు. నువ్వెంతంటే నువ్వెంత అనుకునే కేకలు. ధ్యాన భంగం అయినట్లుగా ఈ లోకంలోకి వచ్చింది గంగ.

గోదారిని తేరిపార చూసింది. ఏటవాలు కిరణాలుపడి ఎండలో వడియాలు ఎండబెట్టినట్టుంది. అప్పుడు చూసింది రావుడ్ని. కింది మెట్టుమీద నీరు తగిలేచోట నిలబడి ఉన్నాడు. ఎప్పుడూ నవ్వు ముఖంతో ఉండే రావుడు ఇప్పుడు అలా లేడు. అతనిలో విచారం కొట్టొచ్చినట్లు కనిపిస్తున్నది. గంగను సానుభూతితో చూస్తున్నాడు. ఇంతకుముందు ఉన్నట్టు ఏదో తెలుసుకోవాలనే ఆతురత రావుడిలో లేదు.

'వీడు తనను వదిలేలా లేడు, మరోచోటుకు పోవాలి' అనుకుంది గంగ. గంప ఎత్తుకోడానికి చేతిలో తడుముకుంది. "నిన్నరాత్రి తెలిసింది నీ గురించి. నీ బాధ ఎవరూ తీర్చేదికాదు. దుఃఖం ముంచుకొస్తే గోదారితల్లే ఓదార్చాలి. మనం నిమిత్త మాత్రులం. ఏం జరగాలనుంటే అది జరుగుతుంది. ఎవరూ తప్పించలేరు. నిబ్బరంగా ఉండమ్మా... ధైర్యంగా బతుకు బండి లాగించాలి" రావుడు సానుభూతిగా అన్నాడు.

అర్థంకానట్టు చూసింది గంగ. ఇతగాడు మాట్లాడేది దేనిగురించి? తనగురించి ఏం తెలిసింది? అమాయకంగా చూసింది రావుడుకేసి. ఒక్కో మెట్టు ఎక్కుతూ దగ్గరకు వస్తున్నాడు.

కూచున్న చోటు నుంచి కదలలేదు గంగ. రావుడినే చూస్తోంది. ఏం చెప్పబోతున్నాడు? "గోదారికి ఎదురొడ్డి ఈదే మొనగాడు తన ఊపిరిని ఆ నీటికే అర్పించేయడం నీ దౌర్భాగ్యం కాకపోతే ఏమిటి? నీ ఎదురుచూపులు చూస్తుంటే అతనిమీద నీ ప్రేమ ఎలాంటిదో తెలుస్తున్నది. పోయినోడితో మనమూ పోలేం కదా. ధైర్యంగా ఉండమ్మా" అంటూ గంపకేసి చూశాడు. బలవంతంగా గంపలాక్కుని పైగుడ్డ తొలగించి చూశాడు. గుప్పిట విప్పిందాకానే ఏదైనా, తీరా చూస్తే ఏముంది? దోసెడు అమాయకత్వం, గిద్దెడు ప్రేమ రంగరించినట్టు....ఉడకపెట్టిన కర్రపెండలం, అరిసెలు.

రావుడు పకపకా నవ్వాడు. తెరలు తెరలుగా నవ్వుతూనే ఉన్నాడు. అక్కడితో ఊరుకోలేదు. "ఓసి వెర్రిమొగమా..." అని ఒక అరిసె తీసుకుని నోట్లో పెట్టుకుని కొరికాడు. 'బావుంది' అంటూ ఒక్క గెంతు గెంతి రెండేసి మెట్లు దాటుకుంటూ వెళ్ళిపోయాడు.

గంగ ముఖం పాలిపోయింది. లేచింది. ఒక్కో మెట్టు దిగుతోంది. పాదాలకు తడి తగిలింది.

ఎవరో దూరం నుంచి అరుస్తున్నారు, "ఆ ఆడకూతురెవరో గోదావరిలో మునిగిపోతోంది. రండి... రండి.... కాపాడుదాం".

*సెల్: 94401 05987*




ఆగస్టు 2 నుంచి
ఆగస్టు 8 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



### మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, చిన్నారులు, వృత్తి వ్యాపారాలు, విద్యా విషయాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో విద్యార్థులకు శుభప్రదం. శుభవార్త అందుకుంటారు. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 4, 5, 6 తేదీల్లో చిన్నారుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. వృత్తి, వ్యాపారాల్లో కొంత నిరుత్సాహకరంగా ఉంటుంది. సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 7, 8 తేదీల్లో పెట్టుబడులు లాభిస్తాయి. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. చిన్నారులు, ప్రియతముల విషయాల్లో శుభపరిణామాలు సంభవం.



### వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

బదిలీలు, వేడుకలు, ప్రయాణాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో కుటుంబ వ్యవహారాలు ఉల్లాసం కలిగిస్తాయి. ఇంటి కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. గృహరుణాల కోసం ప్రయత్నిస్తారు. 4, 5, 6 తేదీల్లో వేడుకల్లో అసౌకర్యానికి గురయ్యే అవకాశం ఉంది. బదిలీ ప్రయత్నాలు ఫలిస్తాయి. దూరంలో ఉన్న ప్రియతములు ఇల్లు చేరతారు. గృహారంభ ప్రవేశాలకు అనుకూలం. 7, 8 తేదీల్లో పైఅధికారుల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల్లోని వారు పెద్దల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు.



### మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

వేడుకలు, పెట్టుబడులు, విద్యా విషయాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. జనసంబంధాలు విస్తరిస్తాయి. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లకు అనుకూలం. 4, 5, 6 తేదీల్లో ఆర్థిక విషయాల్లో సన్నిహితుల సహకారం లోపిస్తుంది. పెట్టుబడుల్లో ఆచితూచి వ్యవహరించాలి. విద్యకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. పూర్వ మిత్రులను కలుసుకుంటారు. 7, 8 తేదీల్లో విద్యార్థులకు శుభప్రదం. ప్రయాణాలు, చర్చల్లో సత్ఫలితాలు సాధిస్తారు. ఉన్నతవిద్యా ప్రవేశాల కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి.



### కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

అదనపు ఆదాయం, పెట్టుబడులు, వేడుకలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో వృత్తి వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరం. అదనపు ఆదాయం కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. 4, 5, 6 తేదీల్లో స్పెక్యులేషన్లు లాభించకపోవచ్చు. ఆర్థిక వ్యవహారాల్లో భాగస్వామి వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. వేడుకల్లో పాల్గొంటారు. 7, 8 తేదీల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. బహుమతులు ఇచ్చిపుచ్చుకుంటారు. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు.



### సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

వేడుకలు, వృత్తి, వ్యాపారాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో పొదుపు పథకాలపై ఆశించిన ప్రతిఫలం అందుకుంటారు. ప్రేమానుబంధాలు బలపడతాయి. విద్యార్థులకు శుభప్రదం. 4, 5, 6 తేదీల్లో కృషి రంగంలో పట్టుదలతో లక్ష్యాలు సాధిస్తారు. ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. హోటల్, వైద్యం, పరిశ్రమలు, వ్యవసాయ రంగాలవారు ఆచితూచి వ్యవహరించాలి. 7, 8 తేదీల్లో వివాహాది శుభకార్యాల్లో పాల్గొంటారు. శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. జనసంబంధాలు విస్తరిస్తాయి. స్పెక్యులేషన్లకు అనుకూలం.



### కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

బదిలీలు, ఇల్లుమార్పు, విద్యా విషయాలు, సమావేశాలకు ఈ వారం ప్రాధాన్యమిస్తారు. బుధ, గురువారాల్లో కుటుంబ వ్యవహారాలు ఉల్లాసం కలిగిస్తాయి. గృహారంభ, ప్రవేశాలకు అనుకూలం. దూరంలో ఉన్న ప్రియతములు ఇల్లు చేరతారు. రియల్ ఎస్టేట్, నిర్మాణరంగాల వారికి అనుకూలం. 4, 5, 6 తేదీల్లో విద్యార్థులకు లక్ష్య సాధనలో ఆటంకాలు ఎదురవుతాయి. ప్రయాణాలు, చర్చల్లో నిదానం పాటించాలి. ఒక సమాచారం కలవరపెడుతుంది. 7, 8 తేదీల్లో విందు వినోదాల్లో పాల్గొంటారు. వృత్తి, వ్యాపారాల్లో గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు. చేపట్టిన పనులు పట్టుదలతో పూర్తి చేస్తారు.



### తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

ప్రేమానుబంధాలు, పెట్టుబడులు, బృంద కార్యక్రమాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో సోదరీ సోదరుల వ్యవహారాలు ఉల్లాసం కలిగిస్తాయి. విలువైన పత్రాలు అందుకుంటారు. విద్యాసంస్థల్లో ప్రవేశానికి అనుకూలం. 4, 5, 6 తేదీల్లో ప్రియతముల రాకతో ఇల్లు సందడిగా ఉంటుంది. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారు జాగ్రత్తలు పాటించాలి. గృహరుణాల మంజూరులో ఆటంకాలు ఎదురవుతాయి. 7, 8 తేదీల్లో వేడుకలు, శుభకార్యాల్లో పాల్గొంటారు. బంధుమిత్రుల కలయిక ఆనందం కలిగిస్తుంది. పెట్టుబడులు లాభిస్తాయి. ప్రేమానుబంధాలు బలపడతాయి.



### వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, అదనపు ఆదాయం, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో వృత్తి, వ్యాపారాల్లో ఆర్థికంగా ప్రోత్సాహకరంగా ఉంటుంది. అదనపు ఆదాయం లభిస్తుంది. పెద్దల సహకారంతో ఆర్థికపరమైన లక్ష్యాలు సాధిస్తారు. 4, 5, 6 తేదీల్లో ఇంటర్వ్యూలలో నిరాశ తప్పకపోవచ్చు. విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. ఒక శుభవార్త ఉల్లాసం కలిగిస్తుంది. 7, 8 తేదీల్లో బదిలీలు, మార్పులకు అనుకూలం. పెద్దలు, పై అధికారుల వైఖరిలో సానుకూలమైన మార్పు గమనిస్తారు. కుటుంబ విషయాల్లో శుభపరిణామాలు సంభవం.



### ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

వ్యూహాలు, విద్య, ఆర్థిక విషయాలు, సమావేశాలకు ఈ వారం అనుకూలం. బుధ, గురువారాల్లో ప్రణాళికలు ఫలిస్తాయి. రక్షణ, న్యాయ, బోధన రంగాల వారికి కొత్త ఆలోచనలు స్ఫురిస్తాయి. సంకల్పం ఫలిస్తుంది. 4, 5, 6 తేదీల్లో ఆర్థిక వ్యవహారాల్లో ప్రణాళికాబద్ధంగా లేకపోవడం వల్ల నష్టపోతారు. ఖర్చులు అధికం. పారితోషికాలు అందుకుంటారు. దూర ప్రయాణాలకు అనుకూలం. 7, 8 తేదీల్లో అడ్మిషన్ల విషయంలో అంచనాలు ఫలిస్తాయి. విద్యార్థులకు శుభప్రదం. చర్చలు, సమావేశాలు, ప్రయాణాలు ఆనందం కలిగిస్తాయి. సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం.



### మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

ఆర్థిక వ్యవహారాలు, రుణప్రయత్నాలు, ఆరోగ్య విషయాలకు ఈ వారం ప్రోత్సాహకరం. బుధ, గురువారాల్లో ఆరోగ్యం మెరుగుపడుతుంది. గత అనుభవంతో ఆర్థిక విషయాల్లో లక్ష్యాలు సాధిస్తారు. సినీ, రాజకీయ రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. 4, 5, 6 తేదీల్లో రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు. గత స్మృతులు నెమరువేసుకుంటారు. వాయిదా పద్ధతిపై వస్తువులు సమకూర్చుకుంటారు. బ్యాంకులతో పనులు పూర్తవుతాయి. 7, 8 తేదీల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరంగా ఉంటుంది. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. పెట్టుబడులు లాభిస్తాయి.



### కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, వేడుకలు, కాంట్రాక్టులు, భాగస్వామి విషయాలకు ఈ వారం ప్రాధాన్యమిస్తారు. బుధ, గురువారాల్లో ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. వేడుకలు, సమావేశాల్లో కీలక పాత్ర పోషిస్తారు. స్నేహానుబంధాలు బలపడతాయి. 4, 5, 6 తేదీల్లో ప్రియతములు, బంధుమిత్రుల వైఖరి ఆవేదన కలిగిస్తుంది. ప్రియతముల మధ్య దాపరికాలు తగవు. భాగస్వామికి సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. 7, 8 తేదీల్లో పందాలు, పోటీల్లో విజయం సాధిస్తారు. వివాహ నిర్ణయాలకు అనుకూలం. జనసంబంధాలు విస్తరిస్తాయి. ఖర్చులు అధికం.

### మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

ఇంక్రిమెంట్లు, ఉద్యోగ ప్రయత్నాలు, ఆరోగ్య విషయాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. ప్రమోషన్లు, గౌరవపదవులకు అవకాశం ఉంది. 4, 5, 6 తేదీల్లో వృత్తిపరమైన సమావేశాలు సత్ఫలితాలనిస్తాయి. సన్నిహితుల ఆరోగ్యం కోసం ఖర్చులు అధికం. ఆర్థిక విషయాల్లో సహోద్యోగులు మొహమాటపెట్టే అవకాశం ఉంది. 7, 8 తేదీల్లో సినీ రాజకీయ రంగాల వారికి ప్రోత్సాహకరంగా ఉంటుంది. వైద్యం, పరిశ్రమల రంగాల వారికి ఆర్థికంగా లాభిస్తుంది. లక్ష్య సాధనలో గత అనుభవం తోడ్పడుతుంది.






## మధుబాల గురుభక్తి

సినిమాల్లో రావాలనుకునే వాళ్ళే కాకుండా, ఆల్రెడీ వచ్చిన వాళ్ళల్లో చాలామంది మణిరత్నం సినిమాలో నటించాలని కలలు కంటూంటారు. ఆయన సినిమా చేసి దేశవ్యాప్తంగా పేరు తెచ్చుకున్నవారికి కొదవలేదు. ఓ విధంగా చెప్పాలంటే చాలా మంది నటీనటులకు ఆయనొక గాడ్ ఫాదర్. ఆ చాలా మందిలో 'రోజా' హీరోయిన్ మధుబాల పేరు ముందుగా చెప్పుకోవాలి. ఆ సినిమాతో రాత్రికిరాత్రే మధుబాల టాప్ హీరోయిన్ స్థాయికి చేరుకుంది. తనకు అంత గుర్తింపు ఇచ్చిన మణిరత్నం చేతుల్లో తన కూతురు భవిష్యత్తు పెడతానంటోంది. తన కూతురు సినిమాలకు పనికి వస్తుందా? లేదా? అన్నది ఆయనే తేలుస్తారు అని చెబుతోంది. నా కూతురు విషయంలో ఆయన నిర్ణయమే ఫైనల్. ఆయన ఎలా చెబితే అలా చేస్తాను అంటూ తన గురుభక్తిని చాటుకుంది మధుబాల!

## ఆ హీరోని మరచిన లెక్కల మాస్టారు!

లెక్కల మాస్టారంటే... ఇంకెవరు దర్శకుడు సుకుమారే! ఆయన నిర్మాణంలో వస్తున్న సినిమాకి మంచి హైప్ తీసుకురావడానికి గట్టి ప్రయత్నమే చేస్తున్నారు. సినిమాకు సంబంధించి ఒక్కో ఈవెంట్‌కి ఒక్కో స్టార్ హీరోని పిలిచి హడావిడి చేస్తున్నాడు సుకుమార్.



అయితే తన స్టార్ హీరోల లెక్కలో ప్రిన్స్ మహేష్‌బాబును మరచిపోయాడంటున్నారు సినీ జనాలు. కాకపోతే మహేష్ తన తాజా సినిమా స్పైడర్‌తో బిజీగా ఉన్నాడు కనుక పిలవకపోయి ఉండవచ్చని మరో వర్గం అంటోంది. అసలు లెక్కల మాస్టారు తన సినిమా ఈవెంట్‌కి రమ్మనమని పిలిస్తే రాననే హీరో ఉండరని మరికొందరు అంటున్నారు. మొత్తానికి లెక్కల మాస్టారు ప్రిన్స్‌ని మరచిపోయాడన్నది మాత్రం నిజమట!

## రణవీర్, దీపిక బ్రేకప్?



బాలీవుడ్‌లో ఎప్పటి నుంచో హల్‌చల్ చేస్తున్న ఈ వార్త ఎట్టకేలకు నిజం అయ్యేటట్టు ఉందట! గత కొంతకాలంగా దూరం దూరంగా ఉంటున్న రణవీర్, దీపిక విడిపోవాలని నిర్ణయించుకున్నారట! కారణం చిన్నదేనట! పెళ్ళి చేసుకుందామని రణవీర్ చేసిన ప్రతిపాదనను దీపిక నిర్మొహమాటంగా తోసి పుచ్చిందట! ఇప్పట్లో తనకు పెళ్ళి చేసుకునే ఆలోచన లేదనీ, ఇప్పుడే పెళ్ళంటే కెరీర్ నాశనమవుతుందనీ చెప్పిందట! అయితే దీపిక హాలీవుడ్‌లో ఓ హీరోతో డేటింగ్ చేస్తోందట! అందుకే రణవీర్ ప్రపోజల్‌ను కాదన్నదని అంటున్నారు.

## మిస్సమ్మకి శ్రియ సాయం!

ఈ తరం మిస్సమ్మ అంటే భూమిక చావ్లా ఆర్థిక ఇబ్బందుల్లో ఉందన్న వార్తలు గతంలో బాగా వినిపించాయి. ఆ మాటల్లో నిజం ఎంత ఉందో తెలియదు కానీ, భూమిక మాత్రం అలాంటివేవీ తనకు లేవని కొట్టిపారేసింది. ఇదంతా ఇప్పుడు పక్కన పెడితే భూమిక భర్త భరత్ ఠాకూర్ యోగా గురువు మాత్రమే కాదు, మంచి చిత్రకారుడు కూడా! ఆయన వేసిన చిత్రాలను ఇటీవల దుబాయ్‌లో ప్రదర్శించారు. ఆ ఎగ్జిబిషన్‌కు హైప్ తీసుకొచ్చేందుకు భూమిక తన స్నేహితురాలు శ్రియ సాయం కోరిందట! స్నేహితురాలి కోరిక మన్నించి శ్రియ దుబాయ్ వెళ్ళి ఆ ఎగ్జిబిషన్‌లో పెయింటింగ్స్ ముందు నిలబడి రకరకాల ఫోజులు ఇచ్చిందట! శ్రియ ఫోజుల మహత్యమో ఏమో తెలియదు కానీ, ఆ ఎగ్జిబిషన్‌కు బ్రహ్మాండమైన స్పందన వచ్చేసిందట! దాంతో భూమిక, ఆమె భర్త ఫుల్ హ్యాపీలో ఉన్నారట! స్నేహితురాలు అడిగిన వెంటనే కాదనకుండా దుబాయ్ వెళ్ళిన శ్రియ మంచితనాన్ని ఇప్పుడు అందరూ పొగుడుతున్నారట!



## పద్నాలుగుకే మొదటి ముద్దు?

అంత చిన్న వయస్సులోనే మొదటి ముద్దు అంటే ఆ వ్యక్తి వీర ముదురు అనుకోవలసిందే! నిజమే...ఆ వీర ముదురు ఎవరో కాదు బుల్లితెర, వెండితెర నటి రష్మీ. రష్మీకే ఈ అనుభవం కలిగిందట! అది కూడా రష్మీనే స్వయంగా ఒప్పుకుంది. ఇటీవల టీవీలో వచ్చిన ఓ షోలో రష్మీ పాల్గొంది. ఆ షోలో రష్మీ ఈ విషయాన్ని బయటపెట్టింది. అయితే ఎవరికి ముద్దు పెట్టింది? అన్న విషయాన్ని మాత్రం దాట వేసింది. అంత చిన్న వయస్సులోనే రష్మీ ముదురు వేషాలు వేయడం మొదలుపెట్టిందన్న మాట అంటున్నారు సినీ జనాలు. కాకపోతే ధైర్యంగా ఓ టీవీ షోలో తన మొదటి ముద్దు గురించి చెప్పిన రష్మీ ధైర్యాన్ని అందరూ మెచ్చుకుంటున్నారు.





# అందరూ నాకు 'ఫిదా' అవ్వాల్సిందే!

-సాయి పల్లవి

**తెలంగాణ పల్లెలకు తన నవ్వులతో పట్టు పరికిణీ తొడిగినట్టు, ఆమె సొగసులు అందమైన సీతాకోక చిలుకలా ఉంటాయి. తన మాటలు తెలంగాణ యాసలో ప్రతి ఒక్కరినీ పలకరించినట్టుగా ఉంటాయి. తీయందనంగా ఉంటాయి. మలయాళ చిత్రం 'ప్రేమమ్'లో మలర్‌గా ప్రేక్షకులను మైమరపించింది. ఆమే సాయి పల్లవి. ఆమె బాపూ బొమ్మకాదు, గ్లామర్ హీరోయిన్ అంతకన్నా కాదు. ఇప్పుడు తెలుగు తెరపై 'భానుమతి'గా తొలి సినిమా 'ఫిదా'తో హీరోయిన్‌గా ప్రేక్షకుల హృదయాలను కొల్లగొట్టి తోటి హీరోయిన్లకు పోటీగా మారింది. ఎవ్వరైనా తనకు 'ఫిదా' అవ్వాల్సిందే అంటున్న సాయిపల్లవితో...**

### 'ఫిదా' సినిమా సక్సెస్‌ను ఎంజాయ్ చేస్తున్నట్టున్నారు?

తెలుగులో నేరుగా చేసిన నా మొదటి సినిమా ఇది. నా మొదటి సినిమానే ఇంతగా ఆదరిస్తున్నందుకు సంతోషంగా ఎందుకు ఉండదు? ప్రేక్షకులు నన్ను ఎలా చూడాలనుకుంటున్నారో అర్థమైంది.

### తెలుగులో సినిమా చేయడానికి చాలా కాలం పట్టినట్టుంది?

'ప్రేమమ్' తరువాత సినిమాల ఎంపిక కష్టం అనిపించింది. ఆ సినిమాలో మలర్ పాత్ర నుంచి నేను బయటపడడానికి చాలా కాలం పట్టింది. ఇప్పట్లో సినిమాలు చేస్తే ఆ పాత్ర ప్రభావం నుంచి బయటకు రాలేను అనిపించింది. దానికి తోడు సినిమాలు చేస్తే చదువు పాడవుతుందని పేరెంట్స్ అడ్డుచెప్పారు. వారి కోరిక మేరకు డాక్టర్ కోర్సు కోసం జార్జియా వెళ్ళాను. మధ్యలో తమిళంలో ఓ సినిమా చేశాను.

'ఫిదా' కథ నాకు దాదాపు ఒకటిన్నర సంవత్సరాల క్రితం చెప్పారు. ఈ సినిమా చేస్తే చదువు డిస్టర్బ్ అవుతుందని ఓకే చెప్పలేదు. నా చదువు పూర్తయ్యేంత వరకూ ఆగి మళ్ళీ నన్ను కలిశారు. మరో ఆలోచన లేకుండా వెంటనే ఓకే చెప్పేశాను.

### బయట కూడా 'ఫిదా' భానుమతిలాగానే ఉంటారా?

లేదు. బయట కామ్‌గా ఉంటాను. ఈ సినిమా చేసిన తరువాత ఆ క్యారెక్టర్‌లోకి పరకాయ ప్రవేశం చేసేశాను. ఇప్పుడు ఇంట్లో కూడా గట్టిగా మాట్లాడుతున్నాను. ఆ పాత్ర నుంచి త్వరగా బయటకు రాలేకపోతున్నాను. ఇప్పుడు నన్ను చూసి అందరూ ఆశ్చర్యపోతున్నారు. నా స్నేహితులైతే నువ్వు ఒకప్పటి సాయిపల్లవి కాదు అంటున్నారు.

### దిల్‌రాజుగారి బ్యానర్‌లోనే మూడు సినిమాలు చేస్తున్నారట?

అవును. ఆయన బ్యానర్‌లో చేయడం నాకు సౌకర్యంగానే కాదు ఆనందంగా కూడా ఉంటుంది. ఆయన ఒక నిర్మాత మాత్రమే కాదు, నాకు గాడ్ ఫాదర్ కూడా! అందుకే ఆయన బ్యానర్‌లో మూడు సినిమాలకు ఓకే చెప్పేశాను. నానిగారితో ఓ సినిమా చేయబోతున్నాను. త్వరలోనే షూటింగ్ మొదలవుతుంది. మరో సినిమా ఇంకా ఫైనలైజ్ కాలేదు.

### 'ఫిదా' సినిమాలో పాటలకి డ్యాన్సులు బాగా చేశారు కదా.... డ్యాన్స్ నేర్చుకున్నారా?

నాకు చిన్నతనం నుంచి డ్యాన్స్ బాగా వచ్చు. ఓ టీవీ షోలో డ్యాన్స్ కాంపిటీషన్‌లో పాల్గొన్నాను కూడా. ఈ సినిమాలో పాటలకు పెద్దగా డ్యాన్స్‌లు లేవు. ఒక్కపాటకే డ్యాన్స్ ఉంటుంది. దాని కోసం ఓ రోజంతా ప్రాక్టీసు చేశాను అంతే! మా సిస్టర్‌తో కలిసి రోజంతా పాటకి స్టెప్పులు ప్రాక్టీసు చేశాను. మరుసటిరోజు సెట్‌లో డ్యాన్స్ చేసేశాను. ఈజీ స్టెప్పులు అయితే ఫరవాలేదు కానీ, కష్టమైన స్టెప్పులంటే ఇబ్బంది పడతాను. నా అవస్థ చూసి డ్యాన్స్ మాస్టర్లు కూడా కష్టమైన స్టెప్పులు కంపోజ్ చేయరు. నాకు ఐశ్వర్యారాయ్, మాధురీ దీక్షిత్ డ్యాన్స్‌లంటే చాలా ఇష్టం. వాళ్ళ పాటలు ఎక్కువగా చూస్తుంటాను. ఓ విధంగా వారిద్దరూ నాకు డ్యాన్స్‌లో గురువులుగా చెప్పుకోవచ్చు.



### 'ఫిదా' సినిమాలో తెలంగాణ యాసలో మాట్లాడారు కదా! అసలు తెలుగు భాషే పూర్తిగా కొత్త కదా, ఇక యాస అంటే మరీ కష్టం అనిపించలేదా?

ఈ సినిమా కోసమే తెలుగు నేర్చుకున్నాను. అంత బాగా రాలేదు కానీ, సినిమాలో డైలాగుల వరకూ బాగానే వచ్చింది. అలాగే యాస కూడా! ఈ సినిమాలో 'బద్మాష్' అనే మాట ఉంటుంది. వాస్తవానికి దానికి అర్థం నాకు ఇంత వరకూ తెలియదు. మా స్నేహితుల్ని అడిగాను కానీ, చెప్పలేక పోయారు. చాలా పదాలకు అర్థాలు రాజుగారే చెప్పేవారు.

### ఈ సినిమాలో బాగా చేయలేకపోయానని ఎప్పుడైనా అనిపించిందా?

హీరో వరుణ్‌తేజ్ నటన చూసినప్పుడు అనిపించేది. ఇంతకన్నా బాగా చేసి ఉంటే బాగుండేది కదా! అని. అదే విషయం మా మదర్‌తో వెళ్ళి చెప్పేదాన్ని. నేనూ తను పోటీ పడి నటించాం.

### సినిమాల్లోకి రాకముందు మోడలింగ్ చేశారట?

చాలామందికి ఈ విషయం తెలియదు. కొన్ని ఉత్పత్తులకి మోడలింగ్ చేశాను. సినిమాల్లో నటించడం మొదలు పెట్టిన తరువాత మాత్రం మోడలింగ్ చేయలేదు.

### సినిమాల్లో చేస్తానంటే మీ కుటుంబం నుంచి అభ్యంతరాలు ఎదురవ్వలేదా?

మా ఫ్యామిలీ మొత్తం నుంచి నేను ఒక్కదాన్నే ఈ ప్రొఫెషన్‌లోకి వచ్చాను. మా వాళ్ళకి ఎవరికీ సినిమాల మీద పెద్దగా అవగాహన లేదు. నా మొదటి సినిమా 'ప్రేమమ్' అని అందరూ అనుకుంటారు. కానీ కాదు. దాని కన్నా ముందు తమిళ సినిమా చేశాను. 'ప్రేమమ్'తో వచ్చిన గుర్తింపుతో నా మీద మా వాళ్ళకి నమ్మకం కలిగింది. ఇప్పటికీ మా ఫాదర్‌కి నేను డాక్టర్‌గా ప్రాక్టీసు చేస్తేనే బాగుంటుంది అనిపిస్తుంది. అసలు మా వాళ్ళకన్నా ముందు నామీద నాకే నమ్మకం కలగలేదు. నా ముఖంపై మొటిమలు ఎక్కువగా ఉంటాయి. ఈ ఫేస్‌తో తెరమీద కనిపిస్తే బాగుంటుందా? ప్రేక్షకులు నన్ను ఆదరిస్తారా? అన్న అనుమానం ఉంది. కానీ 'ప్రేమమ్'లో చాలా తక్కువ మేకప్‌తో కనిపించాను. ఆ సినిమాలో తెర మీద నా ముఖం కన్నా నా నటననే ఎక్కువ ఆదరించారు. 'ఫిదా'లో కూడా తక్కువ మేకప్ ఉంటుంది.

### డాక్టర్ చదివాక యాక్టర్ అవడానికి కారణం?

*నాకు చదువు, నటనతో పాటు, డ్యాన్స్ కూడా చాలా ఇష్టం. డాక్టర్ చదవాలన్నది మా ఫాదర్ కోరిక. నన్నొక కార్డియాలజిస్ట్‌గా చూడాలని అనుకున్నారు. నాకు కూడా కార్డియాలజీ చేయాలని ఉంది. కాకపోతే సినిమాలంటే బాగా ఇష్టం. కొన్ని రోజులు నటిగా ఎంజాయ్ చేశాక డాక్టర్‌గా మారదామని అనుకుంటున్నాను. భవిష్యత్తు గురించి ఇంతకంటే చెప్పలేను.*



### రెమ్యునరేషన్ విషయంలో కచ్చితంగా ఉంటారని అంటారు, నిజమేనా?

చేసిన పనికి ప్రతిఫలం కోరుకోవడం తప్పని అనుకోను. ఒక పాత్రకి నేనే సరిపోతాను అనుకున్న వారే నన్ను అప్రోచ్ అవుతారు. సినిమాను బట్టి రెమ్యునరేషన్ అడుగుతాను. చిన్న బడ్జెట్‌తో తీసే సినిమాకి కోట్లు అడగలేంకదా? అయినా నాకు ఎంత ఇవ్వాలో నా నిర్మాతలకు బాగా తెలుసు. నేను నోరు తెరిచి అడగక్కర్లేదు.

### కొందరు స్టార్ హీరోల సినిమాలకు కూడా నో చెప్పడానికి కారణం?

ఒక సినిమా చేయకపోవడానికి నా కారణాలు నాకు ఉంటాయి. నాకు కథ నచ్చాలి. అవకాశాలు వస్తున్నాయి కదా అని ఏ సినిమా పడితే ఆ సినిమా చేయలేను. కథ నాకు నచ్చితేనే ఓకే చెబుతాను. స్టార్ హీరోలు ఉన్నారు కదా అని నాకు నచ్చని కథ చేయడం నా వల్ల కాదు. ఈ కారణంగానే కొన్ని సినిమాలు చేయనని చెప్పాను. అంతే తప్ప పెద్ద హీరో సినిమానా? చిన్న హీరో సినిమానా? అని చూడను. కథ బాగుంటే చిన్న హీరో పెద్ద హీరో అన్న పట్టింపులు నాకు లేవు. ఎవరితోనైనా చేస్తాను.

—స్పందన రెడ్డి

ఇంటర్వ్యూ



# డబ్బు కోసమే ఆ పని చేశా!

**-అరవింద్ స్వామి**

ఇరవై ఒక్క సంవత్సరాల ఆ కుర్రవాడిని కలెక్టర్‌గా వెండితెర మీద చూసిన ఆడపిల్లలు తమ జీవిత భాగస్వామి ఇలాగే ఉండాలని ఫిక్స్ అయిపోయారు. ఆ తరువాత వచ్చిన 'రోజా' సినిమాతో అతగాడు దేశవ్యాప్తంగా ఎంతోమంది కన్నెపిల్లల కలల రాకుమారుడైపోయాడు. ఇక 'బొంబాయి' సినిమా సృష్టించిన ప్రకంపనలు అన్నీ ఇన్నీ కావు. పై మూడుసినిమాల్లో మెరిసి ప్రేక్షకులను మైమరపించిన నటుడు అరవింద్ స్వామి. పైకి అందంగా అమాయకంగా కనిపించే అరవింద్‌స్వామి జీవితంలో ఎత్తు పల్లాలు ఎన్నో! గడిచిన కాలం అతని శరీరంతో పాటు జీవితంలో ఎన్నో మార్పులు తీసుకువచ్చింది. ఆ మార్పులేమిటో ఈ అందాల నటుడి మాటల్లోనే.....

### ఒక్కసారిగా కొన్ని సంవత్సరాల పాటు తెరమరుగు కావడానికి కారణం?

నా సినీ ప్రవేశం దగ్గర్నుంచి చెబితే తప్ప అర్థం కాదు. మాది పారిశ్రామిక కుటుంబం. నాన్న పారిశ్రామిక వేత్త. అమ్మ ఇంట్లోనే ఉండేవారు. సినిమాల్లోకి రావాలని ఎప్పుడూ అనుకోలేదు. చదువుకునే రోజుల్లో సరదాగా మోడలింగ్ చేశాను. ఆ తరువాత డబ్బు కోసమే అవి చేశాను. ఆ సమయంలోనే తమిళ 'తలపతి'లో కలెక్టర్‌గా నటించే అవకాశం వచ్చింది. అప్పటికి చిన్నవాడినే! ఆ తరువాత 'రోజా', ఆ తరువాత 'బొంబాయి' సినిమాలు చేశాను. ఈ రెండు సినిమాల తరువాత మరికొన్ని తమిళ సినిమాలు చేశాను.

ఆ సమయంలో నేను చేసిన సినిమాలన్నీ సూపర్ డూపర్ హిట్టవడంతో స్టార్ హీరో అనిపించుకోగలిగాను. చిన్న వయస్సులోనే వచ్చిన ఆ స్టార్‌డమ్‌ను హ్యాండిల్ చేయలేకపోయాను. ఆ సమయంలో వచ్చిన పేరును నిలబెట్టుకోవడం, సినిమాల ఎంపిక అనేది చాలా ఒత్తిడికి గురిచేసింది. అప్పుడు సినిమాల కన్నా చదువు ముఖ్యమనుకుని పీజీ చేయడానికి విదేశాలకు వెళ్ళిపోయాను. చదువు పూర్తి చేసుకుని వచ్చిన వెంటనే మా ఫాదర్ బిజినెస్ చూసుకోవలసి వచ్చింది. ఆ తరువాత పెళ్ళి, పిల్లలు, వ్యాపారాలు చూసుకోవడం...అలా దాదాపు పుష్కరకాలానికి పైగా సినిమాలకు దూరంగా ఉండిపోయాను.

### మళ్ళీ సినిమాలు చేయడానికి కారణం?

నా గాడ్ ఫాదర్ మణిరత్నంగారే! తిరిగి సినిమాలు చేయమని ఎప్పుడూ చెప్పేవారు. 2013లో మణిగారి సినిమా 'కాదల్'లో ఓ ఇంపార్టెంట్ రోల్ చేశాను. అక్కడి నుంచి నా సెకండ్ ఇన్నింగ్స్ మొదలైందని చెప్పవచ్చు. అసలు నా సెకండ్ ఇన్నింగ్స్ అనేది నా ఒక్కడి సమస్య కాదు. నా మీద ఆధారపడిన కొన్ని వేలమంది జీవితాలకు సంబంధించిన సమస్య. గతంలోలాగా హీరో వేషాలు వేయడం కుదరదు. క్యారెక్టర్ ఆర్టిస్టుగానే కొనసాగాలి. అలా అయితేనే నా వ్యాపారాలు దెబ్బతినకుండా ఉంటాయి. హీరోగా అయితే నా దృష్టంతా సినిమాల మీదే పెట్టవలసి వస్తుంది. అందుకే క్యారెక్టర్ ఆర్టిస్టుగా చేయాలని నిర్ణయించుకున్నాను.

### విలన్‌గా ఎందుకు చేయాలనిపించింది?

నాలోనూ మంచి విలన్ దాగి ఉన్నాడన్న విషయం 'తనిఒరువన్' చేసేదాకా నాకూ తెలియదు. ఆ సినిమా మంచి విజయం సాధించిన తరువాత విలనిజానికి ప్రాణం పోయగల నటుడు నాలో ఉన్నాడని ప్రేక్షకులతో పాటు పరిశ్రమ గుర్తించింది. అలాగని అన్నీ అలాంటి పాత్రలే చేయాలని అనుకోవడం లేదు.

### మీ జీవితంలో అత్యంత బాధాకరమైన సంఘటన?

ఒకటికాదు చాలా ఉన్నాయి. నా భార్య నుంచి విడాకులు పెద్ద దెబ్బ అనే చెప్పాలి. ఆ తరువాత యాక్సిడెంట్. స్పైనల్‌కార్డ్ దెబ్బతిని కొన్ని నెలల పాటు మంచానికే పరిమితమైపోయాను. ఆ సమ

యంలో నా మానసిక వేదన మాటల్లో చెప్పలేను. నా అంతట నేనుగా బాత్‌రూంకి కూడా వెళ్ళలేక పోయేవాడిని. మంచానికే పరిమితం కావడంతో బరువు బాగా పెరిగిపోయాను. తీవ్రమైన డిప్రెషన్‌లోకి వెళ్ళిపోయాను. ఆ స్థితి నుంచి బయట పడడానికి చాలా గట్టి ప్రయత్నమే చేశాను. ఆ సమయంలో మారథాన్‌లో పాల్గొని విజయం సాధించడంతో నా మీద నాకు నమ్మకం కలిగింది. నెమ్మదిగా ఆ స్థితి నుంచి బయటపడి నా ప్రపంచంలోకి వచ్చాను.

### పిల్లలు మీ దగ్గరే ఉంటారట?

నాకు ఒక కూతురు, కొడుకు. కూతురు పెద్దది. ఇద్దరూ టీనేజీలో ఉన్నారు. నా భార్య నుంచి విడాకులు తీసుకున్న తరువాత పిల్లల బాధ్యత నేనే తీసుకోవాలని నిర్ణయించుకున్నాను. ఐదారు సంవత్సరాల క్రితం అపర్ణ ముఖర్జీని రెండోపెళ్ళి చేసుకున్నాను.

### తండ్రికి పిల్లల పెంపకం కష్టమంటారు. మీరు దాన్ని ఎలా అధిగమించారు?

పిల్లల పెంపకం తండ్రికి కత్తిమీద సాము లాంటిదే! మా జనరేషన్‌కీ, ఈ జనరేషన్‌కీ చాలా తేడా ఉంది. అప్పట్లో పెద్దలు పిల్లల్ని ఈ పని చేయద్దు అంటే ఆగిపోయారు. ఇప్పటి పిల్లలు అలా కాదు. అన్నీ వివరంగా చెబితే తప్ప వినరు. నా పిల్లలకు ఏ విషయమైనా వివరంగా చెబుతాను తప్ప కచ్చితంగా నా మాటే వినాలని పట్టుపట్టను. ఇంతవరకూ వాళ్ళు కూడా నా మాట కాదనలేదు. ప్రస్తుతం నా భార్యాపిల్లలతో ఫుల్ హ్యాపీ. మా ఇద్దరిపిల్లలు బాగా చదువుతారు. వాళ్ళ చదువులు పూర్తయిన తరువాత వాళ్ళు ఏ రంగంలో సెటిల్ కావాలనుకుంటారో వారిష్టం. ఆ విషయంలో నేను తల దూర్చను. నా సలహా అడిగితే తప్పకుండా ఇస్తాను.

### మీరు మంచి కుక్ అంటారు, నిజమేనా?

పిల్లల్ని పెంచడం అంటే వారికి కావలిసినంత డబ్బు ఇవ్వడం, వారి అవసరాలు తీర్చడమే కాదు, వారికి సంబంధించిన అన్ని విషయాలు దగ్గరుండి చూసుకోవాలి. అందులో మొదటిది వారి తిండి విషయం. బయట ఎంత మంచి రెస్టారెంట్‌లో తిన్నా ఇంటి ఫుడ్‌కి సరికాదు. అందుకే వారి కోసమే వంట నేర్చుకున్నాను. కొన్ని టిఫిన్లు చేసి వారికి పెడుతుంటాను. నెలకో రెండు నెలలకో ఒకసారి సరదాగా ఇంట్లో వంటంతా నేనే చేస్తుంటాను. నా భార్యాపిల్లల్ని వంటింట్లోకి రానివ్వకుండా నాకు నచ్చిన, వచ్చిన డిష్‌లు వారికి వండిపెడతాను.

### జీవితంలో ఇన్ని ఆటుపోట్లను తట్టుకొని ఈ స్థాయికి రావడానికి కారణం అదృష్టం అని నమ్ముతారా?

అస్సలు నమ్మను. నేను కష్టాన్ని నమ్ముకున్న వ్యక్తిని. ఏ వ్యక్తి అయినా రోజులో 22 గంటలు కష్టపడితే విజయం సాధించడం ఖాయం! అదృష్టాన్ని నమ్ముకుని కష్టపడి పనిచేయకపోతే ఎందులోనూ సక్సెస్ సాధించలేం.

### మీరు అభిమానులను దగ్గరకు రానీయరు అంటారు, నిజమేనా?

అభిమానం పేరుతో సమయం వృథా చేసుకునే వారంటనే నాకు నచ్చదు. 'రోజా' వచ్చిన కొత్తల్లో ఓ టీనేజి అమ్మాయి రక్తంతో నాకు లెటర్ రాసింది. అది చదివి నాకు చాలా కోపం వచ్చింది. ఇలాంటి పిచ్చి పనులతో సమయం వృథా చేసుకోవడం కన్నా చదువు మీదా, కెరీర్ మీదా దృష్టి పెట్టమని ఆ అమ్మాయికి ఘాటుగా వార్నింగ్ ఇచ్చాను. అప్పటి నుంచి అభిమానం పేరుతో చేసే పిచ్చిపనులకు నేను దూరంగా ఉంటున్నాను. అభిమానులను దగ్గరకి రానిస్తే వారి భవిష్యత్తు పాడవుతుంది.

### భవిష్యత్తులో చేయబోయే సినిమాల గురించి.....

మొదటి నుంచి సినిమాల విషయంలో నాది ఒకే దృక్పథం. నచ్చిన సబ్జెక్ట్ వస్తే చేస్తాను. లేకపోతే లేదు. హ్యాపీగా నా వ్యాపారాలు చూసుకుంటాను. దాంతో ఫలానా సినిమా లేదా ఫలానా పాత్ర చేయాలని ఎప్పుడూ అనుకోలేదు. ఏ సినిమా చేసినా నా పాత్ర ద్వారా చిన్న సందేశమైనా ప్రేక్షకులకి చేరాలన్నది నా కోరిక. అసలు నేను మంచి నటుడిని అని ఎప్పుడూ అనుకోను.

–దేవి



## హీరో రేంజ్ విలన్లు

ప్రస్తుతం టాలీవుడ్‌లో విలన్లు హీరో రేంజ్‌ని డిసైడ్ చేసేవాళ్ళుగా ఉన్నారు. హీరోలతో సమాన స్థాయినీ, సొమ్మునూ అందుకుంటున్నారు. ఇంకా ఎక్కువగా చెప్పుకోవాలంటే హీరోల కన్నా ఎక్కువ స్టయిలిష్‌గా తయారవుతున్నారు. అలాంటి స్టయిలిష్ విలన్ల గురించి.....

**జగపతిబాబు:**

ఒకప్పుడు కుటుంబ కథా చిత్రాల హీరో శోభన్ బాబు తరువాత ఎక్కువమంది మహిళా ప్రేక్షకుల అభిమాన హీరోగా జగపతిబాబుకు పేరుంది. దాదాపు రెండు దశాబ్దాల పాటు హీరోగా చేసిన జగపతిబాబు 'లెజెండ్' సినిమాతో విలన్‌గా మారాడు. విలన్ ఎంత స్టయిలిష్‌గా ఉండచ్చో చెప్పింది కూడా జగపతిబాబే అంటారు సినీ జనాలు. జగపతిబాబు ఒక్కో సినిమాకు కోటిన్నర నుంచి రెండు కోట్లు తీసుకుంటాడు అంటారు. హీరో కన్నా విలన్‌గా ఎక్కువ సినిమాలు చేస్తూ ఎక్కువ సంపాదిస్తోన్న హీరో కమ్ విలన్‌గా జగపతిబాబు పేరు ముందు ఉంటుంది.



**అక్షయ్‌కుమార్:** హిందీలో స్టార్ హీరో ఇమేజ్ ఉన్న అక్షయ్‌కుమార్ మొదటిసారిగా దక్షిణాది సినిమా 'రోబో 2'లో విలన్‌గా కనిపించనున్నాడు. హీరో కమ్ విలన్ అయిన అక్షయ్ కుమార్ ఈ సినిమాకు తీసుకుంటోంది అక్షరాలా 12 కోట్లు. దేశంలో అత్యధిక బడ్జెట్‌తో తెరకెక్కుతున్న సినిమా అనే కాకుండా సూపర్ స్టార్ రజనీకాంత్ ముఖ్యపాత్ర పోషిస్తున్న సినిమా కావడంతో ఈ సినిమాను అక్షయ్‌కుమార్ ఒప్పుకున్నాడంటారు. ఓ హీరో కన్నా విలన్ ఎక్కువ తీసుకోవచ్చు అన్నది అక్షయ్‌కుమార్ తన చేతలతో చేసి చూపించాడని అంటున్నారు.



**ప్రకాష్‌రాజ్:** హీరో కమ్ విలన్ కమ్ క్యారెక్టర్ ఆర్టిస్టు. ఏ పాత్రలోనైనా ఇట్టే ఒదిగిపోయే ప్రకాష్ రాజ్ సినిమా సినిమాకీ తన స్థాయినే కాదు రెమ్యునరేషన్ కూడా పెంచుకుంటున్నాడు. విలన్‌గా ప్రకాష్ రాజ్ తీసుకునే మొత్తం కోటి రూపాయల పైనే ఉంటుందంటున్నారు. ఒక్క విలన్‌గానే కాదు, కొన్ని పాత్రలను ప్రకాష్‌రాజ్ మాత్రమే చేయగలడు అన్న పేరునూ సొంతం చేసుకున్నాడు.





# నూరుకట్ల పిశాచం కథలు ⑤

-వసుంధర

**అనగాఅనగా ఓ గ్రామంలో గంగరాజు అనే ఆసామి ఉండేవాడు. అతడికి ఒక్కగానొక్క కొడుకు శంకరం. మొదట్లో గంగరాజు భారీగా వ్యవసాయం చేసేవాడు. కానీ, శంకరం ప్రాజ్ఞుడయ్యాక గంగరాజు బుద్ధి మారింది. ఉన్న పొలం అమ్మేసి, వ్యాపారం ప్రారంభించాడు. శంకరం చాలా తెలివైనవాడు. అతడి సలహా సంప్రదింపులతో గంగరాజుకు బోలెడు లాభాలు వచ్చి రెండేళ్ళలోనే లక్షాధికారి అయ్యాడు.**

## పెంకి పెళ్ళాం

ఇలా ఉండగా, ఆ ఊరికి ఒకరోజున బందిపోటు దొంగలు వచ్చారు. వారు గుఱ్ఱాలమీద స్వారీ చేసు కుంటూ రకరకాల ఆయుధాలతో వచ్చారు. వాళ్ళు పరమ దుర్మార్గులు. ఊరంతా వెదకివెదకి మరీ దోచారు. వెళ్ళేముందు, చాలా ఇళ్లకు నిప్పంటించి వెళ్ళారు. దొంగలు వెళ్ళిపోయాక, ఊరంతా గుమి గూడారు. ముందు మంటలు చల్లార్చడంలో నిమగ్ను లయ్యారు. తర్వాత దొంగలు కలిగించిన నష్టాన్ని తెలుసుకునే ప్రయత్నంలో పడ్డారు. అప్పుడు వారికి తెలిసింది ఎందరో ఆడవాళ్ళు, చిన్నపిల్లలు మంట ల్లోపడి మరణించారని. మరణించిన వారిలో గంగ రాజు భార్య మాణిక్యాంబ కూడా ఉంది.

శంకరానికి తల్లి అంటే ప్రాణం. తల్లి పోగానే, అతడి మనసు కకావికలమైంది. ఆ రోజునుంచీ అతడు పిచ్చివాడిలా తనలోతానే గబగబ ఏదేదో మాట్లాడుకోవడం ప్రారంభించాడు. ఇది చూసి, గంగరాజు బాగా దిగులుపడ్డాడు. భార్య పోయింది. ఉన్న ఆస్తి అంతా తుడుచుకుపోయింది. మిగిలిన ఒక్క కొడుకూ పిచ్చివాడిలా తిరుగుతున్నాడు. గంగ రాజు ఆ గ్రామవైద్యుణ్ణి కలుసుకుని కొడుకు గురించి చెప్పి, "ఎలాగో అలా ఎప్పటికో అప్పటికి మీ ఋణం తీర్చుకుంటాను. మా శంకరాన్ని మళ్లీ మామూలు మనిషిని చేయండి" అని దీనంగా వేడుకున్నాడు. వైద్యుడు శంకరాన్ని పరీక్షించి, "కుర్రాడిలో లోపమేమీ లేదు. హఠాత్తుగా తల్లి పోవడంవల్ల మతి చెదిరిందంతే! ఈ ఊళ్లోనే ఉంటే, రోజూ తల్లి గుర్తుకు వస్తూ ఉంటుంది. స్థలం మార్చడం మంచిది" అన్నాడు.

గంగరాజుకి కూడా ఆ ఊళ్లో ఉండడానికి మన స్కరించడం లేదు. వ్యాపారంలో గడించిందంతా దొంగలెత్తుకుపోయారు. భార్య జ్ఞాపకాలు ఆయన్నీ వేధిస్తున్నాయి. అందుకని వైద్యుడిచ్చిన సలహా విన గానే, ఉన్న పొలం అమ్ముకున్నాడు గంగరాజు. ఊరొదిలి ఎక్కడికి పోవాలా అని ఆలోచిస్తుంటే ఆయనకు పట్నంలో ఉన్న తన చిన్ననాటి స్నేహి తుడు పరమేశం గుర్తుకు వచ్చాడు.

పరమేశం, గంగరాజు ఇద్దరూ చిన్నతనంలో ఒకే గురువు దగ్గర చదువుకున్నారు. అయితే, ఒకళ్ళ నొకళ్ళు చూసుకుని చాలా కాలమైంది. గంగరాజు కొడుకుతోసహా పట్నం చేరుకున్నాడు. పరమేశం ఇల్లు వెదికి పట్టుకున్నాడు. మిత్రులిద్దరూ ఒకరి నొకరు సులభంగానే గుర్తించుకున్నారు. గంగరాజు స్నేహితుడికి తన కథంతా వివరంగా చెప్పుకున్నాడు. పరమేశం వారిద్దరినీ ఆప్యాయంగా ఆదరించాడు. వారంరోజుల్లోనే ఆ తండ్రీ కొడుకులు తమ దుఃఖం మరిచిపోయి స్థిమితపడగలిగారు. శంకరంకూడా మామూలు మనిషి అయి, తిరగసాగాడు. ఈ వారం రోజులూ పరమేశం, శంకరాన్ని శ్రద్ధగా గమనించాడు. కుర్రాడు బుద్ధిమంతుడు, తెలివైనవాడు. మీదు మిక్కిలి ఓర్పెక్కువ అని గ్రహించాడు పరమేశం. ఒకరోజున పరమేశం గంగరాజుని పిలిచి, "ఒరేయ్, నేను బోలెడు డబ్బు సంపాదించాను. నాకున్నది ఒక్కతే కూతురు. దాన్ని నీకొడుక్కిచ్చి పెళ్ళి చేయా లని ఆశపడుతున్నాను. అందుకు నువ్వు ఒప్పుకున్నా వంటే మన స్నేహం మరింత బలపడుతుంది. మీరి ద్దరూ ఇంక శాశ్వతంగా నా ఇంట్లోనే ఉండి పోవచ్చు" అన్నాడు. పరమేశం కూతురు పేరు కమల. ఆమె బంగారు ఛాయలో, అప్సరస అంత అందంగా ఉంటుంది.

స్నేహితులు మాట్లాడుకుంటున్న సమయంలో శంకరం తండ్రి పక్కనే ఉన్నాడు. మిత్రుడి మాట లకి ఎంతో సంతోషించాడు గంగరాజు. "నాకిష్టమే! మరి మా శంకరం ఏమంటాడో!" అని కొడుకువంక చూశాడు. శంకరం ఏదో అనేలోగా పరమేశం గంగ రాజుతో, "శంకరం ఒప్పుకుంటాడనే నా నమ్మకం. కానీ చిన్ననాటి స్నేహితుణ్ణి మోసం చేశానన్న పేరు నాకొద్దు. నా కూతురి గురించి ఓ నిజం నీకు చెప్ప వలసి ఉంది" అన్నాడు. గంగరాజు, శంకరం ఆయన చెప్పేది శ్రద్ధగా వినసాగారు. పరమేశానికి కమల, విమల కవలపిల్లలు. వాళ్ళిద్దరూ ఒకర్ని విడిచి ఒకరు ఉండలేక పోయేవారు. ఒకరంటే ఒకరికి ప్రాణం. వాళ్ళకి ఐదేళ్ల వయసున్నప్పుడు సకుటుంబంగా పెదపట్నం వెళ్లాడు పరమేశం. పెదపట్నం చాలా పెద్ద నగరం. అయిదులక్షల జనాభా. అక్కడ కమల అక్క విమల తప్పిపోయింది. ఎంత వెదకినా దొరక లేదు. ఆ మహానగరంలో ఆమెను వెదకి పట్టు



కోవటం అసాధ్యమే అయింది. చివరకు అన్ని ఆశలూ వదులుకుని వెనక్కు వచ్చేశారు. కూతురు తప్పిపోయిందన్న బెంగతో పరమేశం భార్య మంచం పట్టి చనిపోయింది. అంతవరకూ ఎంతో మంచి మనసున్న పిల్లగా పేరు తెచ్చుకుంది కమల. తల్లి పోయినప్పటినుంచీ అదోలా ఉండసాగింది. కమల ఏం చెబితే అది చేయాలి. లేని పక్షంలో ఏ నూతి లోనో దూకేస్తుంది. అసలే పరమేశానికి కమలంటే గారాబం. ఆపైన విమల తప్పిపోవడం, తల్లి గతించడం... అందువల్ల కమలకి పెంకితనం బాగా అల వాటైంది. వయసుపెరిగి పెళ్ళీడొచ్చినా కూడా తనని అంతా చిన్నపిల్లలా చూసుకోవాలంటుంది. ఈ విషయం పరమేశం దాచకుండా చెప్పిన తర్వాత కూడా, శంకరం కమల అందాన్ని చూచి మోజు పడ్డాడు. దానికితోడు డబ్బుకూడా వస్తున్నది. శంక రానికి ఎలాగూ ఓర్పు ఎక్కువ. ఆమాత్రం పెంకితనం భరించలేనా అనుకుని పెళ్ళికి సరేనన్నాడు. శంకరా నికీ, కమలకూ వైభవంగా పెళ్ళైపోయింది.

కమల పెంకితనం ఎలా ఉంటుందో పెళ్ళి అయ్యాకనే తెలిసింది శంకరానికి. ఓ రోజు కమలకి భర్తమీద ప్రేమ పొంగుకొచ్చింది. వంటమనిషిని కూర్చోమనిచెప్పి, తానే వంటంతా చేసింది కమల. అయితే, ఆమె వండిన పదార్థం ఏదీ కూడా సరిగ్గా లేదు. అన్నింటిలోకి పులుసు మహా కారంగా ఉంది.

కమల ఆ పదార్థాలన్నీ రుచి చూసింది. అంతే, భోరున ఏడ్వసాగింది. ఇంటిల్లిపాదీ ఆమె చుట్టూ చేరి కారణం అడిగారు. "ఎంతో కష్టపడి వంట చేశాను. కానీ ఒక్కపదార్థం కూడా బాగోలేదు. నా వంట ఎవ్వరూ తినరు. నా జీవితం వృథా. నేను చచ్చిపోతాను" అని మళ్లీ ఏడ్చిందామె. "ఎవ్వరూ తినకపోవడమేం? మేము ముగ్గురం తింటాం, చూడు!" అన్నాడు పరమేశం. కమల వండినదంతా పరమేశం, గంగరాజు, శంకరం మారుమాట చెప్ప కుండా తినేశారు. పులుసు వేసుకుని తింటున్నప్పుడు ఆ కారానికి నోరుమండి ఏడుపొచ్చింది శంకరానికి.



పోతే, చచ్చిపోతానంటుంది. ఈ పెంకితనం చేష్ట లతో శంకరానికి జీవితం దినదినగండంగా ఉంటోంది. ఒకరోజు కమల శంకరాన్ని గెడ్డం పెంచమన్నది. ఈ కోరిక ఇబ్బందిగా లేదు. శంకరం గెడ్డం పెంచాడు. కొద్దినెలల్లోనే అది ఏపుగా పెరిగింది. ఆతర్వాత ఒక రోజు కమల ఓ కత్తెర తీసుకొచ్చి ఆ గెడ్డాన్ని ఇష్టం వచ్చినట్లు కత్తిరించింది. అప్పుడు శంకరం చూడ్డా

**కమల, విమల కవలపిల్లలు. ఇద్దరూ పెంకిపిల్లలే. విమల చిన్నప్పుడు తప్పిపోయింది. ఎంత వెదకినా ఆమె జాడ తెలియలేదు. ఆ తర్వాత కమల మరీ పెంకిపిల్లగా పెరిగింది. ఆమె ఆడింది ఆటగా, పాడింది పాటగా సాగింది. తండ్రి ఎలాగో కష్టపడి ఆమె వివాహం చేశాడు. అయినా ఆమె పెంకితనం తగ్గలేదు. ఆమె పెంకితనం వల్ల ఇంట్లో అందరికీ నానా ఇబ్బందులూ వచ్చాయి. అప్పుడు కమల భర్త ఏం చేశాడు?**

ఎలాగో ఆపుకుని, మనసులో మాత్రం "ఇదేం పెంకి తనంరా బాబూ!" అనుకున్నాడు. కమల ఎంతో సంతోషించి, "ఇకమీదట రోజూ నేనే వంట చేస్తాను" అన్నది. అందరికీ గుండెలు గుభేలుమన్నాయి. అయినా అంతా, "చాలా సంతోషం" అన్నారు. ఒక రోజు కమల భర్తను తనతోపాటు చీర కట్టుకుని సంతకు రమ్మన్నది. ఎవరెంత చెప్పినా ఆమె విన లేదు. ఆఖరికి శంకరం అలాగే చేశాడు. సంతలో తెలిసిన వారందరూ అతణ్ణి చూసి పకపక నవ్వారు. కమల పిచ్చిది కాదు. కానీ, ఆమెకి అప్పుడప్పుడు విపరీతమైన కోరికలు పుడుతూంటాయి. తీర్చక

నికి చాలా తమాషాగా ఉన్నాడు. కమల కత్తిరిం చిందంతా పోగా అతడి చుబుకానికి రెండు పక్కలా సన్నని పొడవాటి వెంట్రుకలు వ్రేలాడుతున్నాయి. నెత్తిమీద రెండు కొమ్ములున్న మేక తలని తిరగేసి నట్లుంది అతడి ముఖం.

శంకరం పరమేశం దగ్గరకు వెళ్ళి, "మామయ్యా, నీ కూతురి ఆగడం చూడు. నేను నలుగురిలోనూ ఇలా ఎలా తిరిగేది?" అన్నాడు.

"తప్పేముంది నాయనా! మంచివాళ్ళ మనసును సంతోషపెడితే, భగవంతుడు నీకు మేలు చేస్తాడు" అన్నాడు పరమేశం శాంతంగా.

"ఇలా ఎంతకాలం? నీ కూతురి పెంకితనం పోయే ఉపాయం లేదా?" అని అడిగాడు శంకరం దిగులుగా.

"ఒక్కటే ఉపాయం ఉంది. ఈ అక్క చెల్లెళ్లి ద్దరూ ఒకే గడపలో ఉంటే, ఇద్దరూ మామూలుగా ప్రవర్తిస్తారని ఓ సాధువు చెప్పాడు" అన్నాడు పర మేశం.

"కమల ఆగడాలు భరించలేకుండా ఉన్నాను. పెదపట్నంవెళ్లి ఎలాగో అలా నా వదిన విమలని వెదకి తీసుకొస్తాను" అన్నాడు శంకరం వెంటనే. పరమేశం నిట్టూర్చి, "విమల ఇంకా పెదపట్నంలో ఉందో లేదో, అసలు బ్రతికున్నదో లేదో! ఉన్నా, దాన్ని ఎలా గుర్తుపడతావు? ఇద్దరి రూపురేఖలు ఒకటికావు. అప్పట్లో అక్కడ ఐదులక్షలమంది ఉండే వారు. ఇప్పుడు పదిలక్షల మంది అయ్యారట. అందువల్ల, అది జరిగే పని కాదు" అన్నాడు దిగు లుగా.

"నా ఓర్పును ఇక్కడ ఇలా వృథా చేయడం కంటే, పెదపట్నం వెళ్ళి విమలను వెతకటంలో ఉపయో గించడం మంచిదని నాకు అనిపిస్తున్నది" అన్నాడు శంకరం. పరమేశం, గంగరాజు వద్దని బ్రతిమాలారు. శంకరం వినలేదు. చివరకు, "వెడితే వెళ్ళు గానీ, నీ భార్య అనుమతి తీసుకుని వెళ్ళు, దానికి తెలియ కుండా వెళ్ళావంటే, అది బ్రతకదు" అన్నాడు పర మేశం.

కమలని ఒప్పించడమెలా అని శంకరం బెంగ

పడ్డాడు. కానీ, చిన్ననాడు తప్పిపోయిన తన అక్కను వెదకి తీసుకొస్తానంటే కమల సంతోషంతో ఎగిరి గంతేసి, "తప్పకుండావెళ్ళి, త్వరగా వచ్చేయి" అంది.

అక్కకోసం కమల ఎంతలా ఎదురుచూస్తున్నదో అర్థమైన శంకరం, "నీ అక్క విమలను తప్పకుండా తీసుకొస్తాను. కానీ, నేనొచ్చేదాకా నువ్వు ఏ పెంకితనం చేయకుండా బుద్ధిగా ఉండాలి. మామయ్యనీ, మా నాన్ననీ ప్రేమగా చూసుకోవాలి. అప్పుడే మీ అక్క నాకు కనిపిస్తుంది, దొరుకుతుంది" అన్నాడు. కమల బుద్ధిగా తల ఊపింది. అంతే కాదు, తన మాట నిలబెట్టుకుని ఎంతో బుద్ధిగా ఉంది. ఆమెలోని మార్పుకు గంగరాజు, పరమేశం చాలా సంతోషించారు.

రెండుమాసాలు గడిచిన తర్వాత శంకరం ఇంటికి తిరిగొచ్చాడు. అతడితోపాటు కమల ఈడుదే ఓ యువతి ఉన్నది. శంకరం ఆమెని పరమేశానికి చూపించి, "చూశావా మామయ్యా, మొత్తంమీద అన్నమాట నిలబెట్టుకున్నాను. నీ పెద్దకూతురు విమలను తీసుకుని వచ్చాను!" అన్నాడు గర్వంగా.

పరమేశం ఆశ్చర్యంగా ఆ యువతిని చూస్తూ, "ఇది నాకూతురు అని నీకు ఎలా తెలిసింది? నీకు నేనేగుర్తులూ చెప్పలేదు కదా!" అన్నాడు.

"నీ కూతురెలా ఉంటుందో నాకు తెలియదు. కానీ, నీ అల్లుణ్ణి చూశాను. అంతే, నాకు నీ కూతురి వివరాలు తెలిసిపోయాయి" అన్నాడు శంకరం.

"కూతురుతోపాటు అల్లుణ్ణికూడా తీసుకొచ్చావా? ఎక్కడ నా అల్లుడు?" అన్నాడు పరమేశం ఆత్రుతగా. "నీ పెద్దల్లుడు లోపలకు రావడానికి సిగ్గుపడుతున్నాడు. అందుకని వీధిలోనే ఉండిపోయాడు" అన్నాడు శంకరం నవ్వుతూ.

పరమేశం వీధిలోకివెళ్ళి చూసి ఆశ్చర్యపోయాడు. అక్కడ ఓ యువకుడు ఉన్నాడు. మేకకు తలపై కొమ్ములున్నట్లు అతడి చుబుకానికి కూడా శంకరంలాగే అటూఇటూ గెడ్డం క్రిందకు వ్రేలాడుతున్నది. "పెదపట్నంలో ఈ మనిషిని నేను చూశాను. వెంటనే నేనువెళ్ళి పలకరించి, 'నీ భార్య పేరు విమల కదా!' అని అడిగాను. అవునని చెప్పి, తన భార్యపేరు నాకెలా తెలిసిందని ఆశ్చర్యపడ్డాడు. అప్పుడు నా కథచెప్పి 'ఈ అక్క చెల్లెళ్ళిద్దరూ కవలలు కదా! ఇద్దరివీ ఒకే బుద్ధులు' అన్నాను. వెంటనే నీ అల్లుడు భార్యను వెంటబెట్టుకుని, నాతో బయలుదేరి వచ్చాడు. చెల్లెల్ని కలుసుకునేదాకా మొగుణ్ణి గెడ్డం అలాగే ఉంచుకోవాలని విమల పట్టుబట్టింది. అందుకని, నీ అల్లుడు ఈ వేషంతోనే ఇక్కడికి వచ్చాడు" అని చెప్పాడు శంకరం. పరమేశం ఎంతో సంతోషించి, "పోనీలే నాయనా! ఆ అక్కచెల్లెళ్ల బుద్ధులే విడిపోయినవాళ్ళను మళ్లీ కలిపాయి" అన్నాడు.

ఆ తర్వాత కమల, విమల ఆ ఇంట్లోనే స్థిరపడి ఎంతో బుద్ధిగా, భర్తలకు అనుకూలంగా కలిసి ఉంటూ, కలకాలం సుఖంగా జీవించారు.

ఈ కథవిన్న మహారాణి, "వినయశీలా, కథ వినగానే నాకో విషయం స్ఫురించింది. కమల సామాన్యురాలు. కాబట్టి, ఆమె పెంకితనంవల్ల, భర్త ఒక్కడు మాత్రమే ఇబ్బంది పడ్డాడు. నావంటి మహారాణి పెంకిదయిందంటే అందువల్ల, ఎందరో పౌరులకు ఇబ్బంది కలుగుతుంది. నాలో పెంకితనం ఉన్నదా అన్న విషయమ్మై, నేను ఆత్మవిమర్శ చేసుకోవలసి ఉన్నది. నీ కథలు నా మనసుకు హత్తుకుపోతూ ఉన్నాయి. ఇటువంటిదే రేపు మరో కథ చెప్పు. లేదా, వినోద ప్రదర్శనకు నీవు సిద్ధపడవలసి ఉంటుంది" అంది. మహారాణి ఇలా అనగానే, వినయశీలుణ్ణి ఆవహించిన నూరుకట్ల పిశాచానికి మరోకట్టు విడిపోయింది. మర్నాడు, వినోదప్రదర్శనకు ముందు యథాప్రకారం కథ వినడానికి మళ్లీ వచ్చింది మహారాణి. వినయశీలుణ్ణి ఆవహించి ఉన్న పిశాచం మరో కథ చెప్పడం ప్రారంభించింది.

నవ్య

## సుధామ పదగారడి-325

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ❖ | 2 | | 3 | | | ❖ | 4 |
| 5 | | ❖ | ❖ | | ❖ | ❖ | 6 | |
| ❖ | ❖ | 7 | ❖ | 8 | 9 | 8 | | ❖ |
| ❖ | 10 | | | ❖ | | ❖ | 11 | 12 |
| 13 | 11 ❖ | | ❖ | ❖ | ❖ | 14 | ❖ | |
| 15 | 16 | 15 ❖ | 17 | ❖ | 18 | | | ❖ |
| ❖ | 19 | | | 20 | ❖ | | ❖ | ❖ |
| 21 | | ❖ | ❖ | | ❖ | ❖ | 22 | 23 |
| | ❖ | 24 | | | | | ❖ | |

**ఆధారాలు**

**అడ్డం**

2. రాఖీ పూర్ణిమనాడు కట్టే రాఖీకి సంకేతం (5)
5. చిన్నసోదరి (2)
6. పెద్ద సోదరుడు (2)
8. నర్తనశాల (4)
10. చుట్టరికము (3)
11. ఉత్సవ కార్యవిశేషము (2)
15. టి.బి. అనే రోగం (2)
18. పుట్ట (3)
19. మిడుత (4)
21. హాస్టల్‌లో ఉండే విద్యార్థులు ఇందులో భోం చేస్తారు ఎక్కువగా! (2)
22. దుఃఖము, హాని (2)
24. అన్నాచెల్లెళ్ళ మధ్య వుండేది (5)

**నిలువు**

1. టపా, వరుసలో ఒకటి (2)
3. ఎవరిదైనా ఇది బయటపడితే ప్రమాదమే మరి! (3)
4. నవనీతం (2)
6. మిక్కిలి, పరిలేని అపరిమితం (3)
7. '...మున పనులు సమకూరు ధరలోన!(3)
9. మువ్వ (2)
12. ఏవీయస్ తృప్తి! (2)
13. అరలక్షకు అల కొట్టుకుపోయింది (2)
14. ఆదికవి, రామాయణ కృతికర్త (3)
16. కీర్తి (3)
17. అరటిచెట్టుకు దేవవేశ్య పేరుంది(2)
20. ముదరాకు చివరకు రాలిపోయింది (3)
21. సోపానములు (2)
23. బుద్ధం శరణం, సంఘం శరణంతోబాటు ఇదీ శరణం గచ్ఛామి! (2)

### పదగారడి-324 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 1 తి | 2 ల | క్ | | 3 లో | 4 క | ము | |
| 5 సి | | బ్ధి | | 6 హా | | జ | | 7 గాం |
| 8 నా | రు | | 9 క | వి | | 10 లం | బా | డ |
| ర | | 11 స | | 12 త్రి | 13 ష | | | వం |
| | 14 ప | రా | 15 మం | | 16 రా | 17 దా | యి | |
| 18 ఉ | | | 19 చి | 20 తి | | త్రి | | 21 స్వా |
| 22 ద్యో | త | 23 ము | | 24 రి | క్క | | 25 జ | 26 తం |
| గం | | ర | | వెం | | 27 స | | త్ర్యం |
| | 28 కా | ళి | క | | 29 సే | భ | ము | |

Printed and Published by **VEMURI RADHAKRISHNA**, Managing Director on behalf of Aamoda Publications Pvt. Ltd., Published at Plot No:76, Ashwini Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad - 500 033, Phone No: (040)23558233/44, Fax No: (040) 23558288 and Printed at Aamoda Press, Survey No: 70/1 & 2, Vedurupavuluru Village, Mustabad Grama Panchayathi, Gannavaram Mandal, Vijayawada, Krishna District, PIN: 521 107 on behalf of Aamoda Press, R.S No:191/3, Ward No:43, Donka Road, Patamata, Vijayawada 520 010, RNI No: APTEL/20047/12594, Editor : **A.N.JAGANNADHA SARMA**



# అప్పుడు భయపడ్డాను

## -హన్సిక

**అమ్మనూ, తోడబుట్టిన వారినీ ప్రేమించడంలో వింతేమీ లేదు. అలాగే భార్య భర్తనీ, భర్త భార్యనీ ప్రేమించడం పెద్ద విషయం కాదు. మనకి ఏమీ కాని వారిని ప్రేమించడం, చేరదీయడం, వారిని పెంచి పెద్ద చేయడమే పెద్ద విశేషం. దానికి పెద్ద మనసు కావాలి. అంతకన్నా పెద్ద సంకల్పం కావాలి. ఈరెండూ పుష్కలంగా ఉన్న హీరోయిన్ హన్సిక. తనకు ఏమీ కాని 30 మంది చిన్నారులను చేరదీసి వారికి అక్క అయింది... అమ్మ అయింది. వృద్ధులకు కూతురుగా మారి వారికో ఆశ్రమం ఏర్పాటు చేయబోతోంది. ఇంతమందిని ఇన్ని విధాలుగా ఆదుకుంటున్న హన్సిక మరికొందరిని కూడా ఆదుకోవాలని అంటోంది. అదేమిటో ఆమె మాటల్లోనే.....**

**ఈ మధ్య తెలుగులో అస్సలు కనిపించడం లేదు?**

తెలుగులో సినిమాలు ఎందుకు చేయడం లేదు? చేస్తున్నానుగా! 'గౌతమ్ నంద'లో చేశాను. మరో రెండు సినిమాలకు ఓకే చెప్పాల్సి ఉంది. తెలుగు పరిశ్రమ నాకు తల్లి లాంటిది. నేను ఇక్కడేపుట్టి పెరిగాను. నేను ఎన్ని భాషలలో చేసినా తెలుగులో చేసిన ఫీలింగ్ ఇంకెక్కడా కలగదు. ఇక్కడ సినిమా అనగానే సొంత ఇంట్లో ఉన్నంత హాయిగా అనిపిస్తుంది. నేను మాత్రమే చేయగలను అనుకున్న క్యారెక్టర్లను తప్పకుండా నాకే ఆఫర్ చేస్తారు.

**ఈ సినిమా ప్రమోషన్‌కి రాకపోవడానికి కారణం?**

సినిమా ప్రమోషన్ సమయంలో నేను యూరప్ ట్రిప్పులో ఉన్నాను. ఈ విషయం అక్కడికి వెళ్ళిన తరువాత తెలిసింది. అక్కడి నుంచి రావడం కుదరదు అని చెప్పాను. ఇదే విషయం ముందుగా చెబితే బాగుండేది.



**మాలీవుడ్‌లో సినిమా చేస్తున్నారట?**

అవును. మోహన్‌లాల్‌గారితో చేస్తున్నాను. అక్కడ ఇది నాకు మొదటి సినిమా. కొద్దిగా నెర్వ‌స్‌గా ఉంది. అంత పెద్దస్టార్‌తో మొదటి సినిమా అనగానే ముందు కొద్దిగా భయపడ్డాను కూడా! ఇప్పుడు ఆ భయం కొద్దిగా తగ్గింది. నాది గెస్ట్ రోల్, కానీ ప్రాధాన్యమున్న పాత్ర.

**ఈ సినిమాలో విలన్‌గా కనిపించబోతున్నారట?**

పూర్తి స్థాయి విలన్ కాదు. కొద్దిగా ఆ షేడ్స్ ఉంటాయి అంతే! ఇంతవరకూ నా కెరీర్‌లో అలాంటి పాత్ర చేయలేదు. అయితే అన్నీ అలాంటి పాత్రలు వస్తే మాత్రం చేయను.

**తల్లి అయ్యారు, భార్య ఎప్పుడు అవుతారు?**

దానికి ఇంకా సమయముంది. మరో ఐదారు సంవత్సరాల తరువాత పెళ్ళి గురించి ఆలోచిస్తాను.

**కోలీవుడ్‌లో ఓ వ్యక్తితో ప్రేమలో పడ్డారన్నది ఎంతవరకు నిజం?**

ఏ విషయం అయినా దాచుకునే మనస్తత్వం కాదు నాది. ఓపెన్‌గా మాట్లాడతాను. అలా ఉండేవారినే ఇష్టపడతాను. నేను ప్రేమలో పడ్డానన్నది నూటికి నూరుపాళ్ళు అబద్ధం. అలాంటిది ఏదైనా ఉంటే నేనే అందరికి చెబుతాను.

**భవిష్యత్తులో చేయబోయే సేవాకార్యక్రమాల గురించి...**

దేశాన్నీ, మనల్నీ ప్రతి క్షణం కంటికి రెప్పలా కాపాడుతున్న సైనికులకు ఏదైనా చేయాలని ఉంది. ప్రభుత్వం నుంచి వారికి అందేవి అందుతూనే ఉంటాయి. వీర సైనికుల పిల్లల కోసం ఓ కార్యక్రమం అనుకున్నాను. అది ఇంకా కార్యరూపం దాల్చలేదు. దానికి సంబంధించిన పనులన్నీ పూర్తయిన తరువాత నేనే అందరికీ చెబుతాను.

**టాలీవుడ్‌ని కుదుపుతున్న డ్రగ్స్ గురించి...**

దాని గురించి మాట్లాడడానికి నేను అర్హురాలిని కాదేమో! నిజానిజాలు తెలియకుండా కామెంట్ చేయడం అంత మంచి పద్ధతి కాదు. నిజాలు నిలకడ మీద తెలుస్తాయి. అంతవరకూ ఓపికపడితే సరిపోతుంది.

**పరిశ్రమలో వేధింపుల గురించి...**

నా వరకూ అలాంటి వేధింపులు ఎదురుకాలేదు. వాటి గురించి ప్రస్తుతానికి నో కామెంట్.

-ఎం.లాస్య

